# ఆంధ్రసచిత్రవారపత్రిక

10-16, అక్టోబర్, '86



● సంగీత సాహిత్యాలలో సర్వ మంగళ

● తల్లీ... నీకు శతకోటి దండాలు!

# ఫారెక్స్®
# తల్లుల మొదటి ఎంపిక!

## తన పాపాయికి ప్రేమతో తినిపించి పెంచే ప్రతి తల్లికీ తెలుసు: పాపాయి పెరుగుదలకై ఘన ఆహారాలను ప్రారంభించేటపుడు మొట్టమొదటి ఎంపిక ఇదే–ఫారెక్స్®.

ఎందుకంటే, మేలుపర్చబడిన ఫారెక్స్‌లో ముద్దుల పాపాయి పెరుగుదలకై అవసరమైన పోషణ పదార్థాలు సరియైన పాళ్ళలో కలవు.

- ఫారెక్స్‌లో పాపాయి పెరుగుదలకు అవసరమైనట్లు సరియైన పరిమాణంలో ప్రొటీన్లు; సున్నిత జీర్ణశక్తికి అనువుగా క్రొవ్వు పదార్థాలు కలవు.
- పుట్టిన నాలుగు నెలలకు, పాపాయికి తల్లి నుండి లభించిన ఐరన్ నిల్వ తగ్గిపోతుంది. పాపాయి రక్త-పుష్టికై ఫారెక్స్‌లో తగినంత ఐరన్ కలదు.
- దృఢమైన ఎముకలు, గట్టి పళ్ళకోసం ఫారెక్స్‌లో పాపాయి పెరుగుదలకు ఉత్తమ 2:1 నిష్పత్తిలో కాల్షియం, ఫాస్ఫరస్ కలవు.
- ఫారెక్స్‌లో పాపాయి బాగా ఇష్టపడి తినే రుచి కలదు.
- దీనిని కలపడం, తినిపించడం సులభం.




పాలు చేర్చే
అవసరం లేదు.
కేవలం నీళ్ళలో
కలిపి ఇస్తే చాలు

**ఫారెక్స్®–శ్రేష్ఠమైన ఘన ఆహారం**
**తల్లి ప్రేమకు ప్రతిబింబం**

CLARION/B/GX/15/244/TEL

మొదట మొదటగా నేను వంట పని మొదలెట్టినప్పుడు మంచినెయ్యే వాడమని చెప్పేవాళ్లు. "మంచి నెయ్యే మనదేశపు అసలు సువాసన" అనేది మా అమ్మ. ఆవిడమాట నిజమే. అయితే ఇరవై ఏళ్ల తర్వాత నాకంత కంటే మంచిదే దొరికింది. అదే—సన్‌ఫ్లవర్ వనస్పతి. రుచిలో ఇది మంచినెయ్యి తర్వాత దానంత మంచిది. పైగా పుష్టికరమైనదీ, చౌకైనదీ కూడాను. ఈ వంటకం సన్‌ఫ్లవర్ వనస్పతిలో చేసి మీకై మీరే చూసుకోండి.

**వెజిటబుల్ పఫ్స్**

**దినుసులు**

మైదా పిండి 150 గ్రా.
సన్‌ఫ్లవర్ వనస్పతి (మొదటివాయి) 15 గ్రా.
ఉప్పు 2 గ్రా.



**క్రీమింగ్**

సన్‌ఫ్లవర్ వనస్పతి (రెండోవాయి) 50 గ్రా.
బియ్యపు పిండి 5 గ్రా.

**ఫిల్లింగ్**

పచ్చి బఠాణీలు 50 గ్రా. • కారట్లు 50 గ్రా.
ఉల్లిపాయలు 50 గ్రా. • బంగాళాదుంపలు 50 గ్రా.
బీన్సు 100 గ్రా. • ఉప్పు 5 గ్రా. • పచ్చి మిరపకాయలు 2 గ్రా.
ఆవాలు 1 గ్రా. • నిమ్మకాయ ½
పసుపు చిటికెడు • కొత్తిమిర 2 కాడలు
కరివేపాకు 1 ఆకు
సన్‌ఫ్లవర్ (వేయించడానికి) 15 గ్రా.

# తంగం ఫిలిప్*
# ఏమంటున్నారో వినండి.



## "ఈ దినుసు గురించి తెలుసుకోడానికి నాకు ఇరవై ఏళ్లు పట్టింది."

**చేసే పద్ధతి**

1. పిండి, ఉప్పు కలపండి.
2. మొదటివాయి సన్‌ఫ్లవర్ వనస్పతిని పిండిలో వేసి బాగా కలపండి. నీళ్లుపోసి మెత్తటి ముద్దగా కలపండి.
3. ఆ పిండిని సమభాగాలుగా విభజించి ఉండలుగా వత్తండి.
4. బియ్యపు పిండిని రెండోవాయి సన్‌ఫ్లవర్ వనస్పతిని కలిపి ముద్దగా చేయండి.
చల్ల నీళ్లలో ఉంచండి.



5. ఈ పిండిని మైదా ఉండలపైన పూసి ఒకదాని మీద ఒకటిగా 3 ఉండల దొంతర చేయండి.
6. 2.5 సె.మీ. (1") ముక్కలుగా కోయండి.
7. ఒక్కొక్క ముక్కనూ పల్చగా వత్తి గుండ్రంగా చేయండి.
8. కూరల మిశ్రమాన్ని నింపి అర్ధ చంద్రాకారంగా మడవండి. అంచులు బాగా అదమండి.
9. ఎర్రగా వేయించి. నూనె ఓడ్చండి.

**ఫిల్లింగ్**

1. పచ్చి మిరపకాయలు, ఉల్లిపాయలు పల్చగా తరగండి. కారట్లు, బీన్సు, బంగాళాదుంపలు సన్నగా తరగండి.
2. వనస్పతి వేడి చేయండి. ఆవాలు వేసి చిటపటలాడగానే అందులో కూరల ముక్కలు, ఉల్లిపాయ ముక్కలు, పచ్చి మిరపకాయ ముక్కలు, పసుపు వేయండి. కొద్దిగా నీళ్లు చల్లి, బంగాళాదుంపలు ఉడికేదాకా (దాదాపు 15 నిముషాలు) సన్నని మంటపైన ఉడకనివ్వండి.
3. ఉప్పు వేసి 5 నిముషాలపాటు బాగా కలపండి. నిమ్మరసం, కొత్తిమిర కలిపి దించెయ్యండి.

ఈ వంటకంలో అడుగడుగునా సన్‌ఫ్లవర్ వనస్పతిని వాడిన విషయం మీరు చూడవచ్చు. ఇందువల్ల దీని రుచిలో ఎంతో తేడా వస్తుంది. స్వయంగా చేసి చూడండి, ఆ రుచిలో తేడా మీరే తెలుసుకోండి.

* ఫుడ్ స్పెషలిస్ట్ మరియు న్యూట్రిషనిస్ట్






Closer to the consumer

WPL-2807

**సన్‌ఫ్లవర్ వనస్పతి—మంచినెయ్యి మాత్రమే దీన్ని మించగలది.**

# పెప్సీ కోలా వ్యవహారం!

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

పంజాబ్ సంక్షోభాన్ని రాజీవ్ గాంధి నుంచి పెప్సీ కోలా దాకా అంతా తమ స్వార్థానికి వాడుకుంటున్నారు పంజాబ్ వల్లనే రాజీవ్ గాంధి ఇప్పుడు ప్రదాన మంత్రిగా ఉన్నారు ఆ సమస్య లేకుండా పోతే ఆయన ఎక్కడ ఉంటారో ఆ దేవుడికే తెలియాలి పంజాబ్ సమస్య లేకపోతే బర్నాలా, అలాగే ప్రకాశ్ సింగ్ బాదల్ కూడా వారి వారి గ్రామాలలోని తమ వ్యవసాయ క్షేత్రాలలో భూమిని సాగు చేస్తూ ఉండి ఉండేవారు పంజాబ్‌ని మినహాయిస్తే పెప్సీ రంగంలోకి వచ్చి ఉండేదికాదు తాతాలతో సహా అంతా దానికి సహాయపడ్డారు ఒకప్పుడు బొంబాయిలో పార్సీల గుత్తాదిపత్యంలో ఉన్న సోడానీళ్ల పరిశ్రమలోకి దూకటానికి తాతాలు అకస్మాత్తుగా నిర్ణయం తీసుకున్నారు

ఎలా చూసినా ఈ పెప్సీ వ్యవహారం అర్థం లేనిదిగానే కనిపిస్తుంది పెప్సీ తయారు చేసే ఆ కోలాలో ప్రత్యేకత అంటూ ఏదీ లేదు ప్రపంచంలో ఎన్నో కంపెనీలు వాటి వాటి కోలాలని ఉత్పత్తి చేస్తున్నాయి 1977లో జనతా ప్రభుత్వం కోకాకోలాని దాని రహస్య ఫార్ములా అనబడే దానిని వెల్లడించ లేదన్న కారణంగా, బయటికి తరమటం జరిగిందన్నది ఒక పెద్ద మాయలాంటిది పెప్సీ విక్రయించే బంగాళ దుంప చిప్స్, టొమాటో రసంతో తయారు చేసిన పదార్థాలలో కూడా ఎలాంటి ప్రత్యేకతా లేదు అనాదిగా అటువంటివి ఈ దేశంలోనూ, ఇతర చోట్లా తయారు చేస్తూనే ఉన్నారు ప్రత్యేక తరహా పంటలు, కూరగాయలు పండించటంలో కొత్త కంపెనీకి సహాయ పడతానని పెప్సీ అంటున్నది కానీ అది ఒక బూటకపు హామీ లాంటిది అటువంటి వాటిలో పెప్సీకి ఎలాంటి నైపుణ్యం లేదు ప్రపంచంలో అది ఇంతకు పూర్వం ఎక్కడా అలాంటిది చెయ్యలేదని పెప్సీ కంపెనీ వార్షిక నివేదికని చూస్తే తెలుస్తుంది మరి పెప్సీ భారత దేశానికి ఎందుకు వస్తున్నట్లు, దాని మీద రాజీవ్ గాంధీ ప్రభుత్వానికి ఎందుకు అంత ఆసక్తి?

ఇక్కడికి అది బూటకపు సాకులతో వస్తున్నది అది కేవలం మామూలు సోడా నీళ్ల కంపెనీలాగే ఈ దేశానికి వస్తున్నది ఈ బంగాళదుంప చిప్స్, టొమాటో రసం నించి చేసే ఉత్పత్తులన్నవి తర్వాత వచ్చినటు పంటి ఊహలే తటస్థ రాజ్యాలనబడే వాటికి వ్యవసాయానికి సంబంధించిన విషయాలలో తన నైపుణ్యాన్ని అందించటానికి బారతదేశం సంతోషంగా అంగీకరిస్తుందని ఇటీవల హరారేలో రాజీవ్ గాంధీ చెప్పారు వాటిని తటస్థ రాజ్యాలనబడేవి అని ఎందుకన్నానంటే ఆ దేశాలలో కొన్నిటి వరుస విషయంలో నాకు పెద్ద అనుమానాలు ఉన్నాయి ఒక చెంప ఆ దేశానికి మన నైపుణ్యాన్ని అందిస్తామంటూ మరో వంక బంగాళ దుంప చిప్స్, రసాల తయారీకి కోట్ల డాలర్ల విలువైన ఒప్పందం ఒక దానిని కుదుర్చు కోవటం అన్నది మనకి సిగ్గుచేటు సోడా నీళ్ల వ్యాపారంలో [illegible] చేసుకుంటుంది శీతల పానీయాల వ్యాపారంలో లాభాలు విపరీతంగా దాదాపు 60 నుంచి 80 శాతం వరకూ, ఉంటాయి అసలు ఈ దేశానికి దాని వల్ల ఒరిగేదేమిటి అన్నది ముఖ్యమైన విషయం

దాని వల్ల ఈ దేశానికి ఎటువంటి ప్రయోజనం లేదు గత ఎన్నో ఏళ్ళుగా మనం చెయ్యని దంటూ ఏమీ పెప్సీ చెయ్యబోవటం లేదు అది కూడా విదేశీ సహకారంతో తయారు చెయ్యాల్సిందేమికాదు ప్రపంచంలో ఉత్తమ విజ్ఞాన శాస్త్ర వేత్తలన్న వారు మనకి ఉన్నారు పెప్సీ తీసుకు వచ్చే అమెరికన్ విశ్వవిద్యాలయాలలోని శాస్త్ర వేత్తల కన్నా మనవాళ్ళకే ఎక్కువ తెలుసు ఆశ్చర్యం ఏమిటంటే ఢిల్లీలో ఉన్న వారికి ఇది అంతా తెలుసు, తాతాలకి కూడా తెలుసు జెమ్‌షెడ్ జీ తాతా మొదలు కొని గత వంద సంవత్సరాలకి పైగా, దేశంలో శాస్త్ర సాంకేతిక విజ్ఞానాభివృద్ధిలో తమ సంస్థల సముదాయం నిర్వహిస్తున్న ప్రధాన మైన పాత్ర గురించి జె ఆర్ డి తాతా చెపుతూనే ఉన్నారు ఉక్కు, ట్రక్కులు ఉత్పత్తి చేసే ఆ కంపెనీ ఇప్పుడు ఉన్నట్లుండి పక్కదారి పట్టి సోడా నీళ్ల కంపెనీకి అనుమతి కోసం ప్రభుత్వాన్ని ఒత్తిడి చేస్తున్నది దానికి కారణం తాతా కంపెనీలోని కొందరు అధికారులు, పంజాబ్‌లోని కొంత మంది రాజకీయ వాదులు – వాళ్లలో కొందరు అకాలీలకి బాగా సన్నిహితులు– ఈ కొత్త వ్యాపారంలో ఉన్న దేదో గ్రహించటం వల్లనే

వాళ్ళు ఆ విధంగా ఎందుకు చేస్తున్నారు? రాజీవ్ ప్రభుత్వానికి బారత దేశంపై విశ్వాసం లేదు కాబట్టి స్వావలంబనం మొదలైన వాటి గురించి రాజీవ్ ప్రభుత్వం పెద్దగా చెబుతుంది ఎందుకంటే అటువంటి వాటి గురించి మాట్లాడటం అన్నది ఒక ఫాషన్ కాబట్టి మనది వెనుకబడిన దేశం అని రాజీవ్ పదే పదే చెబుతారు ఎన్నో సంవత్సరాలు వెనుకబడి పోయామని అధునికీకరణ జరగక పోతే మనం ముందుకి సాగలేమని అన్నారాయన అంత వరకూ బాగానే ఉన్నది కానీ అధునికీకరణ అన్నది ఎలా సాధ్య పడుతుంది? మరిన్ని కోలాలు ఉత్పత్తి చెయ్యటం వల్లనా, పెప్సీకోలా, కోకా కోలాలని తీసుకు రావటం వల్లనా? లేక జపాన్ వారిలా మనమే స్వయంగా మనకి కావలసినవి తయారు చేసుకోటం ద్వారానా? అందుకు మనకి తగినంత ఆత్మ విశ్వాసం ఉండాలి మనకి ఇప్పుడదే కొరతగా ఉన్నది పెప్సీ, కోకా కోలా వంటి కంపెనీలు దానిని మరింత చెడగొడతాయి

ఈ ప్రభుత్వానికి ప్రాధాన్యత దేనికి ఇవ్వాలో తెలియదు ముయ్యని చప్పుడు చేసే ఈ శీతల పానీయాలు మిగతా ముఖ్యమైన అవసరాలకన్నా ప్రాధాన్యత కలిగినటువంటివా? పత్రికలలోని వార్తలు నిజమైతే బర్నాలా, బల్వంత్ సింగ్ బృదం పన్ను కట్టే వారి కర్చుతో తరచూ ఢిల్లీ వెళ్లి ముఖ్యమైన సమస్యలని వదలి పెట్టి తమకి ఇష్టమైన ఇలాంటి పథకాలకి ప్రాముఖ్యత నిచ్చి త్వరగా మంజూరు చేయించు కుంటున్నారు దాని కోసం వాళ్ళు విలువైన సమయాన్ని వృధా చేస్తున్నారు ఇందులో ఒకరకమైన బెదిరింపు కూడా ఇమిడి ఉన్నది ఈ కొత్త పథకం 20 వేల మందికి ఉద్యోగావకాశాలని కల్పిస్తుందని బర్నాలా అంటున్నారు ఆ పథకంలాగే ఆ లెక్కలు కూడా బూటకమే అసలు ఆ పథకాన్ని పెప్సీ లేదా తాతాల సహాయం లేకుండా బర్నాలా బృందమే ఎందుకు చేపట్టకూడ దన్నది అర్థంకాని విషయం అలాంటి ప్రాజక్టులు ఒక డజను నెలకొల్పటానికి తగిన నైపుణ్యం మన దేశంలోనే ఉన్నది ఎందుకంటే బారతీయులకి చెందిన శీతల పానీయాల కంపెనీలు ఎన్నో విదేశాలలో ఉన్నాయి అవి లాభసాటిగానే నడుస్తున్నాయి నిజంగానే తాతాలకి పంజాబ్‌లో బంగాళ దుంప చిప్స్, టొమాటో సాస్‌లు తయారు చేయాలన్న ఉద్దేశమే ఉంటే అది వాళ్ళకి చాలా తేలిక అయిన పని వాళ్ళు బొంబాయిలోని హోమి మోదీ రోడ్డుని దాటి ఎవర్ట్ హౌస్‌కి వెళ్తే చాలు అందులో అలాంటి కంపెనీలు ఎన్నో ఉన్నాయి వాటిలో తాతాలకి వాటాలు కూడా ఉన్నాయి నిన్న కాక మొన్న రిలయన్స్‌కి చెందిన అంబానీలని నిందించిన దేశభక్తులంతా ఇప్పుడు ఎక్కడికి పోయారు? భారతీయ చట్టాలని ఉల్లంఘించి కొద్దిగా డబ్బుని రహస్యంగా చేసుకున్నారనే కదా వాళ్లపై చేసిన ఆరోపణ? అంబానీలది పూర్తిగా భారతీయ సంస్థ సోడా నీళ్ల వ్యాపారంలో పెప్సీ వినియోగించే సాంకేతిక నైపుణ్యానికి దూరంగా ఉన్న వేరే ఒక ప్రపంచంలో అంబానీలు ఉన్నారు నాకు తెలిసినంత వరకూ వాళ్ళు కృత్రిమ నూలు లేదా, వస్త్రాల తయారీలో విదేశీ సహకారం తీసుకోలేదు విదేశీ పెట్టుబడి అంతకంటే లేదు కానీ వంద సంవత్సరాల చరిత్ర ఉన్నటు వంటి ఈ తాతా కంపెనీ సాంకేతిక విజ్ఞానం పేరుతో ఒక విదేశీ సోడా నీళ్ల కంపెనీతో ఒప్పందం చేసుకోటానికి సంసిద్ధమైంది అది కూడా రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల మద్దతుతో జీవన్మరణ సమస్య లాంటి తీవ్రమైన విషయాలలో పంజాబ్ ప్రభుత్వం మునిగి ఉండ వలసిన ఈ సమయంలో అన్నిటి కన్నా అలాంటి ఒప్పందానికి ప్రాముఖ్యతని వాళ్ళు ఇవ్వటం ఆశ్చర్యం కలిగిస్తుంది డబ్బు, లేదా ధన దాహం అన్నది ఎన్నో విచిత్రాలు చేస్తూ ఉంటుంది కానీ ఈ పెప్సీ వ్యవహారాన్ని మించిన విచిత్రం లేదు

# మయూరి

సచిత్ర వారపత్రిక

అందిస్తున్న రెండు అపురూపమైన కానుకలు!



● చిత్రసీమలో అగ్రశ్రేణి రచయితలు

## పరుచూరి బ్రదర్స్

మొట్టమొదటిసారిగా పత్రికా పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న సంచలనాత్మకమైన
సీరియల్
నవల... **భరతఖండం భగ్గుమంటోంది**
దసరా సంచిక నుంచి ప్రారంభం!



● అచిరకాలంలోనే అశేష పాఠకుల
ఆదరాభిమానాలను చూరగొన్న

## కొమ్మనాపల్లి గణపతిరావు

సీరియల్ నవలాప్రభంజనం-
**అగ్నిహోత్రుడు** దీపావళి సంచిక నుంచి ప్రారంభం!

CHANDRA

## మీకోసం ప్రత్యేకం

# ఒక సాంకేతిక అద్భుతం......



## ఫ్యాంటసీ కలర్ టివి. యొక్క ప్రత్యేకత ఏమిటి?

మేలైన ప్రదర్శనకు దోహదం చేసే గ్రహణ శక్తి, మరియు లోకాతీతమైన రంగులు మీకు సమర్పించడం కోసం కేవలం ప్రతి ఫ్యాంటసీ టివి. సెట్టులో చూపెట్టబడే అత్యధికమైన శ్రద్ధ.

ప్రపంచానికి వున్నత శ్రేణులైన ఫిలిప్సు వారి సరిక్రొత్త సాంకేతిక పరిజ్ఞానాన్ని, పరికరాలను పరిపొందించుకొని తయారైనది ఫ్యాంటసీ కలర్ టి.వి.

ఫ్యాంటసీ కలర్ టి.వి. తో (పిక్చర్ ట్యూబ్‌తో సహా) ఒక సంవత్సరపు వారంటీ ఇవ్వబడుతుంది. ఒక వేళ అవసరమొస్తే ఒక్క ఫోన్ చేస్తే చాలు. తక్షణం, సమగ్రమైన, విశ్వసనీయమైన సేవ హాజరు.

వెంటనే మీకు సమీపంలో ఉండే డీలరు వద్దకు వెళ్ళి ఫ్యాంటసీ ప్రదర్శన పరికించండి. ఫ్యాంటసీ గుణగణాలు తప్పక మీ నిర్ణయానికి దోహదం చేస్తాయి.

అందుకే మీరు కలర్ టి.వి. లో కోరుకొనే లక్షణాలన్నీ "ఫ్యాంటసీ" సంతరించుకొంది.



**FANTASY**

**COLOUR TV**

MAA(S) H VE 86

12, Progressive Towers, 6-2-913 & 914, Khairthabad, Hyderabad-500 004

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1936-1972)

10-16 అక్టోబరు 1986
శ్రీ అక్షయ నామ సం ఆశ్వయుజ శు సప్తమి
సంపుటము 79 : సంచిక 6

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

విడి ప్రతి వెల రు 2.75
పోస్టులో 6నెలల చందా రు 78.00
పోస్టులో 12నెలల చందా రు 156.00

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక


ముఖచిత్రం :
మహిషాసుర మర్దిని
(ఫొటో సురేష్‌చంద్ర బచావత్)

కథలు :

| | |
|---|---|
| అర్చన | 17 |
| సాత్త్వక సిద్ధి | 31 |
| తల్లీ నీకు శతకోటి దండాలు! | 34 |
| 'జీవితాన్ని జీవించు' | 54 |
| గాలివాన వెలిసింది | 68 |
| వద్దు బాబోయ్! పెళ్ళొద్దు!! | 74 |

సీరియల్ నవలలు:

| | |
|---|---|
| కరిగిన శిల | 8 |
| పావని | 24 |
| సంకెళ్ళెవరికి?. | 48 |
| నిశ్శబ్ద సంగీతం- | 62 |

వ్యాసాలు, శీర్షికలు :

న్యూఢిల్లీలేఖ-4, ఉత్తరాలు-7, డాక్టర్ సలహాలు-14, సంగీత సాహిత్యాలలో సర్వమంగళ-15, వ్యక్తిగతం, వారఫలం-16, ప్రశ్నావళి-22, విజయశాంతి సమాధానాలు-40, అభిమాన తారలపై అభిప్రాయం!-41, సినిమా విశేషాలు-42, ఇ 'వేమన' పద్యాలు-58, పుణ్యక్షేత్రాల నిలయం రాజమహేంద్రవరం-60, ధర్మపథం-65, బైద్యనాథ్ ఆరోగ్య దీపిక-66, మహిషాసుర సంహారం-72, ఫాలాక్షునె డైరీ-73, హైదరాబాద్ నోట్‌బుక్-80, సీక్రెట్ ఏజంట్ విక్రమ్-82





### శుభాకాంక్షలు

మా పాఠకులు, రచయితలు, రచయిత్రులు, ఏజంట్లు ప్రకటన కర్తలందరికీ దసరా శుభాకాంక్షలు.

—సం.

### వినాయక చవితి ప్రత్యేక సంచిక

వినాయక చవితికి ఆది దంపతుల ఆశీర్వాదంతో బొజ్జగనపయ్య రంగుల ముఖచిత్రం, నాకు నచ్చిన జోకులు కొత్త శీర్షిక, రాళ్ళపల్లి గారి వినాయకుని విచారం చిన్నకథ హాస్య వ్యంగ్య రచనగా ప్రస్తుత వ్యవస్థలోని అవస్థకు తేలు కాటులా పని చేయడంలో చిత్రం లేదు

శ్రీమతి ఇల్లిందల సరస్వతిదేవి గారి నవలిక వెర్రితల్లి – కడుపు తీపి" ఎంతో బాగుంది

'జీవితం చేజారిందా' సీరియల్ అనుకోని విధంగా ఆకస్మాత్తుగా, తన తప్పు తెల్సుకొని ప్రభాకర్ పాత్ర పశ్చాత్తాపం పడడంతో ముగింపు బాగుంది అయినా చేతులు కాలాక ఆకులు పట్టుకున్న పద్ధతి పాత్రగా అన్పించింది

-కీర్తి కిష్టయ్య, లక్ష్మీదేవిపల్లి

★ ★ ★

వినాయకుని ముఖచిత్రంతో వెలువడిన 5–11 సెప్టెంబర్ సంచికలో ముఖ్యంగా 'వెర్రితల్లి– కడుపు తీపి' పూర్తి నవలిక కడు పసందుగా, రమ్యంగా, రసవత్తరంగా సాగింది ఇంత మంచి నవలికను అందించిన రచయిత్రి, ఇల్లిందల సరస్వతీ దేవిగారికి సాహితీ కుసుమాంజలి అలాగే బొమ్మల సీరియల్ 'సీక్రెట్ ఏజెంట్ విక్రమ్" సాహసోపేతంగా, సరికొత్త పంథాలో సాగిపోతుంది

ఇంకా ప్రత్యేకంగా సినీ నటుడు – రాళ్ళపల్లి సుజాత, శ్రీలక్ష్మి గార్లు పాఠకులకు అందించిన హాస్య రచనలు, రామకృష్ణారెడ్డి (కొత్త నటుడు) పరిచయం – ప్రత్యేక కార్టూన్‌లు, వ్యాసాలు ఈ సంచికకు శోభాయమానంగా నిలచాయి

-కె యస్ రామిరెడ్డి,
కె శాయిలీల, నందివెలుగు

★ ★ ★

5, 11, సెప్టెంబర్ వినాయకచవితి ప్రత్యేక సంచిక వినాయకుని ముఖచిత్రం ప్రసంసనీయం

ఎన్ని విధాలుగా కష్టపెట్టినా హరిశ్చంద్రుడు సత్య వ్రతాన్ని విడువలేదు అవమానం పాలయినది విశ్వామిత్రుడు మాత్రమే మొండి పట్టుదల వలన అనర్థానికి మన పురాణ గాథలే ప్రబల సాక్ష్యం ధర్మపథం శీర్షికలో బులుసు వేంకటరమణయ్యా గారు చక్కగా వివరించారు

-జిట్టా రమణిమోహన్, కడప

### సీరియల్స్

కాకాని కమలగారి "జీవితం చేజారిందా? సీరియల కథ ఆసక్తికరంగా సాగింది కాని ముగింపు బాగులేదు ప్రభాకర్ మూర్ఖంగా ఆవేశపడి, పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించుకున్నా, చివరిక్షణంలో నాని కోసం డబ్బు వెదజల్లి, బ్రతికించి సీతకు దక్కించి వుంటే బాగుండేది

-ఎన్. సులోచన, బాపట్ల

★ ★ ★

బెహరా వెంకటసుబ్బారావుగారి 'నిశ్శబ్ద సంగీతం' సీరియల్ ఎంతో ఆనందదాయకంగా ఉంది ఈ సంచిక తర్వాత సంచిక ఎంత త్వరగా వస్తుందా! ఎంత త్వరగా చదువుదామా! అను ఆతృతగా ఉన్నది ఈ సీరియల్ నేటి యువతకు ఎంతో సంబంధించినది రచయితకి కృతజ్ఞతలు

-బి ఎర్రమ్‌రాజు, కొత్తకోట

త్వరలో ప్రారంభం!
ప్రముఖ రచయిత్రి
శ్రీమతి ఆదూరి సావిత్రి
కొత్త సీరియల్ నవల
ఒడిలో చెలి మోహన రాగం

సీరియల్

# కరిగిన శిల

రావినూతల సువర్ణాకన్నన్



(గత సంచిక తరువాయి)

ప్రభాకర్ వెళ్ళేసరికి వాకిట్లో కనిపించిన దృశ్యం చూసి కొయ్యబారిపోయాడు

శ్యామల తల్లి వీదిలో పాడెమీద అంతిమయాత్రకి సిద్ధంగా వుంది ముఖం తప్ప శరీరమంతా పూలదండలతో మూసుకుపోయింది

సదా కళ కళలాడే వంశధార ఆ రోజు దీనంగా రోదిస్తున్నట్టుంది ఆ ఇంటి కుక్క యజమానురాలి మీది విశ్వాసంతో మూగవేదనతో శవం చుట్టూ ఆర్తిగా బాధగా తిరుగుతోంది

అయినవారు, పైవారితో 'వంశధార' ఆవరణంతా కిటకిటలాడిపోతోంది

శ్యామల, తల్లి శవంమీద పడి ఏడుస్తుంటే ఆమె బామ్మ తన దుఃఖాన్ని మింగేసి మనవరాల్ని ఓదారుస్తోంది

దర్పానికీ, ఠీవికీ మరో పేరైన రామారావు అతి దీనంగా పరామర్శలు అందుకుంటున్నాడు

తను చూసిన దృశ్యానికి కొయ్యబారిపోయిన ప్రభాకర్ నోట మాటరాక అలాగే నిల్చుండిపోయాడు.

అదిగో! అల్లుడుగారొచ్చారు!' అన్నారెవరో

తలెత్తి అల్లుడికేసి చూశాడు రామారావు అతన్ని చూడగానే అణిచిపెట్టిన దుఃఖం ఒక్కసారిగా తన్నుకొచ్చింది

ప్రభాకర్! మీ అత్తయ్య!' "పసివాడిలా ముఖాన్ని చేతుల్లో దాచుకొని భోరుమన్నాడు

ఆయన్నెలా ఓదార్చాలో అర్థంకాలేదు ప్రభాకర్‌కి మెల్లగా దగ్గరికెళ్ళి ఆయన చేతుల్ని ముఖాన్నుంచి తొలగించి తన చేతుల్లోకి తీసుకున్నాడు

రెండు నిమిషాల్లో తేరుకున్నాడు రామారావు జరగాల్సిన తతంగమంతా యాంత్రికంగా జరిగిపోయింది

మూడో రోజున ప్రభాకర్ వెళ్ళబోతూ మావఁగారి దగ్గరికొచ్చాడు

మావఁయ్యా! నేను పదో నాటికొస్తాను!" మెల్లగా అన్నాడు ప్రభాకర్

'అలాగే!" అన్నట్టు తలూపాడాయన ఆయనకి తెలుసు అల్లుడెంత బిజీ మనిషో!

ప్రభాకర్ భార్య గదిలో కెళ్ళాడు

తిరిగే ఫ్యాన్‌కేసి చూస్తూ ఏదో ఆలోచిస్తోంది శ్యామల ఆమె మనసంతా శూన్యంగా వుంది

లక్ష్మీదేవిలా కళ కళలాడుతూ తిరిగే అమ్మ క్షణాల్లో బూడిదైపోయింది ఇంక తన కడుపులో మాట చెప్పుకోవడానికెవరూ లేరు అనుకుంటే ఆమెకి దుఃఖం ఆగడంలేదు

శ్యామూ!

భర్త పిలుపుకి తృళ్ళిపడి పడుకున్నదల్లా చటుక్కున లేచి నిల్చుంది

కూర్చో శ్యామూ!'

'పరవాలేదు!'

పరవాలేదు కాదు! ముందు కూర్చో!' బలవంతంగా ఆమెని కూర్చోపెట్టి పక్కన తను కూర్చున్నాడు ప్రభాకర్

శ్యామల మౌనంగా కూర్చుంది.

నేను వెళ్తున్నాను!'

'అలాగే!' అన్నట్టు తలూపింది శ్యామల

శ్యామూ! నువ్వేవిఁటి మరి కృంగిపోయావ్?అమ్మ పోయిన బాధ సామాన్యమైంది కాదనుకో! కానీ మరి ఇంత బెంబేలుపడితే ఎలా చెప్పు! నువ్వేమీ ఆహారం తీసుకోవడం లేదని మీ నాన్నగారూ, బామ్మగారూ కూడా చెప్పారు! పోయినవాళ్ళతో మనమూ పోతామా? భార్య తల నిమురుతూ అనునయంగా అన్నాడు ప్రభాకర్

శ్యామల దానికి నోరు తెరవలేదు

ఆమె మౌనం తుఫాను ముందు ప్రశాంతతలా అనిపించిందతనికి

ప్లీజ్! శ్యామూ! ఏదైనా మాట్లాడు. గలగలా మాట్లాడే నువ్వలా ముభావంగా వుంటే ఏదోలా వుంది! అన్నాడు

"ఏమ్మాట్లాడను? నిర్జీవంగా నవ్వింది శ్యామల

'ఏదైనా సరే!'

"అమ్మ పోయే ముందు కూడా మీ గురించి అడిగింది"

"సారీ శ్యామూ! ఆపరేషన్స్ అవీ అయ్యేసరికి చాలా టైమయింది. అక్కడికీ ఫోన్ చేశాను కులాసాగానే వుందన్నారు తీరా బయల్దేరేసరికి ..."

'సరయు అడ్డొచ్చింది' అంతేనా?" కఠినంగా అంది శ్యామల

ఆమె గొంతులోని కాఠిన్యానికి తెల్లబోయాడు ప్రభాకర్.

"శ్యామలా! అన్నాడు మరో మాట రాక.

"ఏవిఁటి?" కొట్టినంత దూకుడుగా అంది శ్యామల.

'అసలేం జరిగిందంటే ."

**జరిగిన కథ-15:** డా ప్రభాకర్, డా. మోహన్‌రావు జరిపిన ఇంటర్వ్యూకి వెళ్తుంది సరయు సరయు రాసిన ఉత్తరం పదే పదే గుర్తొచ్చి రమణ మనసుని అల్లకల్లోలం చేసేస్తోంది. సరయు ప్రభాకర్ నర్సింగ్‌హోమ్‌లో ఉద్యోగంలో చేరుతుంది. సరయు అడ్రసు కావాలంటూ వనజ ఇంటికి వస్తాడు రమణ సరయుకి వివాహం అయ్యిందని, ఆమె ఇప్పుడు ఎక్కడున్నదీ తనకి తెలీదని చెపుతుంది వనజ ప్రభాకర్, సరయూలను అనుమానిస్తుంది శ్యామల. రమణ చిన్నా పేరిట చిన్నా శాంతి హోమ్ స్థాపిస్తాడు. డా. సుగుణ రమణకి చేరువయ్యి ప్రాణస్నేహితురాలైంది.

"మీ సంజాయిషీ నేనడగలేదు.

"నువ్వడక్కపోయినా చెప్పడం నా విధి! ఆ రోజు సాయంత్రం

అతని మాట పూర్తి కానేలేదు

'ప్లీజ్, మీరేం చెప్పద్దు!'

రెండు చేతుల్లోనూ ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్న భార్యని చూస్తూ అయోమయంగా కూర్చుండిపోయాడు ప్రభాకర్

కూతురు ఏడుపు విన్న రామారావు ఆతృతగ్గా వచ్చి -

'చూశావా నాయనా! ఇదీ వరస! ఏం చేస్తాం చెప్పు! భగవంతుడి పిలుపొస్తే ఎవరు మాత్రం ఆపగలరు?' అన్నాడు కూతురి తల నివురుతూ

★ ★ ★ ★ ★ ★

ఒకరోజు వురువుఁ లేని పిడుగులా వచ్చిపడింది సుగుణ రమణ దగ్గరికి

"ఏవిఁటి సంగతి?" నవ్వుతూ ఆహ్వానించాడతను

"మీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి!" అంది సుగుణ అతనికెదురుగా వున్న కుర్చీలో కూలబడుతూ

"ఏవిఁటో అంత ముఖ్యమైన విషయం? ' నవ్వుతూ అన్నాడు రమణ

"చాలా ఇంపార్టెంట్ న్యూస్! మీరు జాగ్రత్తగా వినాలి!"

"ఓ! కే చెప్పండి! '

"చెప్పాక నా మాట కాదనకూడదు!" కండిషన్ పెట్టింది సుగుణ

"ముందు విషయం చెప్పండి సుగుణా!" నవ్వుతూనే అన్నాడతను

"మీరు పెళ్ళి చేసుకోవాలి!"

"పెళ్ళా? నేనా?" తృళ్ళిపడ్డాడు రమణ

"అవును మీరే!"

"అలాగే పిల్లని చూశారా?" చిన్నగా నవ్వాడతను

'ఆఁ! చూశాను .. పిల్ల ఎవరో కాదు మా పిన్ని కూతురు, పేరు రాగిణి! చాలా బావుంటుంది. ఈ రోజు అనుకోకుండా వచ్చింది దాన్ని చూడగానే మీకు భార్యగా బావుంటుందనిపించింది అంతే కాదు మీక్కూడా నచ్చుతుందని అనిపించింది అందుకే పరిగెత్తు కొచ్చాను! అంది సుగుణ వుత్సాహంగా

'ఏవిఁటి! మీరు నిజంగానే అంటున్నారా?" ఆమెనే నిశితంగా చూస్తూ అన్నాడు రమణ

'బావుంది! ఇలాంటి విషయాల్లోనా జోక్స్?'

"సారీ సుగుణా! నాకు పెళ్ళి చేసుకోవాలన్న కోరిక ఏ మాత్రం లేదు మెల్లగా అన్నాడు రమణ అతని మొహంలో నీలి నీడలు చోటు చేసుకున్నాయి

'ఇదిగో. అదే వద్దన్నాను! ఇప్పుడేవైఁదని అంత నిరాశ! మీరు మనసిచ్చినమ్మాయి హాయిగా పెళ్ళి చేసుకుని సుఖంగా బతికేస్తుంటే, మగాడైయ్యుండి మీరిలా దేవదాసై పోతే .. చ! . సిగ్గు చేటు! లేవండి!' చనువుగా అంది సుగుణ.

"అదికాదు సుగుణా!. .."

"ఇంకేం మాట్లాడద్దు! సరయు మీదయ్యే అవకాశం ఎలాగూ లేదు అందుకే మీరు కూడా పెళ్ళి చేసుకుని జీవితంలో స్థిరపడండి బాధల్ని మర్చిపోండి! అదే



## కరిగిన శిల

విన్నా ఆత్మక శాంతి నిస్తుంది అంటూ అనేక విధాల నచ్చ చెప్పి ఎలా అయితేనేం ఎళ్ళి చేసుకోవడానికి ఒప్పించింది

ఇద్దరూ సుగుణ కార్లోనే బయల్దేరారు సరయు తలపులతో కొట్టుమిట్టాడుతున్న రమణకూడా, తను పెళ్ళి చేసుకుని జీవితంలో స్థిరపడితే ఆమెని మర్చి పోగలనేమో అనిపించి సరే అనేశాడు

కారు మెల్లగా సాగుతోంది

ఇద్దరూ మౌనంగానే కూర్చున్నారు సుగుణే డ్రైవ్ చేస్తోంది

కారు మైన్ రోడ్‌లోకి రాగానే రమణ హటాత్తుగా, సుగుణా' అన్నాడు అరిచినట్టు

కారు సడన్ బ్రేక్‌తో ఆగిపోయింది

ఏవిఁటి' అన్నట్టు చూసింది సుగుణ

అదిగో సరయు' వడివడిగా నడిచిపోతున్న ఓ యువతిని చూపించి ఉద్వేగంగా అన్నాడు రమణ

సరిగ్గా చూశారా? అతను చూపించిన వైపే చూస్తూ అంది సుగుణ

అయ్యో' సరయుని నేను గుర్తించక పోవడం ఏవిఁటి ఆమె సరయూనే' ఒక్కసారి ఆవిడతో మాట్లాడాలి' అంటూ కారు దిగబోయిన అతన్ని చెయ్యిపట్టి ఆపేసింది సుగుణ

రమణా' మీకేమైనా మతిపోయిందా' ఇప్పుడామె ఒకరికి ఇల్లాలు' ఆ పక్కనున్నది ఆమె భర్త కావచ్చు' మీరు తొందరపడితే ఆమె జీవితం ఏంగాను 'స్నేహితుల్నే' అని సరిపెట్టుకునే మగాళ్ళు ఎంత మంది వున్నారు మన దేశంలో? అంటూ సన్నగా మందలించింది

సారి' అంటూ నీరసంగా సీట్లో కూలబడి నడిచి పోతున్న సరయుని చూస్తూండి పోయాడు రమణ సరయు అతనికి చేజారిన స్వర్గంలా కనిపించింది

సరయు తామిద్దర్ని చూసిందనీ, చూసే అలా పారిపోయిందనీ గ్రహించింది సుగుణ

ఇద్దరి మనస్సులోనూ సరయు ఆలోచనలే చోటు చేసుకున్నాయి

సరయు అందం, నడకలో ఆ దర్పం, నల్లతాచులా మోకాళ్ళు దాటే ఆ పెద్ద జడ చూస్తుంటే రమణ ఆమెని ఆరాధించడంలో ఆశ్చర్యం లేదనిపించింది సుగుణకి

అనుకున్న పని వాయిదా వేసి తిరుగుముఖం పట్టారిద్దరూ

* * * *

డేడీ'

రాత్రి పది గంటలుదాటాక తన గదిలో కొచ్చిన కూతుర్ని చూసి ఆశ్చర్యపోయాడు రామారావు

రామ్మా' ఏం కావాలి? అన్నాడు ఆప్యాయంగా

డేడీ'

చెప్పమ్మా'

'నాకు నాకు వుద్యోగం కావాలి డేడీ'

ఏవిఁటమ్మా నువ్వనేది? తెల్లబోయాడాయన

'అవును డేడీ' నాకు వెంటనే ఓ వుద్యోగం కావాలి' తలవంచుకుని మెల్లగా అంది శ్యామల

'శ్యామ్' మెల్లగా కూతురి దగ్గరి కొచ్చాడు రామారావు శ్యామల మౌనంగా నిల్చుంది నేల చూపులు చూస్తూ

ఏం జరిగిందిరా శ్యామ్' నువ్వూ ప్రభాకర్ ఏదైనా మాటా మాటా అనుకున్నారా? ఆమె తల నిమురుతూ లాలనగా అడిగాడు రామారావు

'నో' నో' అదేంలేదు' కంగారుగా అందామె

మరి? అంత పెద్ద నర్సింగ్‌హోమ్ ముచ్చటపడి, దగ్గరుండి మరి కట్టించుకుని నాలుగు చేతులా సంపాయిస్తున్న డాక్టర్ ప్రభాకర్ భార్యవైన నీకు మరో చోట వుద్యోగమా? ఛ' ఛ' కాస్త సరదాగానూ, కాస్త

'అనునయంగానూ అన్నాడు

నేనింక ఆ వూరెళ్ళను'

పక్కనే బాంబ్ పడ్డట్టు ఉలిక్కిపడ్డాడు రామారావు

అసలేం జరిగిందో నాతో చెప్పమ్మా? అన్నాడు తేరుకుని ఆమె మాట్లాడ లేదు

"అతను నిన్నేమైనా అవమానించాడా?" పరిశీలనగా కూతురి కేసి చూస్తూ అన్నాడు రామారావు

"అలాంటిదేం లేదు డేడీ!"

లేదు! ఏదో పెద్ద కారణమే వుంది లేకపోతే ఒక్క క్షణం అతన్నొదిలి వుండని నువ్వు మూడు నెల్లనించి అతని మాటైనా తలవకుండా ఇక్కడే వున్నావు' అంటే

'లేదు డేడీ! అలాంటిదేం లేదు! ఎందుకో నాకు ఇక్కడే వుండాలనుంది!' దుఃఖంతో ఆమె మాట తడబడింది

క్షణం ఆలోచనలో పడ్డ రామారావు మెల్లగా కూతుర్ని కూర్చోబెట్టి తనూ పక్కన కూర్చుంటూ–

"ప్లీజ్! చెప్పరా నాన్నా! . నువ్వు చెప్పకపోతే నామీద ఒట్టే!' బతిమాలుతున్నట్టు అన్నాడు

ఏం డేడీ ,, ఇప్పుడైనా నమ్ముతారా?

నాకేవిఁటో అంతా అయోమయంగా వుందమ్మా! అన్నాడు రామారావు

అలాగే వుంటుంది, కాని నిజం అది! ఇంతకీ నాకు జాబ్ చూస్తారుగా" నిలదీసింది శ్యామల

చూద్దాం!

చూద్దాం అంటే కాదు చూసి తీరాలి"

ఎలారా శ్యామ్! వుద్యోగం అంటే బజార్నించి కొని తెచ్చే వస్తువా!నిమిషాల మీద తెచ్చుకోవడానికి! మెల్లగా ప్రయత్నిద్దాం! అయినా నీకు వుద్యోగం చేసి బ్రతకాల్సినంత కర్మేవిఁటమ్మా హాయిగా రాణిలా ఇంట్లో కూర్చొ సినిమాలు చూడు! బుక్స్ చదువుకో నవ్వుతూ అన్నాడు రామారావు

నో! నో! అలా దాటెయ్యకండి! మీరు తల్చుకోవాలే గానీ ఉద్యోగం బజార్లో దొరికే వస్తువు కన్నా తేలిగ్గా సంపాదించి పెట్టగలరు! నా గురించి మీకు తెలుసుగా నేనింక ఆ వూరు ఛస్తే వెళ్ళను' మొండిగా అంది శ్యామల

'పోనీ ఆ అమ్మాయిని అక్కణ్ణించి పంపించేస్తే? ఏదో ఆలోచిస్తూ అన్నాడు

శ్యామల మాట్లాడలేదు

మౌనం అంగీకారంగా తీసుకున్న ఆయన తేలిగ్గా వూపిరి తీసుకున్నాడు

# గడుసులోకం

–బాబు







బలవంతాన ఆనకట్ట వేస్తున్న దుఃఖ సముద్రం కట్టలు తెంచుకుంది

"డేడీ!" అంటూ ఆయన గుండెల మీద వాలి బావురుమంది శ్యామల,

తెల్లబోయాడు రామారావు

ఆమె దుఃఖం కాస్త తగ్గాక బుజ్జగించి కూతురి నోట్నించి విషయాన్ని రాబట్టాడు

"ఛ! ఛ! ప్రభాకర్ అలాంటివాడు కాదమ్మా!" అన్నాడు మెల్లగా.

"అవును డేడీ! ముందు నేనూ నమ్మలేదు. కానీ మా వంటావిడ తంపులు పెట్టి తమాషా చూసే రకం కాదు. ఆవిడ చెప్పింది నమ్మకుండా ఎలా వుండగలను!"

"ఏం చెప్పిందావిడ?"

"రాత్రింబవళ్ళు ఆవిడగారిదగ్గరే గడుపుతున్నారట.." రోషంగా అంది శ్యామల

కానీ 'అయోమయంగా చూశాడాయన ఎంతయినా అల్లుడు అలాంటి మనిషంటే ఆయనకి నమ్మ బుద్ధి కావడం లేదు

'నిజం డేడీ! అంటూ కాంతమ్మకి, తనకి మధ్య జరిగిన సంభాషణంతా చెప్పింది శ్యామల

నోట మాట రానట్టుండ పోయాడాయన

డోంట్‌వర్రీ డియర్! నీకు జాబ్ కావాలి! లేకపోతే ఆ సరయుకి ఉద్వాసన చెప్పాలి! అంతేకదా?ఇంక నువ్వు నిశ్చింతగా వుండు! అంటూ అభయం కూడా ఇచ్చేశాడు

* * * *

భార్య వుద్యోగ ప్రయత్నంలో వుందని విన్న ప్రభాకర్ విస్తుపోయాడు

'ఏమైంది శ్యామలకి? తల్లి పోయిన దగ్గర్నించీ వింతగా వుందామె ప్రవర్తన. తనని విడిచి ఒక్క రోజైనా వుండని ఆమె . నెలలైపోతున్నా ఇక్కడికి వచ్చే ప్రయత్నం చెయ్యడం లేదు మనసు విప్పి మాట్లాడదు ఎంత బతిమాలినా మనసులోని మాట చెప్పదు! ఫోన్ చేసినా సరిగ్గా మాట్లాడదు! ఇంక నాలుగు రోజులు పోతే అమ్మా నాన్నలక్కూడా అనుమానం రావచ్చు!.. త్వరలో ఆమెని నిలదీసి సంగతేవిఁటో తెలుసుకోవాలి!" మరోసారి అనుకున్నాడు.

అయితే , ఆ సమయం రానే వచ్చింది

ప్రభాకర్ ఆ రోజు రౌండ్స్ ముగించుకుని రూమ్‌లో కొచ్చేసరికి అక్కడ రామారావు కూర్చుని వున్నాడు

"నమస్కారం మావఁయ్యా! ఎప్పుడొచ్చారు?" అన్నాడు మర్యాదగా.

'ఇంతకు ముందే!" క్లుప్తంగా అన్నాడాయన.

ప్రభాకర్ నౌకర్ని కాఫీకి పంపి తనూ ఆయన ఎదురుగా కూర్చున్నాడు

# కరిగిన శిల

అయనేదో ముఖ్య విషయం మాట్లాడ బోతున్నాడని గ్రహించాడతను

సర్! మా డాక్టర్‌గార్ని తొందరగా పంపిం చెయ్యండి! ఆవిడ లేకపోతే మా హాస్పటలంతా చిన్నబోతోంది! అంది సరయు రామారావుతో

ఆమె తనకి విష్ చేసినప్పుడే గుర్తించాడాయన ఆమె 'సరయు' అని అయితే జవాబేం చెప్పకుండా ఆమెని, ప్రభాకర్ని మార్చి మార్చి చూశాడు

ఎప్పుడు పంపుతారు సర్? చనువుగా అంది సరయు

నేను పంపేదేవిఁటి. మి డాక్టర్నొచ్చి తీసికెళ్ళమను! గంభీరంగా అన్నాడాయన

అయితే ఇంకేం డాక్టర్! వెంటనే వెళ్ళి తీసుకొచ్చెయ్యండి! అమాయకంగా అంది సరయు

ఆవిడేం పసిపిల్లా! నేను తీసుకు రావడానికి!' అదోలా అన్నాడు ప్రబాకర్

మావఁగారు ఆమెతో మాట్లాడినతీరు అతనికేం నచ్చలేదు

ఓసారి ఇంటి కెళ్ళొస్తాను డాక్టర్!' అని ప్రభాకర్ని పర్మిషన్ అడిగి రామారావుతో కూడా మరోసారి శ్యామల గురించి చెప్పి వెళ్ళిపోయింది సరయు

ప్రభాకర్! నీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి!' గంభీరంగా అన్నాడు రామారావు

అలాగే! ముందు కాఫీ తాగండి! నౌకరు తెచ్చిన కాఫీ కప్పుల్లో ఒకటి ఆయనకి అందిస్తూ అన్నాడు ప్రబాకర్

మౌనంగా కాఫీ తాగి కప్పు టేబిల్‌మీద పెట్టేశాడు రామారావు

నౌకర్ కాఫీ కప్పులు తీసికెళ్ళగానే-

'చెప్పండి! అన్నాడు ప్రభాకర్ చిన్నగా నవ్వుతూ

అయితే రామారావు మాత్రం నవ్వ లేదు ముఖం గంబీరంగా పెట్టి-

విషయాన్ని సూటిగా అడిగేస్తున్నాను మరోలా అనుకోకు! సరయుతో నీ కెప్పట్నించి పరిచయం?' అన్నాడు ఆ ప్రశ్నకి బిత్తర పోయాడు ప్రభాకర్

అదేవిఁటీ వాళ్ళిల్లు మి ఇంటి దగ్గరేగా ఆ రోజు తల్లికి సుస్తీ చేసి శ్యామలని పంపమన్న అమ్మాయే ఈ సరయు! మీరు గుర్తుపట్టలేదా? అమాయకంగా అన్నాడు ప్రభాకర్

"గుర్తుపట్టక పోవడమేఁ! బాగా గుర్తుపట్టాను కానీ . నేనడిగేది ఆ పరిచయాన్ని గురించి కాదు .'

మరి? కళ్ళు చిట్లించాడు ప్రభాకర్.

మి మలి పరిచయం! ఎప్పుడు, ఎక్కడ, ఎలా అయింది? అనడుగుతున్నాను! కాస్త వ్యంగ్యంగా అడిగాడు రామారావు.

ఆయన ధోరణికి చాలా చిరాకు కలిగిందతనికి శ్యామల రాకపోవడానికూడా కారణం కొంతవరకు అర్థం అయింది




'ఓ! ఆ పరిచయమా ఆమె నా హాస్పటల్లో వుద్యోగం కోసం ఒచ్చింది అన్ని అర్హతలు వున్నాయి కాబట్టి ఇచ్చాను అప్పుడే మీరన్న ఆ మలిపరిచయం అయింది! 'ఆ మలి పరిచయం అన్న చోట నొక్కి పలుకుతూ అన్నాడు

అంటే ఆ పరిచయం అంతటితో ఆగి పోయిందంటావ్! మి ఇద్దరి మధ్యా యజమానీ, వుద్యోగి అన్న భావం తప్ప మరోటి లేదంటావ్! అది నన్ను నమ్మమంటావ్! అదే దోరణిలో అన్నాడు రామారావు

ప్రభాకర్ కళ్ళు కోపంతో ఎరుపెక్కాయి తెచ్చి పెట్టుకున్న సహనం, వినయ విధేయతలు మాయమయ్యాయి .

వాడ్యూ యు మీన్? అన్నాడు తీక్షణంగా

అతని చూపులకి అంత పెద్ద పోలీసాఫీసరూ కాస్త కంగారు పడ్డాడు అయినా తేరుకుని -

నీకూ, ఆ అమ్మాయికి మధ్య అక్రమ సంబంధం వుందని విన్నాను అదెంతవరకు నిజమో తెలుసుకుందామని స్వయంగా వచ్చాను! అన్నాడు దర్పంగా

తెలుసుకున్నారా? పెదవులు బిగబట్టి అన్నాడతను

ఆఁ! తెలుసుకున్నాను ఆ సరయుకీ నీకూ మధ్య చాలా గ్రంథం నడిచిందనీ, అందుకే నువ్వురాకుండా ఆ రోజు శ్యామల నొక్కదాన్నీ పంపావనీ, భార్య ఇంట్లో లేని సమయంలో నా కూతురి చీరలన్నీ ఆవిడ గారికి దానం చేస్తున్నావనీ ఇంకా చాలా తెలుసుకున్నాను!' అన్నాడు రామారావు

ఓ! చాలా విషయాలు సేకరించారే! అయితే మి అమ్మాయి ఇక్కడికి రానన్న కారణం కూడా ఇదేనా?' ఆగ్రహాన్ని అతి ప్రయాసతో అదిమి పెడుతూ అన్నాడు ప్రభాకర్

"అవును! నా కూతురు అభిమానవతి!

అంటే ఆ అభిమానవతి ఇంక ఇక్కడికి రాదా?"

'అన్నమాటే!

బావుంది మంచి నిర్ణయమేఁ తీసుకుంది అయితే ఆ నిర్ణయం తీసుకునే ముందు ఒక్క మాట నాతో చెప్తే ఇంకా బావుండేది!

ఏవఁని?'

తన బాధ క్కారణం!

'అంత దేవిరించాల్సినంత కర్మ నా కూతురికి లేదు! అయినా తను అనుమానించింది అంటే అది కచ్చితంగా నిజమే అయ్యుంటుంది,'

ఆహా! నిజం! నూటికి నూరూపాళ్ళూ నిజం! కానీ ఆవిడగారు సిగ్గు విడిచి చెప్పడం, ముందూ వెనకా కాస్తయినా ఆలోచించకుండా మీరు సభ్యత మరచి ఇలా మాట్లాడ్డం! బావుంది! చాలా బావుంది పెద్దగా నవ్వాడు ప్రభాకర్

ఏవిఁటా నవ్వు? చిరాగ్గా అన్నాడు రామారావు

"నవ్వక మరేం చెయ్యను? పోనీ కాసేపు 'నా భార్య నా దగ్గిరికి రానంది!' అని ఏడవనా?'

'ఇదిగో! ప్రభాకర్! శృతిమించు తున్నావ్!

"వాట్ వండర్! నేనా శృతిమించేది? లేక అనుమాన పిశాచం పట్టిన కూతుర్ని మందలించడం పోయి అల్లుడి మీదికి యుద్ధాని కొచ్చిన మిరా? కఠినంగా వున్నాయి ప్రభాకర్ మాటలు!

'ప్రభాకర్! ఆవేశంతో తనని తాను మరచి అరిచాడు రామారావు

'ష్! అరవకండి! ఎవరైనా వింటే బావుండదు సరే! ఇంతకీ మీరు చెప్పబోయేదేవిఁటీ? శాంతాన్ని బలవంతంగా తెచ్చుకుంటూ అన్నాడు ప్రభాకర్

"నువ్వు వెంటనే ఆ అమ్మాయిని ఇక్కణ్ణించి పంపెయ్యాలి!' తేలిగ్గా అనేశాడాయన

"పంపకపోతే?"

'పంపేలా చేస్తాం!"

"అదే ఎలా చేస్తారూ అని అడుగుతున్నాను!'

'ఏమైనా చెయ్యగలను!'. నేను తల్చుకుంటే దాన్ని రేపీపాటికి నడి వీధిలో నిలబెట్ట గలను! కటకటాల వెనక తోయించ గలను నలుగురూ నీచాతి నీచంగా చూసేలా, దాని బతుకు దానికే అసహ్యం పుట్టించేలా చెయ్యగలను మైండిట్! కసిగా అన్నాడు రామారావు




## ఎస్ ఆర్ – జామి

నా వయస్సు 25 సం లు 2 నెలల క్రితం కడుపు నెప్పి వచ్చి జి టి టి పరీక్ష చేసిన తర్వాత రక్తంలో గ్లూకోజు ప్రమాణం ఎక్కువ అని తెలిసింది 2 నెలలుగా మళ్ళీ నెప్పి రాలేదు గుండె బారంగా ఉన్నది నెప్పి లేదు మూత్ర విసర్జన మామూలుగానే ఉన్నది కాళ్ళు లాగటం లేదు నేను మందులు వాడాలా? ఏ జాగ్రత్తలు తీసుకోవాలి? పెళ్ళి చేసుకోవచ్చా? పిల్లలు పుట్టే అవకాశం ఉన్నదా?

**గ్లూకోజు ప్రమాణాన్ని తరచూ పరీక్షిస్తూ రావటం మంచిది ఆహారం వల్ల వచ్చే కేలరీల విలువను తగ్గించాలి దీనికి డయటీషియన్ల సహాయం అవసరం దీనికీ వివాహానికి సంబంధం లేదు పిల్లలు పుట్టే అవకాశం తప్పక ఉంటుంది గ్లూకోజు అధికంగా ఉన్న వారందరికీ మందుల అవసరం ఉండదు**

## ఎస్ ఎస్ ఆర్ – విశాఖపట్నం

నా వయస్సు 20 సం లు బరువు 58 కె జీ లు కొంచెం లావుగా ఉంటాను ఫిబ్రవరి నెలలో హెర్నియా ఆపరేషన్ చేశారు నేను రోజూ ఉదయం రన్నింగ్‌కి వెళ్ళవచ్చునా? కూడదా?

**తప్పకుండా వెళ్ళవచ్చును అదే సమయంలో ఆహార ప్రమాణం కూడా తగ్గిస్తే మంచిది.**

## కె ఎన్ ఎస్ – గుంటూరు

నా అంగముపై తోలు కప్పబడి ఉన్నది ఆ తోలు చుట్టూ తెల్లగా ఉంటుంది డాక్టరుగారు చిన్న ఆపరేషన్ చెయ్యాలన్నారు నా వయస్సు 16 సం లు

**తప్పకుండా ఆపరేషన్ చేయించుకోనండి**

## ఎస్ – మచిలీపట్నం

నా వయస్సు 23 సం లు ఈ మధ్యనే హెర్నియా ఆపరేషన్ (ఎ ఎస్ డి) జరిగినది రతిలో ఎన్నాళ్ళకు పాల్గొనవచ్చును పిల్లలను కనవచ్చా?

**పిల్లలను కనటానికి ఆపరేషన్ అయిన 2 సం ల నుంచి ఏ ఇబ్బందీ ఉండదు రతిలో పాల్గొనడం ఆపరేషన్ జరిగిన 5 6 నెలల నుంచి చెయ్యవచ్చును కానీ ఈ విషయంలో ఆపరేషన్ చేసిన వైద్యుల సలహా కూడా పొందటం మంచిది**

## కె ఎన్ – గద్వాల్,

నా పైపెదవి మధ్య తెల్ల గా వున్నది ఇది ఎమైనా జబ్బా? దీనికి ఏ మందులు వాడాలి?

**చర్మ వైద్యులకి చూపించి ఫంగస్ ఇన్‌ఫెక్షన్ అయినదీ. విటిలిగో అయినదీ తీర్మానించుకోవటం ముఖ్యం. ఫంగస్ ఇన్‌ఫెక్షన్ అయితే తప్పక మందులతో నయమవుతుంది** □

## కరిగిన శిల

చూడండి మై డియర్ ఎస్ పి గారూ! ఇప్పుడు మీరు చెప్పినవన్నీ ఈ భరతావనిలో సామాన్య స్త్రీకి చెయ్యగలరు ఇంతేనా ఇంతకన్నా ఘోరకృత్యాలు చేయించ గలరు

దొంగతనం మోపగలరు! బ్రోతల్ హవుస్‌లో పట్టుకున్నట్టు సృష్టించ గలరు కూనీ కేసులో ఇరికించ గలరు! అంతెందుకు ఆ నేరాలన్నీ తానే చేసినట్టు ఆమె చేతే కోర్టులో చెప్పించ గలరు!

కానీ ఎస్ పి గారూ! మీరో ముఖ్య విషయం మాత్రం మర్చి పోతున్నారు సరయు నా దగ్గర పని చేస్తున్న స్త్రీ! మీరు ఏవేవో మనసులో పెట్టుకుని అవిన్నీ వీధిలోకి లాగితే ఈ ప్రభాకర్ చేతులు ముడుచుక్కూర్చోడు తన మూలంగా ఓ స్త్రీ అన్యాయంగా పతనమౌతుంటే తన కెందుకులే అనుకునేంతటి అర్భకుడు కాడు!

ఏమిటలా చూస్తున్నారూ? ఏమిటి వీడింత ధైర్యంగా మాట్లాడుతున్నాడు అని ఆశ్చర్య పోతున్నారా?

నా సంగతి ఒక్కసారి మా నాన్నగారి దగ్గరికెళ్ళి అడగండి ఆయన చెప్తారు

అంతేకాదు ఒక్కసారి మీరిప్పుడు నన్ను అన్న మాటలన్నీ ఆయనకి చెప్పండి సరయు సంగతేమో గానీ తమకి స్థాన భ్రంశం కలగడం మాత్రం ఖాయం! యూ ఆల్సో మైండిట్! ఆవేశంతో అంటున్న అల్లుణ్ణి చూసి కొయ్యబారి పోయాడు రామారావు ఆయన ఎనాడూ అల్లుణ్ణలా చూడలేదు

సౌమ్యంగా అమాయకంగా కనిపించే ప్రభాకర్‌లో ఇంత ఆవేశం వుందని తెలిస్తే అసలింతలా మందలించేవాడే కాదు

నిజంగా వియ్యంకుడికున్న శక్తి సామర్థ్యాలు ఆయన ఎరగనివి కావు చాలా మంది మంత్రిపుంగవులున్నారాయన స్నేహితుల్లో అదీగాక ఆయన తన కొడుకు మీద ఈగవాలినా సహించడన్న విషయమూ తెలుసు! అయినా తొందరపడ్డాడు

కుడితిలో పడ్డ బల్లిలా కొస్సేపు కొట్టుకున్నా వెంటనే తన హోదా గుర్తొచ్చి–

ఇంతకీ ఏమంటావ్? అన్నాడు లేచి నిల్చుని

నేనేమంటాను! అనేదేదో అనేశాను ఏదైనా అంటే మీరే అనాలి!

అంటే దాన్ని పంపనంటావ్! అంతేనా?

దాన్నికాదు! ఆమెని! సభ్యతగా మాట్లాడ్డం నేర్చుకోండి సరయుని పంపను! నొక్కి మరీ అన్నాడు ప్రభాకర్

అయితే శ్యామల నీ మొహం చూడదు!

పెద్దగా నవ్వాడు ప్రభాకర్

అలా చెప్పమందా మీ అమ్మాయి?

అవును! గంభీరంగా అన్నాడు రామారావు

థాంక్యూ! కానీ నా మాట కూడా ఒకటి చెప్పండి! తను రాకపోయినా సరే ఓ అమాయకురాలి నోటి ముందు కూడు నేను తియ్యను!

ఓ! శ్యామల రాకపోతే ఆవిడగార్నే కట్టుకుని వూరేగచ్చునా? వ్యంగ్యంగా అన్నాడు రామారావు

ఆహా! అవసరం అయితే తప్పుతుందా, మీ అనుమానాన్నే నిజం చేస్తాను!

అలాగేం? చూస్తాను! రేపిపాటికి దాని జాతకం తిరగ రాయించకపోతే ఆవేశంతో ఆయన మాట తడబడింది

మారు పేరు పెట్టుకుంటారా? బెస్టాఫ్ లక్! ప్లీజ్! యు కెన్ ట్రై! నిర్లక్ష్యంగా అంటున్న అల్లుణ్ణి నిప్పులు చెరుగుతూ చూసి వెళ్ళిపోయాడు రామారావు

ఆ కోపంలో వారు పరిసరాలు సరిగ్గా గమనించ లేదుగానీ గమనించి వుంటే ఓ పక్కగా పాలిపోయిన మొహంతో బిత్తర చూపులు చూస్తూ నిల్చున్న సరయు కనిపించేదే!

(ఇంకాఉంది)

# సంగీత సాహిత్యాలలో సర్వమంగళ


శ్రీ దుర్గ

చిత్రం : ఎం. కుసుమకుమారి

తాత్విక దృషిలోగాని వైజ్ఞానిక దృష్టిలోగాని సమస్త విశ్వానికి మూలాధారం. శక్తి. సత్‌చిత్ ఆనంద స్వరూపము, అఖండ జ్ఞానమయము అయిన ఆశక్తి స్వరూపాన్ని మాతృభావనతో ఆరాధిస్తారు భారతీయులు. దుర్గ, ఉమ, అంబ ఇలా అనేక నామాలతో వ్యవహరిస్తారు. పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి రూపాలుగా నాదరూపమైన అమోఘశక్తి తేజము యొక్క కటాక్ష వీక్షణాలతో పునీతులైన మహానుభావులు సాహిత్య. సంగీత శారభ నీరాజనాలతో విశ్వమాతను ప్రస్తుతించారు.

వేదవ్యాసుల వారు దేవీభాగవతంలో దుర్గాదేవిని అతివైభవంగా వర్ణించారు.

జగద్గురు శంకరాచార్యుల వారు,

"అంబత్వదీయ చరణాంబుజ సంశ్రయేణ
బ్రహ్మాదయోప్య వికలాంశ్రియ మా శ్రయంతే!
తస్మాదహం తవ నతోస్మి పదారవిందం
భిక్షాం ప్రదేహి గిరిజే క్షుభితాయ మహ్యం!!"

అంటూ జగన్మాతను జ్ఞానభిక్ష పెట్టుమని వేడుకున్నారు.

"దేవానాంత్రితయం త్రయీ హుత భుజాం
శక్తిత్రయం త్రిస్వరా" అనే శ్లోకంలో

ఓంకార స్వరూపమైన త్రిపురసుందరిని సంస్తుతించాడు మహాకవి కాళిదాసు. "శ్రీవాణీ గిరిజా శ్చిరాయ" అనే శ్లోకంతో నన్నయ్యభట్టు "శ్రీయన గౌరి. నాబరగు చెల్వకు" అంటూ తిక్కన సోమయాజి, పంచమ వేదమైన మహాభారత ఆంధ్రీకరణ ప్రారంభంలో దేవీ స్తోత్రం చేసారు.

"అమ్మలగన్న యమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ చాల పెద్దమ్మ సురారులమ్మ, కడుపారిడి బుచ్చినయమ్మ, తన్నులో నమ్మిన వారి మనమ్ముల నుండెడి అమ్మ" వలె

పోతన మనోనేత్రం ముందు సాక్షాత్కరించిన జగజ్జనని ఆయనకు "మహత్వ కవిత్వ పటుత్వ సంపదలను" అనుగ్రహించి భాగవత కర్తను చేసింది.

"ఎల్ల వేదములకు కన్నతల్లియగుచు, నెన్నమూర్తి త్రయంబు కన్న నున్నతముగ వర్తించి నిజభక్తి సమితిగాచు" లోకమాతకు బిడ్డలపైగల వాత్సల్యాన్ని హృద్యంగా వర్ణించారు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

"చేమంతి పూవుగ శీతాంశు గిలించి
ఒప్పుగ గగనంబు కొప్పుబెట్టి
తారలన్ ముత్యాల చేరుగ నమర్చి
నుదుటిపై సూర్యుడన్ బొట్టుదిద్ది"

ఆదిభట్ట నారాయణదాసుగారు విశ్వమాత సమగ్ర స్వరూపాన్ని సాక్షాత్కరింపజేసారు. ఇంకా ఎందరో ప్రసిద్ధులు దేవి జగన్మోహన రూపాన్ని సుందరంగా వర్ణిస్తూ సన్నుతి చేశారు.

దేవి అనుగ్రహమువలన జన్మించి ఆమె కటాక్షము వలన సంగీత విద్యా పారంగతుడైన శ్యామశాస్త్రి "మరి వేరె దిక్కెవరమ్మ అంబమహిలో న బ్రోచుటకు – శరణాగత రక్షకియని నిన్ను సదా న మీనాక్షి" అని ఆనందభైరవి రాగంలో సుమనోహర గానం చేసాడు. శ్రీ విద్యా మంత్రోపాసకు ముద్దుస్వామి దీక్షితులు "అంబనీలాయ కరుణాకటాక్షి అఖిలలోక సాక్షి కటాక్షి" అం నీలాంబరి రాగంలో దేవీ ప్రార్థన చేసారు.

"నీ పాదములు గతియని నమ్మితి నీర పరాశక్తి" కృతితో పట్నం సుబ్రహ్మణ్యయ్యరు. "నీ చరణ పంకజములె గతియని నెర నమ్మియు నన్ను బ్రోవమమ్మా అంబా" కీర్తనతో ప గోపాలయ్య లలిత భక్తి భావనతో అం వేడుకున్నారు.

"పరాశక్తి మనుపరాధ్యాపై పరాకేలనమ్మ ఓ అ పురాణి ధర్మ సంవర్థని శ్రీ పురాధీశ్వరి రాజశేఖరి" పరాశక్తిని అతి మనోజ్ఞమైన సాహిత్యంతో సా రాగంలో కీర్తించాడు త్యాగరాజు

ఆ భగవతి యొక్క సాత్విక సర్వమం రూపము. నాదబ్రహ్మ స్వరూపము అయిన మ సరస్వతి సమస్త విశ్వాన్నీ జ్ఞాన ప్రకాశ ధారల అమృతమయం చేయుగాక.

–పి. ఆదిలక్ష్మి

"బొమ్మల కొలువు" (ఫొటో : బోనేపల్లి మురళి



## వ్యక్తిగతం



శ్రీ డి వి ప్రసాద్‌కి అంతర్జాతీయ చదరంగ నిపుణుని స్థానం లభించింది. ఈ గౌరవాన్ని అందుకున్న భారతీయ చదరంగ క్రీడాకారులలో ఈయన తొమ్మిదవ వ్యక్తి. లండన్‌లో కొన్ని వారాల క్రితం జరిగిన కామన్‌వెల్త్ చదరంగం పోటీలలో ప్రసాద్ ఆస్ట్రేలియాకు చెందిన డెస్‌పాక్యులేపై విజయం సాధించి 6.5 పాయింట్లను పొందగలిగారు ఈ గెలుపు ఎనిమిదవ రవుండుకిగానీ వీలుపడలేదు డెస్‌పాక్యులే ఆట గమనాన్ని 'రాణి కి అనుకూలంగా నడుపుకొంటూ పోగా ప్రసాద్ "రాజు"పై ఎక్కువ శ్రద్ధను చూపి "సిపాయి"లద్వారా ఆటను నడిపి విజయాన్ని సాధించారని పరిశీలకులు అంటున్నారు □



జీనా గారిసన్ (22) అగ్రశ్రేణి మహిళా టెన్నిస్ క్రీడాకారిణిగా ఎన్నో పర్యాయాలు తన ప్రతిభని నిరూపించుకున్నది టెక్సాస్‌లోని హూస్టన్‌కి చెందిన ఈమె అతి చిన్న వయస్సు నుంచే టెన్నిస్ పట్ల మక్కువ పెంచుకొన్నది 18 ఏళ్ల వయసుకే ప్రపంచం మొత్తం మీద జూనియర్ ఛాంపియన్ అనిపించుకున్న ఈమె 'టెన్నిస్సే నా ప్రపంచం" అని అనటంలో ఆశ్చర్యం లేదు మూడేళ్ల కాలంలో అమెరికా సంయుక్త రాష్ట్రాలలోనూ, ఇతర దేశాలలో ఈమె ఎన్నోచోట్ల విజయవంతంగా టెన్నిస్ ఆడడం ఒక విశేషమైతే, ఆ ఆట ద్వారా మూడు లక్షల డాలర్లు సంపాదించడం మరొక విశేషం. 1 63 మీటర్ల పొడవూ 58 కిలోల బరువూ ఉన్న గారిసన్ నేడు ప్రపంచం మొత్తం మీద అత్యంత వేగంగా ఆడే టెన్నిస్ క్రీడాకారిణి 'టెన్నిస్ నా కెంతో మేలు చేసింది టెన్నిస్‌ను నేను మరవలేను" అంటున్న గారిసన్ టెన్నిస్‌లో సరికొత్త ప్రమాణాలను నెలకొల్ప గలదు. ఇటీవల ఈమె బ్రూక్లిన్‌లోని ఒక పాఠశాలకు వెళ్ళినప్పుడు పది పన్నెండేళ్ళ బాలలు ఈమె చుట్టూ చేరి ఆమె గౌరవార్థం పాటలు పాడటం చూస్తే జనసామాన్యంలో – అందులోనూ పసిహృదయాలలో – ఈమె కెంతటి స్థానం ఉందో అర్థం అవుతుంది. □

## వారఫలం

### 10-10-1986 శుక్రవారం మొదలు 16-10-1986 గురువారం వరకు

★ **మేషం :** మీకు పత్రికా ప్రకటన సంబంధం ఉన్నా, రచనా విధాన సంబంధం ఉన్నా, పత్రికా విలేఖరులు మీరైనా, ఆ రంగాన పని చేస్తున్నా, హాయి, ప్రశాంతత, స్వల్పంగా ధనలబ్ధికి అవకాశమున్నది రాజకీయవాదులకు 'వారఫలం' శ్రేయస్కరంగాదు స్త్రీలకు . శుభకార్యాలోచనలు, ఉద్యోగరీత్యా అభివృద్ధి

★ **వృషభం :** చాల మందికి ఆరోగ్య విదాన లోపం చెప్పవచ్చు జాగ్రత్త పడటం అవసరం ఉద్యోగ రీత్యా లేనిపోని యిబ్బందులు వస్తాయి జాగ్రత్త పడాలి వ్యాపారరీత్యా చక్కని ఆదాయమున్నది అన్ని విధాలా అనుకూల వాతావరణమే స్త్రీలకు వృత్తియందు వికాసం శుభ వార్తా శ్రవణం

★ **మిధునం :** వృత్తి యందు కొంత నిలకడ చిక్కుతుంది ఎంతో కాలంగా ఎదురు చూచే వ్యవహారం, సాంగంగా సానుకూలం కావటం గమనిస్తారు. రాశిఫలం వారం వారం తెలిసి కొంటే ముందు జాగ్రత్త పడవచ్చు ఉద్యోగంలో జాగ్రత్త! స్త్రీలకు వృత్తి యందు మేలు, సంకట పరిస్థితుల దాటుకొంటారు విద్యా విధానాన మేలు

★ **కర్కాటకం :** ఇప్పుడిప్పుడే మీ రాశి దైవ బలాన్ని పుంజుకొంటున్నది అంటే మీకు ధన వసతి, ఉద్యోగ లాభం, ప్రశాంతి, ఆనందోత్సాహాలు లభ్యం కానున్నవని అర్థం ఎదుటివారి మనస్తత్వమెరిగి నడుచుకోవలసిన అగత్యమున్నది సంగీత సాహితీ మార్గాన మంచి అవకాశాలుంటాయి స్త్రీలకు: అనుకూల వారం, కృషి లోపం లేకుంటే మేలే

★ **సింహం :** మాటకు అడ్డు వచ్చేవారుంటారు సమయానికి తోడ్పడనివారుంటారు. అనవసరంగా స్తుతించి, లేనిపోని యిబ్బందులు తెచ్చి పెట్టే వారుంటారు. ఆదాయాన్ని మించిన ఖర్చులను ఎదుర్కొనవలసి ఉంటుంది సత్ఫలం ఏ రంగాననైన ఆశించుటకు వీలు లేదు స్త్రీలకు అన్ని విదాలా సుఖకరమైన దినాలు కావు విసుగు అధికమవుతుంది.

★ **కన్య :** లేనిపోని వ్యవహారాలతో కాలక్షేపం అలా యిలా తిరుగుతూ, కళా రంగాన చిక్కిన అవకాశాలు కొందరు పోగొట్టుకొనే అవకాశమున్నది. రాజకీయంగా సుకరమైన దినంగాదు, రావలసిన డబ్బు అందుతుంది, అవసరాలు తీరుతాయి స్త్రీలకు రచనా వ్యాసంగాన సత్ఫలం, ఆదాయ వృద్ధి, సుఖశాంతులు.

★ **తుల .** అయినదానికి, కానిదానికి ఉద్రేకం తెచ్చుకొంటారు ఏమంత మంచి కార్యం అది? అనుకోకుండా ఒకానొక అనుకూలం జరుగుతుంది, గమనించాలి ముందుగా తెలిసికొంటే మంచిదేగా! అనవసర ప్రస్తావనలకు పోకండి రాజకీయ వాదులకు మేలు గాదు స్త్రీలకు లేనిపోని చిక్కులు, అనవసర వ్యవహారాలు, వృత్తి లోపం

★ **వృశ్చికం** మాట చెలామణి కాకపోవటంతో గ్రామానగాని యింటగాని కనిపిస్తుంది వృత్తి యందు యిబ్బంది. వ్యవహారాలు సానుకూలం కాకపోవటం, ధైర్యంగా ఏ కార్యం చేయలేకపోవటం గమనిస్తారు, అందుకు తోడు వ్యాపార లోపం స్త్రీలకు ఇల్లు చక్కబెట్టుకోవటంతో, కొందరకు అనవసర ప్రయాణాలతో, అధికారుల బెడదతో కాల వ్యయం

★ **ధనుస్సు .** ఒకానొక ప్రతిన పట్టారేగాని, ఏం లాభం? నెరవేరే మార్గం లేదు కృషియందు లోపం హడావుడితో కాలక్షేపం వస్తు విక్రయమందు అనానుకూలం చెడిన యిండ్లు, వాకిండ్లు ఈనాటికి సరిదిద్దుకోగలుగుతారు స్వల్పంగా ధనాదాయం ప్రభుత్వ మూలంగా అందవలసిన డబ్బు అందదు స్త్రీలకు ప్రయాణమూలక లాభం, స్వల్పాదాయం

★ **మకరం .** మాటకు విలువ, గ్రామాన కుటుంబాన, సాటివారితో మర్యాద, హోదా పెరగటం గమనించగలరు వృత్తి యందు పెంపు కనిపిస్తుంది కొందరు సొంతం చెడిన వ్యాపారం సానుకూలం చేసికొనటం జరుగుతుంది వారాంతాన శుభం జర్గుగుటకు అవకాశమున్నది స్త్రీలకు ఉద్యోగ రీత్యా చిక్కులు, వ్యవహారాన అనానుకూలం

★ **కుంభం ·** నాలుగు విధాలా నష్టపోయే అవకాశమున్నది సాటివారి పోటి, వ్యాపారాన,, వ్యవహారాన తట్టుకోలేకపోతారు నూతన వ్యవహారాన కొంత ఉత్సాహం ఏర్పడుతుంది అనవసర వ్యక్తులతో కాలక్షేపం, వ్యర్థమేగా! స్త్రీలకు సుఖశాంతులకు లోపం, అప్పుల సంబంద వత్తిడికి ఆస్కారమున్నది

★ **మీనం ·** నలుగురిలో ప్రతిష్ఠ తగ్గే అవకాశం కొందరకు, సాటి వారి పోటిని ఎదుర్కొనవలసి రావటం కొందరకు, వృత్తియందు లేనిపోని యిబ్బందులు కొందరకు, రాజకీయంగా అనానుకూలత కొందరకు, ఆరోగ్య భంగం కొందరకు చెప్పదగిన అంశాలు స్త్రీలకు స్థిర చరాస్థుల విషయంగా చిక్కులు కొందరకు, దన సంబంధ వత్తిడి కొందరకు చెప్పనైన విషయాలు. వారఫలం తెలిసికొంటే మంచిదేగా!

—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# అర్చన

డా॥ గుమ్మనూరు రమేష్ బాబు

సర్వ మంగళ మాంగళ్యే
శివే సర్వార్థ సాధికే
శరణ్యే త్ర్యంబికే గౌరి
నారాయణి నమోస్తుతే-

ఆ తరువాత గొంతు పెగలలేదు. పరబ్రహ్మ శాస్త్రికి! గాఢ్గదికమై గుండెలో తుళ్ళించి అనంతమైన దుఃఖం ఎగదన్నుకొచ్చింది.

వేదాలు నేర్చిన వాడు. భగవద్గీతను ఆమూలాగ్రమూ ఆపోసన పట్టిన వాడు పరబ్రహ్మశాస్త్రి! అయినా కంటతడి, గుండెదడ ఇంకా అతణ్ణి వదలి పెట్టడం లేదు.

అతడు సంసారే కాని సంసార యోగి కాడు! ఇంకా ఆదశకు ఎదగలేదు.

ఎదగాలని ఎదతో పుల నిండా ఉన్నప్పటికీ!

అమ్మవారి గుడిలో పూజారి అతడు! ధర్మకర్తల దయాదాక్షిణ్యం మీద బ్రతికే అతనికి నెలజీతం రెండొందలు మాత్రమే! భక్తాదులు సమర్పించే కానుకలు పరిగ్రహించవచ్చు కాని, వాటి విలువ ఏ నెలలోనూ వందకి మించలేదు.

అరటిపళ్ళు తిని పొద్దు గడిపిన రాత్రులున్నాయి.

కొబ్బరిముక్కలు తిని కడుపు నింపుకొన్న రోజులున్నాయి. శంకుతీర్థం తాగి, పారణ చేసిన సందర్భాలున్నాయి. ఉట్టి కడుపుతో గుడిచుట్టూ ప్రదక్షిణలు చేసి కళ్ళు మూసుకొని పడుకొన్న దినాలెన్నో ఉన్నాయి.

ఎప్పుడూ పెదవి విప్పలేదు. ఏనాడూ చేయిచాచలేదు.

తలలోని నాలుక భార్య విశాలాక్షి. ఏనాడూ భర్తకి ఎదురు చెప్పలేదు.

'ఇలాకాదు అలా' అన్న పాపానికి పోలేదు. సంసారమంతా గుట్టుగా సాగుతోందంటే ఆ దొడ్డఇల్లాలి చలువే!

ఇద్దరు బిడ్డలు. పెద్దవాడు నరసింహశాస్త్రి. చిన్నది గాయత్రీదేవి.

శాస్త్రి చిన్నతనంలో తండ్రి హయాములో ఏ వెలితీ లేకుండా పెరిగాడు. తండ్రి పోయాక జీవితపు విలువలు తెలుస్తూ వచ్చాయి. వేదవిద్య తండ్రికి



ఐశ్వర్యాన్ని కలిగిస్తే తనకు కడుపు కూడా నింపలేక పోతోందని శాస్త్రి గ్రహించాడు అందుకే మనస్సాక్షికి విరుద్ధంగా కొడుకుని బి కామ్ చదివించాడు ఎంత కష్టపడ్డాడో ఆ పరమేశ్వరికి తెలుసు! అరుపదులు నిండిన తననూ, విశాలాక్షిని, గాయత్రిని కొడుకు ఆదరిస్తాడని ఎన్నో కలలు కన్నాడు శాస్త్రి!

కానీ జరిగిందేమిటి?

బి కామ్ యూనివర్సిటీ ఫస్టు గోల్డ్ మెడల్ కూడా ఉంది కాని నరసింహానికి ఉద్యోగం రాలేదు చిన్న చిన్న ఉద్యోగాలు నరసింహానికి నచ్చలేదు ఈ వ్యవస్థతో పోటీ పడలేక పోయాడు అలాగని రాజీ కూడా పడలేదు తన కంటె తక్కువ మార్కులొచ్చిన ఒకడికి ఆఫీసరు పోస్టు రావడం, తన ప్రతిబా తన తెలివి తేటలూ ఎందుకూ పనికి రాకపోవడం నరసింహాన్ని చికాకు పరిచాయి రిజర్వేషన్ పద్ధతివల్ల నరసింహానికి అన్యాయం జరిగింది అతని పసి హృదయం దానికి తట్టుకో లేక పోయింది

అతడు చదివిన చదువు అతనికి గుండెధైర్యాన్ని ఇవ్వలేక పోయింది బ్రతుకు తెరువు ఏదో ఒకటి చూచుకొని జీవితాన్ని నెట్టుకొని వచ్చి విజయ శిఖరాన్ని అదిరోహించాలని అతడు అనుకోలేక పోయాడు

గ్రుక్కెడు విషానికి నిండు నూఃరేళ్లని బలి చేసాడు

పరబ్రహ్మ శాస్త్రి శిలాసదృశుడై పోయాడు విశాలాక్షి ప్రాన్పడి పోయింది పెళ్ళీడు కొచ్చిన గాయత్రి మూగదై పోయింది

నాన్నా! ఈ వ్యవస్థలో నీతికి నిజాయితీకి తావులేదు ప్రతిబ అక్కరలేదు తెలివి తేటలతో పనిలేదు కేవలం డబ్బు! లేదా కులం! మన దగ్గర డబ్బులేదు డబ్బు ఉన్న కులం కూడా కాదు మనది గుళ్ళో పూజారి కొడుకుని నేను! నన్నెవరు పట్టించు కొంటారు? కనీసం ఉనికిని కూడా గుర్తించరు!

"అమ్మా! మనం కులం తక్కువ వాళ్ళమై ఉన్నా బాగుండేది ప్రభుత్వం వారికి కల్పించే రాయితీలు మనకూ కల్పించి ఉండేది అసలు ఈ కులాలూ

# అర్చన

గోత్రాలూ ఎవరిక్కావాలమ్మా! కాలుతున్న కడుపుకి కావలసింది గుప్పెడు మెతుకులు కాని, బంగారు పతకాలు కావు! డిగ్రీ సర్టిఫికెట్లు కావు! నోట్ల కట్టలు కావు! నాకు ఆకలి! ఎవరు పెడతారు అన్నం? అమ్మా! అందుకే అన్నపూర్ణేశ్వరి దగ్గరికి వెళుతున్నానమ్మా! వెళ్ళి పోతున్నా! మళ్ళీ ఇలాంటి వ్యవస్థలో పుట్టనమ్మా! పుట్టను!!

చెల్లీ! గాయత్రీ! ఈ వ్యవస్థలో ఎలా బ్రతుకు తావు తల్లీ? అమ్మా, నాన్నా నీకు పెళ్ళి చేస్తారనే నమ్మకం నాకు లేదు ఆ పని చేయవలసిన నేను అమ్మా! నీకు అన్యాయం చేసాను నా కడుపె నింపుకోలేను తల్లీ! ఇక నిన్నెలా సాగనంపనమ్మా అత్త వారింటికి! ఈ పాపిష్టి అన్నయ్య నీకు లేనే లేడనుకో అమ్మా!

నరసింహం చనిపోయే ముందు మాట్లాడిన మాటలన్నీ గుర్తు కొచ్చాయి పరబ్రహ్మ శాస్త్రికి! కళ్ళు తటాకా లయ్యాయి! హృదయంలో బడబాగ్ని నిండుకొన్న మమకార సాగరం ఉప్పొంగింది!

'మీకు తల కొరివి పెట్టవలసిన వాడిని బ్రతికుండగనే మీకు గుండెల్లో చిచ్చుపెడు తున్నాను నాన్నా! నన్ను క్షమించు అమ్మా! ఈ నిర్భాగ్యుని మరిచిపో! ఇదిగో! నా గోల్డ్ మెడల్ అమ్మగా వచ్చిన రెండు వందల రూపాయలు కనీసం నా అంత్యక్రియలకి కూడా సరిపోవు చెల్లీ.'

ఆ తరువాత నరసింహం మాట్లాడలేక పోయాడు గురక ప్రారంభ మయింది సంధి కాలం దాటింది జీవుడు దేహాన్ని వదలి పెట్టాడు

అంతా గొల్లు మన్నారు నరసింహం కాయం ప్రశాంతంగా చీకూ చింతా లేకుండా ఈ వ్యవస్థతో సంబంధం లేకుండా మనుషులతో పని లేకుండా దూరంగా ఉంది! కాలం గడిచి పోతోంది గాయం మాని పోవాలి అది సృష్టి ధర్మం!

సజల నేత్రాలతో పరబ్రహ్మ శాస్త్రి దేవిని చూచాడు

నిశ్చలంగా నిర్మలంగా ముగ్ధమోహనంగా ఉంది!

ఎదురుగా ఉన్న నది వైపు చూచాడు శాస్త్రి

ఎప్పటిలా పరవళ్ళు త్రొక్కుతూ కెరింతలు కొడుతోంది!

. తల్లీ! భువనైక మాతా! సర్వజనేశ్వరి! లోకరక్షాకరి! త్రికరణ శుద్ధిగా నిన్నే నమ్ముకొని మనసావాచా కర్మణా నీ జపమే చేస్తున్నానే! నా కెందుకు తల్లీ! ఇట్టి దుర్దశను కలిగించావు చెట్టంత కొడుకు పోయాడు అయినా బ్రతుకు తున్నాను కూతురికి కల్యాణం జరిపించ గలనా? జరిపించ లేను చిల్లి గవ్వలేని నిర్భాగ్యుణ్ని ఎందుకు తల్లీ ఈ బ్రతుకు? ఇక బ్రతక లేను. అసమర్థుడిగా భార్య ముందూ బిడ్డ ముందూ నిలబడే కన్నా చావడమే మేలు ఎవరు నన్ను ఆదుకొన్నా ఆదుకోక పోయినా తల్లీ! నీవాదు కొంటావని, నన్ను కాపాడుతావని ఆశిస్తూ వచ్చాను మూర్ఖుడిని! నీవు మాత్రం నా వంటి పేదవాని మొర ఆలకిస్తావా? ఆలకించవు! అసలు నేను నీ కేమిస్తానని నన్ను ఆదుకొంటావు నా భార్య ఒత్తులు చేసీ చేసీ అలిసి పోతుంది కాని వాటినెవరూ కొనరు- కొన్నా పైసలే కాని రూపాయలు రావు తల్లీ? నా బిడ్డ విస్తళ్ళు కుట్టీ కుట్టీ సొమ్మసిల్లి పోతుంది వెండి కంచాలలో బొంచేసే వారికి విస్తళ్లతో పనేమిటి? ఏ రోజూ రెండ్రుపాయలు కళ్ల చూడలేదు ఇక నేను తెల్లవారి జామున మూడు నించి రాత్రి పది దాటేవరకు నీ దగ్గరే పడి ఉంటాను కాని ఏది? ఏ ఒక్క రోజైనా పదంటే పది రూపాయలు అందుకో గలిగానా? లేదే! ఇక నేను అమ్మాయి పెళ్ళి చేస్తానా? చేయలేను అదీ కలలోని మాట! అయోగ్యపు బ్రతుకు కన్నా అర్ధాంతరపు చావే మిన్న నా కొడుకు ఆ పనే చేసాడు నేనూ అంతే!"–

పరబ్రహ్మ శాస్త్రి స్థిరనిశ్చయంతో గుడి బయటికి వచ్చాడు అక్కడ ధ్వజస్తంభం దగ్గర పాతికేళ్ల యువకుడు నిలబడి ఉన్నాడు మిట్ట మధ్యాహ్నం తీవ్రమైన ఎండలో చెమటలు క్రక్కుకొంటూ నిలబడ్డ ఆ యువకుని వంక విస్మయంగా చూచాడు శాస్త్రి!

ఆ యువకుడు గబగబా శాస్త్రి దగ్గరికి వచ్చి పాదాలకు మొకరిల్లాడు తెల్లటి కవరును శా పాదాల ముందు ఉంచి–

స్వామి! ఇందులో ఉత్తరం ఉంది అది చదు నేనెవరో ఎందు కొచ్చానో తెలుస్తుంది నేను మళ్ళీ రేపు ఉదయం నాలుగు గంటలకి ఈ ధ్వజస్తంభం దగ్గరికి వస్తాను మీరు వేద మంత్రాలు చదువుతూ జేగంటను వినిపిస్తారు తరువాత అమ్మవారికి హారతిచ్చి ఆ హారతిని తీసుకొని మీరు వెలుపలికి వస్తే నా అభీష్టం నెరవేరినట్లే! ఒకవేళ నెరవేరక పోతే నేనేమి బాధపడను నా గమ్యం నాది వస్తాను –

ఆ యువకుడు వడివడిగా వెళ్ళి పోయాడు ఊరి పొలిమేర దాటి! పరబ్రహ్మ శాస్త్రికి ఒక్క క్షణం ఏమి అర్థం కాలేదు కలా? నిజమా? అన్న భ్రాంతిలో పడి పోయాడు కవరు అందుకొని గర్భగుడిలోకి



# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## ఘనపదార్థాలను తొలిసారిగా రుచి చూపిస్తూ

సుమారు 4వ నెల నుంచి మీ పాపాయికి పాలతోపాటు ఘనపదార్థాలూ కావాలి. దీన్ని సెరిలాక్ కానుకతో ప్రారంభించేందుకు ఇదే సరైన సమయం.

**పోషకాహార లాభం :**
సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు-ప్రొటీన్లు, కార్బొహైడ్రేట్లు, క్రొవ్వుపదార్థం, విటమిన్లు, ఖనిజాలు అన్నీ ఉన్నాయి. మీ పాపాయికి ప్రత్యేక అవసరాలకు తగినట్లుగా సరైన పాళ్ళలో అన్నీ సమతూకంతో ఉన్నాయి.

**రుచి లాభం :**
సెరిలాక్ మంచి పోషక పదార్థాలకు, మంచి రుచిని కలిపింది. పాపాయిలకు సెరిలాక్ రుచి భలే ఇష్టం.

**సమయం ఆదా లాభం :**
సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార ఉన్నాయి. దాన్ని వెచ్చటి నీటిలో కలిపితే చాలు. క్షణంలో ఆహారం తయారు.

మీ పాపాయికి సమతూకంతో పోషకాహారాన్ని అందించేందుకు తయారుచేయడంలో పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.

ఉచిత సెరిలాక్ పుస్తకం కోసం వ్రాయండి.
సెరిలాక్
పోస్ట్‌బాక్స్ నం: 3.
న్యూఢిల్లీ-110 008.







## సెరిలాక్ రక్షణ: పోషకాహారంలో పరిపూర్ణం-ఎంతో రుచికరం

ప్రవేశించాడు లోపలి ఉత్తరాన్ని తీసి చదవసాగాడు దేవి చిద్విలాసంగా వింటోంది

పూజనీయులు పరబ్రహ్మ శాస్త్రిగారికి నమస్కారాలు!

సాహసం చేసి ఈ ఉత్తరాన్ని రాస్తున్నందుకు మన్నించాలి

నా పేరు లింగమూర్తి నేను హరిజనుణ్ని నా తండ్రి ఏడు కొండలు మీకు బాగా తెలుసు మా తాత ముత్తాతలందరూ చెప్పులు కుట్టే బ్రతికే వాళ్ళు నా తండ్రి నన్ను బాగా చదివించాడు ఏదో దైవానుగ్రహం వల్ల నేనూ చదువ గలిగాను బి ఏ చేసాను బ్యాంకులో మంచి నౌకరి దొరికింది నెలకి పదిహేను వందల జీతం నా తండ్రిని నా దగ్గరికి తీసుకెళ్ళాను కాని ఆయనకి అప్పటికే త్రాగుడు వల్ల కేన్సర్ బాగా ముదిరి పోయింది అంతిమ గడియల్లో నా కొక సంగతి చెప్పారు నేనివాళ చదువుకొని ఈ దశలో ఉన్నానంటే దానికి కారణం మీరేనని! మీ కొచ్చే కొసింత ఆదాయంలో నే నాకూ సహాయం చేసేవారని నా తండ్రి చెబుతుంటే నాకు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి మనుషులంతా ఒకటేనని మీరు నమ్మడమే కాక అందరూ అలాగే ఉండాలని కోరు కొంటారని కూడా నా తండ్రి చెప్పాడు అందుకే మీకు చేతులెత్తి మొక్కుతున్నాను!

మీ కథంతా తెలిసింది నేను అంటరాని వాణ్ని గుడి లోపలికి కూడా రాకూడదు అందుచేతే రాలేక పోతున్నాను అయినా నాకు మేలు చేసిన మీకు ఏదో ఒక రకంగా మేలు చేయాలను కొంటున్నాను అందుకే ఏమైనా సరేనని అమ్మవారి మీద ఒట్టేసి మరీ చెబుతున్నాను!

మీ కుమార్తె గాయత్రిని మీరు అంగీకరిస్తే పెళ్లి చేసు కొంటాను అది కూడా గాయత్రికి ఇష్టమైతేనే! నా కేమీ అక్కర లేదు అమ్మవారి సన్నిధిలో మీ దంపతుల ఆశీర్వచనాలు చాలు! అమ్మ వారి దగ్గరికి నన్ను రానివ్వక పోయినా పరవా లేదు నేను అమ్మవారిని తలచుకొంటే నా కళ్ళల్లో మెదులు

## అస్త్రప్రయోగం

అగాదాల అంచులపై
రాక్షసత్వపు నడలో
పయనిస్తోంది నా దేశం
పవిత్రమైన బారతావని
భ్రష్టుపట్టి పోతోంది
మతం పేరిట మారణహోమాలు
ఆస్తుల పేరిట హత్యాకాండలు
శీలవతుల మానబంగాలు
ఈ కుత్సితాలకు కారకులు
దేశవిచ్ఛిత్తికి దారితీసే నికృష్టులు–
బరతమాతను అగాదంలోకి
తోసెయ్యాలని ప్రయత్నిస్తున్నారు
ఓ మహిషాసుర మర్దినీ!
దేశం దేశంగా మిగలాలంటే
బరతమాత శోక ఆగాలంటే
ఓసారి నీ అస్త్రాన్ని సంధించు
శిష్టరక్షణకై దుష్టశిక్షణ గావించు!

–మధుశ్రీ

## అర్చన

తుంది గాయత్రిని పాణి గ్రహణం చేసేందుకు మీ అనుమతి కావాలి! ఆమె ఇష్టపడితేనే అది కూడా!!

మీరీ రాత్రంతా ఆలోచించండి గాయత్రికి కూడా చెప్పండి నిర్ణయం మీదే నేను రేపు మళ్లీ కలుసాను

మీకు మరో మారు పాదాభివందనం చేస్తూ ఒక చిన్న మనవి విశాలాక్షమ్మ గారికి ఆరోగ్యం సరిగ్గా లేదని తెలిసింది ఆమె చికిత్స నిమిత్తం మూడు వేల రూపాయలను ఈ కవరులో నే ఉంచుతున్నాను మరోలా భావించక ఈ మొత్తాన్ని స్వీకరించి నన్ను మన్నిస్తారని ఆశిస్తూ సెలవు తీసుకొంటున్నాను

లింగమూర్తి

పరబ్రహ్మ శాస్త్రి కళ్ళు మూసుకొన్నాడు కర్తవ్యం బోధపడడం లేదు

ఏకవీరికా! ఏమిటీ అగ్ని పరీక్ష? అనుకొన్నాడు శాస్త్రి

దేవి మాట్లాడినట్లనిపించింది

శాస్త్రి! నీ ఊహ తెలిసినప్పటి నుంచీ నన్ను కొలుస్తున్నావు కదా! నేనెవరిని? కొండరాజు పుత్రికను కదయ్యా! అంటే ఏమిటి నా కులం? గిరికులం కాదా? నేనూ అంటరాని దాన్నే కదా! మరి నన్నందరూ పూజించడం లేదూ? దేన్ని చూచి? కులాన్ని చూచా? ఆది దేవుడు శ్మశానప్రియుడు అంటరాని వాడు ఆయన నా భర్త కాడా? ఆలోచించు ఏకైక మాతను నేనైనప్పుడు అందరూ నా బిడ్డలే! అందరూ సమానులే! సందేహించకు! గాయత్రిని లింగమూర్తి కిచ్చి కల్యాణం జరిపించు అంతే కాదు లింగమూర్తి ఇచ్చిన డబ్బుతో విశాలాక్షి ఆరోగ్యం బాగు చేయి మరో మాట అంటరాని వారనే ప్రసక్తే లేకుండా అందరికీ ఆలయ ప్రవేశం కల్పించు ఇది నా ఆజ్ఞ

త్రుళ్లిపడ్డాడు పరబ్రహ్మశాస్త్రి తృప్తిగా కదిలాడు

ఏనాడూ అంతటి సంతోషాన్ని అనుభవించి ఉండలేదు శాస్త్రి

విశాలాక్షికి భర్త ఆనందం చూచి సగం జబ్బు నయమై పోయింది

గాయత్రికి ఎక్కడలేని ఉత్సాహమూ కలిగింది

కడుపు నిండని అన్నం తిన్నా శాస్త్రి త్రేన్పడం ఆశ్చర్యం అనిపించింది ఆయన భార్యకి! భయం కూడా వేసింది

రాత్రి వచ్చింది అనుకోకుండా వర్షం మొదలయింది

పరబ్రహ్మ శాస్త్రి భార్యకు అంతా చెప్పాడు గాయత్రి వింది సమాజం, కట్టుబాట్లు, బ్రాహ్మణీకం, వెలి– ఎన్నో ప్రశ్నలు హోరుమనే గాలిలో కలుస్తున్నాయి. "మీ ఇష్టమే నా ఇష్టం" అంది గాయత్రి! బిడ్డ సుఖమే నాకు ప్రియం అంది విశాలాక్షి, దేవి ఆజ్ఞే నా కర్తవ్యం అనుకొన్నాడు పరబ్రహ్మ శాస్త్రి

వాన వెలిసింది. తూర్పున కాంతిపుంజం ద్యోతకమవుతోంది

దేవి గుడిలో వేద మంత్రాలు విన్పించాయి జేగంటలు మ్రోగాయి హారతి గుడి గడప దాటింది. లింగమూర్తి ఎంతో సంతోషంతో కళ్ల కద్దు కొన్నాడు శాస్త్రిగారి పాదాలకు నమస్కరించాడు

లోపలికి రా బాబూ! అన్నాడు శాస్త్రి! లింగమూర్తి సందేహంగా భయంగా గుడిలో కాలు పెట్టాడు దేవిని చూచాక అంతా అభయమే!

న జానే ముద్రాస్తే తదపి
చ న జానే విలపనమ్
వరం జానే మాత స్త్వదను
సరణం క్లేశ హరణమ్

అంటూ దేవి పాదాల ముందు మోకరిల్లాడు పరబ్రహ్మశాస్త్రి! □



# "లవంగ నూనె లేని టూత్ పౌడరు నాకు పనికిరాదు"



"నాకిష్టమైన టూత్‌పౌడరు ప్రామిస్. ఎందుకేమిటి, దీన్లో లవంగ నూనె ఉంది: అందుకే ఇది ఊరూరా పేరు మోసింది. లవంగ నూనెలో రెండు గొప్ప సుగుణా లున్నాయి. ఇది చిన్నచిన్న బాధలనుంచి పళ్లను సదా కాపాడుతుంది. పైగా పళ్లకు చెడుపుచేసే సూక్ష్మజీవులు దీనిదెబ్బకు నశించిపోతాయి.

ఇందువల్ల పళ్లు గట్టిగా ఉంటాయి. దీని మరొక గొప్ప గుణమేమిటంటే, ఇది నోటిని తాజాగా, సువాసనగా ఉంచుతుంది. అంటే మనం మాట్లాడుతుంటే ఎదుటి వాళ్లు మొహం తిప్పుకోరన్నమాట!

మరొక ముఖ్య విషయమేమిటంటే, ప్రామిస్‌లోని సద్గుణాలతో పోలిస్తే దీని వెల చాల తక్కువ. దీనిపైన పెట్టిన పైసపైసకూ మనకు ఫలితం దక్కుతుంది.




30 గ్రా. పౌచ్‌లో కూడా లభిస్తుంది.

నన్నడిగితే ప్రామిస్ టూత్‌పౌడరే తెచ్చుకోమంటాను. ఇది లవంగ నూనెతో నిండినది. బల్సారా వారు ఎంతో ఆలోచనతో సృష్టించినది".

## లవంగ నూనెతో అద్భుత సృష్టి

# ప్రామిస్ టూత్‌పౌడర్



బల్సారా—
టూత్ పేస్ట్ విశేషజ్ఞులు



కె బి ఎం. గుళ్ల సీతారాంపురం

★ ప్రేమ అన్నది ఒక ఆరాధన అనీ ఆ ఆరాధనే ఒక ఆవేదన అనీ అంటాను మీరేమంటారు?

● ప్రేమకి ఎవరి నిర్వచనం వారిచ్చుకోవాలి అందుకే ప్రేమ ఆరాధన అయినా, ఆవేదన అయినా— పెళ్ళితో కుదిరి పోవాలి కద! అలా జరగదే?!

జి ఆర్ ఎన్. ఆదోని

★ ప్రపంచానికి వెల్తురునిచ్చే సూర్యుడు గొప్పా? అతన్ని అందకారంలో ముంచే మేఘం గొప్పా?

● మేఘం ఎంతసేపు నిలుస్తుందని?!

టి.జి కె అంబుసోలి

★ నేనే నీ కూతుర్నయితే నాకు నచ్చిన వాడితో పెళ్ళి చేస్తారా?

● ముందు— నువ్వు నా కూతురివైతే యిలా అడిగేదానివి కాదని అర్థం చేసుకో గౌరి పిల్లల పెళ్ళికి ఒక్క వయసొచ్చేస్తే చాలదు బుర్రలో కాస్త గ్రే మేటర్ కూడ అవసరం!

ఎ ఎల్.ఎన్ ఆదోని

★ డబ్బు, ఆడది ఒకటే నంటాను ఎందుకంటే డబ్బు కోసం మగాడు ఏమైనా చేయకలడు అలాగే ఆడదాని కోసం కూడా— ఏమైనా చేయకలడు

● అంచేత ఆడది డబ్బయి కూర్చుంటుందా?!

పి ఎస్.బి. శ్రీకాకుళం

★ సృష్టిలో తీయనిది స్నేహబందమా? రక్త బంధమా?

● స్నేహం బందం! రక్తం పాశం! అంచేత మీరే అర్థం చేసుకోండి— ఏది తీయనిదో

జి ఎమ్ ఆర్ విశాఖపట్నం

★ చరిత్ర తల కిందులు చేసే ప్రభుత్వాల నేమనాలి?

● అసలు చరిత్రే చెడ్డ ప్రభుత్వా లిలా వుంటాయని తెలియ చెప్పేది కద!, చరిత్ర కెక్కనివ్వండి!




యు ఎస్ ఎమ్మిగనూరు

★ ప్రతి మనిషి మరి ఒకరిని దోచుకునే వాడే తన సౌఖ్యం తన స్వార్థం చూసుకునేవాడే ఇలా అయితే దేశం బాగుపడే దెప్పుడు?

● మీలా స్వంత సౌఖ్యం స్వార్థం గురించి ఆలోచించని వాళ్ళు కొందరైనా ఉండరంటారా?! దేశం బాగుపడే కాలం రాదంటారా?

బి ఎస్ ఆర్ ఎమ్మిగనూరు

★ ఇప్పుడొస్తున్న నవలలన్నీ క్షుద్ర శక్తులకు సైన్సు విజ్ఞానం జోడించి వస్తున్నవే ఇది మంచి దంటారా?

● ఎవరు చెప్పగల వారు?! ఎవరికి వారే పెద్దలు చదవడం యిష్టం లేకుంటే— మానడం ఒక్కటే దారి లేదూ కుతూహలం ఆపుకోలేక చదివి చూద్దామనుకోవడం పెద్ద తప్పు కాదు— చదివి-దానిలో మంచి చెడు గ్రహించకల వయసు గలవారికి! సమాజాన్ని ఎవరూ ఉద్ధరించక్కర లేదు ఎవరిని వారు ఉద్ధరించుకొనే శ్రమపడితే.

★ మునుపటి కంటె యిప్పుడు కదల ప్రమాణం తగ్గి పోయిందంటాను మీరేమంటారు?

● నేను కథలూ కవితలూ కూడా చదువుతాను కాని ఇప్పుడు కదలకి వేస్తున్న బొమ్మలు చూసి— అవి చదవడానికి జంకుగా వుంది— తగ్గించేశాను! ఇది సీరియల్ యుగం! మంచి కథకి చోటు తక్కువే

★ మీ అబిమాన రచయిత ఎవరు?

● ఏ భాషలో? నేను పొత్తూల కాగితాల దగ్గర నుంచి తిరగేసేరకం!

★ మారే కాలంతో పాటు మారేది ఏది?

● సర్వం మారి తీరాల్సిందే లేకపోతే కాలం ముందుకి మనం వెనక్కి పరుగెడుతూ వుంటాం!

పి ఎస్. హైదరాబాదు

★ డిగ్రీలు చదివినా ఉద్యోగాలు రాకపోడానికి కారణం పెరుగుతున్న విజ్ఞానమా? జనాబానా? ఒకవేళ జనాభా అయితే చదవడం ఎందుకు? ఆ కాలంలో స్వయం ఉపాధి ఏదన్నా సాధించవచ్చు కదా?

● తప్పకుండా! అసలు చదువుకీ దొరికే పనికీ సంబందం ఉండని యీ రోజుల్లో— డిగ్రీలు అనవసరమే! ఒక్క మనదేశంలో నే యీ డిగ్రీల పిచ్చి హైస్కూలు దాటగానే ఏదో వృత్తి విద్య చేపట్టి, వయోజనులు కాగానే స్వంత కాళ్లపై నిలబడే ప్రయత్నాలు చేస్తారు పాశ్చాత్య యువకులు మన వాళ్ళల్లా డిగ్రీల కోసం సీట్లుకొని, ఆ డబ్బు రాబట్టడానికని కట్నం అడిగి, అది చాలదని నవ వధువుల ప్రాణాలతో చెలగాటాలాడడం యింకెక్కడా చూడం— చదువెక్కువైన కొద్దీ కనీసపు సంస్కారం నశించిపోతూ వుంటే— అలాంటి చదువులు కావాలా— ఆలోచించండి వయసులోనే కష్టపడ కలరు, శ్రమ చెయ్యకలరు, సాహసించ కలరు యివన్నీ వదులుకోడం శుద్ధ అవివేకమే

కె.కె ఆర్. ఖర్గపూరు

★ స్వేచ్ఛ అంటే నిర్వచనం?

● ఎదుటి వాడికి యిబ్బంది కలక్కుండా మన యిష్టం వచ్చినట్టు మనం వుండకల్గడం

జి కె.కె ఆర్. దాడితోట

★ నేడు మళయాళ సినిమాలలో అర్ధనగ్నంగా కన్పిస్తూ తమ శరీరాన్ని డబ్బుకి అర్పిస్తున్న స్త్రీలను అసహ్యించు కొంటున్న మగవారిని విమర్శించే హక్కు మీకు వుందా కె ఆర్ గారూ?

● లేదు! అలా అర్థ నగ్న స్త్రీలను విమర్శించే హక్కు మీకు లేదు! అది చూడడానికే కద ఒంటరిగా పడిపోతూ వుంటారు సినిమాలకి?! అసహ్యించు కొందుకా అంత కష్టపడుతున్నారు మీరంతా తెలియలేదు లేకుంటే 'అశ్లీలత రూపుమాపాలోయ్' అని గోల చేస్తున్న మేమంతా మీ వెనక వుండేవాళ్లం కద?!

ఎస్.వి లోయర్‌మానేరుడామ్

★ ప్రస్తుత పరిస్థితులలో రిజర్వేషన్లు వుండడం మంచిదేనా?

● దరిద్రంగా దిగజారిపోయిన ఆర్థిక స్థితి చూస్తూవుంటే— గొప్పా— పేదా రిజర్వేషన్లు మినహా యింకేం వుండాలి వెంకటేశంగారూ, శాశ్వతంగా కొన్ని వర్గాలని పెంచి పోషించాలనుకోడం— ఆ వర్గాలకే అన్యాయం చేయడం కాదా? □



# 'మామూలు' దసరా



నీకు 'దసరా మామూలు' ఇచ్చుకోలేనోయ్.
కావాలంటే ఓ రెండు కుస్తీపట్లు నేర్పిస్తా..!
భీం సింగ్ పహిల్వాన్
POST




'దసరా మామూలు' ఇవ్వలేదని ఫ్యూజులు పీకేసారోయ్!




ఈ ఏడు మీకొచ్చే దసరా మామూళ్ళు మా బ్యాంకులోనే డిపాజిట్ చెయ్యాల్సార్!
POST




పోస్టాఫీస
మీ ఉత్తరముల 'సత్వర బట్వాడా'కు వెంటనే "దసరా మామూళ్ళు" చెల్లించండి






ఈ ఏడిచ్చిన బోనస్‌తో చీరకొనిపెట్టాలా? చాలు చాల్లే. రేపు అందరికీ దసరా మామూళ్ళు ఇవ్వకపోతే నా పీకల మీద కూచుంటారుతెల్సా..




కానిస్టేబుల్.. ఇతనికి 'దసరా మామూలు' కావాలిట ఓ నాలుగు తగిలించి పంపించు!
POST

సీరియల్

# పావని

సి. విమలాగణేశ్



(గత సంచిక తరువాయి)

ఆనాడు పావనివల్ల పరాభవం పొంది మళ్లా యూనివర్శిటీ గడప తొక్కని మదన్ కొద్ది పెట్టుబడితో వ్యాపారం ప్రారంభించాడు ప్రారంభించిన వేళా విశేషమో లేక లక్ష్మిదేవికి గారాల పుత్రుని అంశతో జన్మించాడో అదీ యిదీగాక విధి ఆడించే పరిభ్రమణ చక్రంలో వున్నత స్థానానికి చేరుకున్నాడో తెలియదు గాని అతను పట్టిందల్లా బంగారం అయింది వందలు వేలూ, వేలు లక్షలుగా మారినవి ప్రస్తుతం మదన్ పూర్తిగా స్మగ్‌లింగ్‌లో కూరుకుపోయాడు పేరుకు మాత్రం ట్రాన్సుపోర్టు నడుపుతున్నాడు పెద్ద భవంతి, ఫుల్ ఏర్‌కండిషన్‌తో అందంగా నిర్మించి అధునాతనమయిన ఫర్నిచర్‌తో ఓ యిరవై మంది స్టాఫ్, అందులో అందమయిన స్త్రీలు కొందరు, అతి ఆధునికంగా అతని గది అలంకరించబడింది పన్నీటితో జలకాలాడుతూ ఫారిన్ సరుకుతో కడుపు నింపుకుంటూ అందమయిన భామల కౌగిళ్లలో తూలుతు' స్వర్గమంటే యెక్కడో లేదు, యిక్కడేనని నిరూపిస్తున్నాడు

గదిలో అందాల భామతో ఆనందంగా సరసాలాడుతున్నాడు మదన్ నోటితో పొగ పీలుస్తూ బ్రాంది బామ అందిస్తుంటే త్రాగుతూ ముద్దాడుతున్న సమయం అంతలో ఫోన్ మ్రోగింది

ఎస్ భామ

బాస్ కావాలి' అవతలి కంఠం

మిరే కావాలటసార్

'ఇదో వెధవ న్యూసెన్సు" అంటూ పోనందుకొని

'ఎస్'

'నేనుసార్ దివాకర్ని"

'ఏమిటి విషయం?'

లాల్ ఫోన్ చేశాడు

ఏమిటి? యెందుకు?

"అదేసార్ ఆ బంగారం

'అదా! యేం చెప్పాడు?'

'మీతో నే డైరెక్టుగా మాట్లాడాలట '

' సరే కనెక్షనివ్వు ' పది నిముషాలతో కనెక్షన్ దొరికింది

' మదన్ స్పీకింగ్"

"నమస్తే సాబ్ నమస్తే

'ఆ నమస్తే

' సాబ్ ఆ విషయం?"

' తెలుసు. క్యాష్ రడీయా?

' ఎస్ సాబ్!"

సరే సాయంత్రం ఆరు గంటలకు మిస్ మల్లి వస్తుంది ఆ డబ్బు పంపండి'

'మరి సరుకు?'

'అదే వస్తుందయ్యా"

అలాగే సాబ్"

' ఓ కె ఆరు గంటలకు గుర్తుందా?'

' సరే సాబ్" లైను కట్

"అబ్బా వెధవ న్యూసెన్సు' అంటూ అందాల ఆ భామ పెదాలతో ఆడుకుంటూ మురిపెంగా ఒరిగిపోయాడు ఆమె కౌగిలిలో మదన్

* * * * * * * * *

ఆనందరావుని విధి ఘోరంగా దెబ్బ తీసి వెర్రివాడుగా నిలిపింది యం యస్ సి పూర్తి చెయ్యలేకపోయాడు గోల్డ్ మెడల్ విద్యార్థి ఆలనా పాలనా గమనించని చీడపురుగులాంటి యీ సంఘం పుష్కలంగా డబ్బూ పలుకుబడీలేని ఆనందరావును గమనిస్తుందా? అలా గమనించి ఆదరించి మంచి దారి చూపిస్తుందనుకోవటం కేవలం పొరపాటు వుద్యోగాన్వేషణలో కొంతకాలం వృథా అయింది తన కెలాంటి వుద్యోగమూ దొరుకదు యింటర్వ్యూల పేరుతో అప్పులపాలు కావటం యిష్టంలేని ఆనందరావు గంపెడు భారంతో యిల్లు చేరాడు యీ భారం చాలదని కాబోలు అదృష్ట దేవత మోయలేని బారాన్ని తలపై వేసింది. అది తండ్రి మరణం హాస్పిటల్ నుంచి శవం యింటికి రావాలి' ఎలా? కన్నీరు తుడిచేవాళ్లే లేరు యేం చేయాలి? భర్త చనిపోయి ఖర్మకాండరోజు తీయవలసిన తాళి అదే పవిత్ర మాంగల్యం తీసి కొడుకు చేతిలో పెట్టింది కన్నీళ్లతో తల్లి భరించరాని బాధ వుక్కిరి బిక్కిరి చేసింది ఒక స్నేహితుడి పుణ్యాన మార్వాడీవద్ద వెయ్యి రూపాయలు తీసికొని తండ్రి కర్మకాండ ముగిసేలా చూశాడు

అప్పుల బాధ, సంసారం, పెళ్లి కెదిగిన యిద్దరు చెల్లెళ్లు బుసకొట్టే

**జరిగిన కథ-4:** విజయ్,పావని ప్రేమించు కుంటారు పెళ్లి చేసుకోవాలని కలలు కంటారు పరీక్షలు ముగిశాయి పావని సవతి తల్లి దగ్గరకు వచ్చింది మామ కూతురు లతను వివాహం చేసుకోనని విజయ్ చెప్పగానే మామ అసలు స్వరూపం బయట పడింది చెప్పలేని ఆవేదనతో అర్ధరాత్రి మామ ఇట్నుంచి బయట పడ్డాడు విజయ్ విజయ్, పావనిలు రిజిస్టర్ మేరేజ్ చేసుకుంటారు విజయ్ ట్యూటర్‌గా ఒక కాలేజీలో ఉద్యోగంలో చేరుతాడు రోజీ ఒక హోటల్ ప్రొప్రయిటర్ అయిన మాజీ మినిష్టర్‌కి సెక్రటరీగా చేరింది అత్తెసరు మార్కులతో పాసయిన దినేష్ తండ్రి పలుకుబడితో పోలీసు శాఖలో ఉన్నతోద్యోగంలో చేరాడు

త్రాచుపాముల్లా కన్పిస్తున్నారు తానేం చెయ్యగలడు? యీ సంసారాన్ని యెలా పోషించి దారికి తేగలడు? అంతా అయోమయం, శూన్యం యింటికి వెళ్ళడానికి బుద్ధి రాలేదు చీకటిలో అలా ఆలోచిస్తూ వూరి వెలుపల వున్న గుడి దగ్గర కూలబడ్డాడు, భగవాన్ నాకేదయినా దారి చూపించు అని పదే పదే తలపోస్తూ

అంతలో ఆదరా బాదరా ఓ స్త్రీ వచ్చింది షుమారు పాతిక సంవత్సరాలుండవచ్చు అందమయినదనే చెప్పొచ్చు

బాబూ! నాకో సాయం చెయ్యగలరా? ఆయాస పడుతుందా స్త్రీ

నేనా! చిరునవ్వు బహుశా విరక్తితో కూడుకున్నది

అలా అనకండి బాబూ! మీకు పుణ్య ముంటుంది!

నావల్ల అయ్యేదయితే చెయ్యగలను

తప్పక జౌతుంది!

అయితే చెప్పమ్మా!'

నన్ను పోలీసులు తరుము కొస్తున్నారు

పోలీసులా? నిన్నా? ఎందుకు?'

"ఆ వివరాలన్నీ తరువాత చెబుతాను ముందు మీరు...."

"నేను?"

"వాళ్ళొచ్చి అడిగితే నేను మీ భార్యనని చెప్పండి!"

"భార్యవనా?"

"ప్లీజ్! మీకే హానీ జరుగదు."

"ఏమిటమ్మా మీ రనేది?"

బాబూ! మీరేం మాట్లాడకండి వాళ్ళొస్తున్నారు' అంటూ అతనికి ఆనుకొని కూర్చొని అతనిపై ఒక చేయి వేసింది

'అబ్బా' యేంటండి సినిమాకని తెచ్చారు టిక్కట్లుండలా పదండి యింటికంటే కాస్సేపు చల్లగాలిలో కూర్చొని వెళదా మంటారు టైం పదకొండవుతోంది పదండి పోదాం అతని కంతా అయోమయంగా వుంది వస్తున్న పోలీసులు ఆమె మాటలు విన్నారు దగ్గరకు రాగానే టార్చి ముఖానికి వేసి,

ఎవరు మీరు?

ఎవరా! కనపడటంలా? భార్యాభర్తలం ఆనందరావు తడుముకోకుండా అన్నాడు

ఇక్కడేం పని?

'బాగుంది మీ ప్రశ్న! ఏమండీ కనీసం యిక్కడయినా మొగుడూ పెళ్ళాలని కాసేపు అయినా ప్రశాంతంగా వుండనివ్వరా?'

ఇల్లూ వాకిలీ లేదా?



# పావని

లేకేం నిక్షేపంలా వున్నాయి అమ్మా, చెల్లీ అందరూ వున్నారు యేదో కాసేపు సరదాపడి వస్తే యిక్కడ మీ తొందర ఆనందరావు చమత్కారంగా చూశాడు

యిల్లెక్కడ?

చెప్తాడు పూర్తి వివరాలు

యెవరయినా అమ్మాయి యిటు పరుగెత్తిందా?

అమ్మాయా? పరుగెత్తటమా? మేం గమనించలేదే! ఆనందరావు జవాబు

దొరక్క యెక్కడికి పోతుంది? పదవోయ్ వాళ్ళు వెళ్ళిపోయారు

అమ్మయ్య! రక్షించారు మీ మేలు మరచిపోలేను

చూడమ్మా! నీ వెవరు? వాళ్ళెందుకు నీ వెంట పడ్డారు? యెందుకలా అబద్ధం చెప్పమన్నావు? నే తెలుసుకోవచ్చా?

నిజం చెప్పమన్నారా?

అనేగా!

వినలేరు!

వినగలను చాలా విన్నాను

నేనో వ్యభిచారిణిని

ఏమిటి నువ్వనేది?

లాడ్జిలో రైడింగ్ జరిగింది నేను తప్పించుకొని వచ్చాను

నిజంగానా?

వచ్చి నిజం అసహ్యించు కుంటున్నారా? తప్పులేదు అంటూ అంతా వివరించి చెప్పింది విన్న అతని మనసు నీరయింది. అతని కథ విని బాదపడింది

మీరేమి అనుకోనంటే!

చెప్పమ్మా!

'నాకు చేతనయిన సహాయం చేస్తాను'

నాకా? ఎలా?

'అసహ్యించు కోరుగా!

'భలేదానివే! చెప్పు!

డబ్బు సంపాదించాలి. అంతేగా?

'ఔను

ఈ సంఘం డబ్బున్నవాళ్ళకు గౌరవ మర్యాద లిస్తుంది అది ఎలా సంపాదించారన్నది ముఖ్యం కాదు

ఔను ఆ విషయం నాకూ తెలుసు ఆనందరావు ఆకాశంలోకి చూస్తూ అన్నాడు

నాతో చేయి కలపండి నాకు అండగా నిలబడండి అంతే!

అంటే?

చెప్పానుగా, నాకు తోడుండమని

చిరునవ్వు నవ్వాడు

అంతే. ఆ నాటి నుండి ఆనందరావు సంసారం పస్తులతో మాడలేదు కడుపు నిండా భోజనం వంటి నిండా బట్టా యివ్వ గలిగాడు అతని వుద్యోగం ఏమిటి? రాత్రి చీకటి వ్యాపారం! పరిస్థితులు ఒక్కొక్కరిని యెంత క్రూరంగా కృంగదీస్తాయో చెప్పడం కష్టం

* * * *

వీళ్ళందరూ ఒకే యూనివర్శిటీలో ఒకే సబ్జక్టులో చదువుకున్నారు అందమయిన ఆశావహమయిన జీవితం గడిపారు భవిష్యత్తును మధుర మనోహర లహరిగా వూహించుకొని పంచరంగుల స్వప్న లోకంలో నుండి నిజ జీవితంలోకి అడుగుపెట్టారు గోల్డు మెడల్ విద్యార్థి అందరి మన్ననలూ పొంది ఆదర్శంగా నిలిచిన విద్యార్థి జీవితంలో గూడా గోల్డ్ మెడల్ మెరిసినట్లు ప్రకాశించగలడా? అందాలరాశి యూనివర్శిటీ బ్యూటీ అందర్నీ ఆకర్షించి ఆరాదించబడిన అమ్మాయి జీవితంలో కూడా పదుగురూ మెచ్చేటట్లు











నిలదొక్కుకోగలదా? యీ ప్రశ్నలన్నీ సామాన్య వ్యక్తిని వేధించినట్లే నా మనసులో నూ నిలిచి నిత్యమూ వేదనకు గురిచేస్తున్నాయి వాటికి సమాధానం కాలమే 'యివ్వగలదనుకుంటాను మానవుని స్వశక్తి కొంత తోడ్పడినా మనకు తెలియని అదృష్టమో లేక విధే అనాలో తెలియదు కాని వీటి ప్రభావం వ్యక్తుల యొక్క మంచి చెడ్డలకుదోహదం చేస్తాయని నా నమ్మకం విధి ఒకరిపై విషంకక్కి వికటంగా నవ్వి సవతి తల్లిగా విసరికొడితే మరొకరి విషయంలో లేక లేక కలిగినగారాల బిడ్డగా కందిపోతాడని వూయల్లో మల్లెపూలు పరిచి నిదురపుచ్చే కన్నతల్లిలాగా పెంచుతుంది ఏమిటి తేడా? సృష్టి రహస్యమా? భగవంతుడికే తారతమ్యాలు ఆపాదించుకోవాలా? లేక పూర్వజన్మ పాప పుణ్యాలుగా బావించాలా? ఏమనాలి"

*   *   *   *   *

జీతం అందుకున్న విజయ్ బార్యకొక చీర, మల్లెపూలు కొని వేగంగా వచ్చాడింటికి పావని వంట ముగించి స్నానానికెడుతూంది

వచ్చారా' రండ చిరునవ్వు చిందించింధి

పావనీ నీ కోసం ఏం తెచ్చానో చూడు

మీరే నావారు నాకింకేం కావాలి?

అది సరే యిదిగో నా తొలి సంపాదన డబ్బు అందివ్వబోయాడు'

ఒక్క క్షణం స్నానంచేస వస్తాను

త్వరగా రావాలి

ఓ అలాగే

పావనీ'

'ఏమండీ

'ఎన్నాళ్ళగానో నాకో కోరిక'

'ఏమిటండీ అది?

తీరా చెప్పాక వెక్కిరించకూడదు నవ్వి వీలుపడదనకూడదు'

'సరే అనను చెప్పండి"

కాదనవుగా?

అనను చిరునవ్వు నవ్వింది

చెప్పేస్తున్నా

ఊఁ చెప్పండి ఒన్ టూ

'మనిద్దరంకలసి స్నానం చేయాలి

'ఛీ' ఏమిటా పాడు బుద్ధులు?

"తీరా చెప్పాక యిలా అనటం బాగోలేదు

'ఆ' బాగోదు

"నా కోరిక తీరుస్తానని మాటిచ్చావ్

బాగుంది వరస యిలా తీరుస్తూపోతే మీ కోరికలు బావిలో ఊటలా పూరుతూనే వుంటాయి ముందు మీరెళ్ళి స్నానం చేస రండి'

ప్లీజ్'

అవేం కుదరవు వెళ్ళండి'

యిద్దరి స్నానాలూ ముగిశాయి

ఈ చీర కట్టుకో తాను కొని తెచ్చిన కొత్త చీర అందించాడు కట్టుకొంది అతని చేతులతో నే పువ్వులు తలలో అలంకరించాడు

'ఎంత అందంగా మెరసి పోతున్నావో తెలుసా?

'ఆ చాలు పొగిడింపులు నిలపండి

యిందా డబ్బు

నాకెందుకు? మీ దగ్గరే వుంచండి

పావనీ ముందే చెప్పానుగా యింటి బాధ్యత నీది యిదో డబ్బు మళ్ళీ నెల వరకూ ఓ పైసా కూడ రాదు నీ యిష్టం

అంతా నాకే యిచ్చారు మరి మీ కాఫీ ఖర్చులకు?'

దేవిగారి దయ

ఎంత కావాలి?"

'మీ దయన్నానుగా'

సరే యిందా యాభై యిచ్చింది

నాకే

'మీకే నవ్వింది

మిగిలిన డబ్బు యింటికి చాలుతుందా?

ఆ బాధ్యత నాదిగా అతని గుండెలపై తలపెట్టింది మల్లెపూల చెండు తన ముఖం మీదికి లాగి వాసన చూస్తూ-

పావనీ ఓ విషయం'

చెప్పండి'.

నాకో మంచి ఉద్యోగం దొరికే వరకూ మనకు పిల్లలే వద్దు

అది మన యిష్టమా?'

'ఔను'

సరే మీ యిష్టమే నా యిష్టం అతని పెదాలపై వేలితో రాస్తూ అంది

'పావనీ నాకు మంచి వుద్యోగం వస్తుందంటావా?

మళ్ళీ మీ పిచ్చి ఆలోచనలు మొదలా' రాకెక్కడికి పోతుందండి

నిజంగానా?

'నిజం'

ఆమెను పెనవేసుకున్నాడు

★ ★ ★ ★ ★ ★

డాక్టరమ్మకెదురుగా కుర్చీలో కూచుంది పావని ఆ డాక్టరు మంచి పేరున్న వ్యక్తి

# పావని

"మీ పేరు? ,

"పావని

'ఏం చేస్తుంటారు"

'మా వారు కాలేజీ లెక్చరరు'

'నేనడిగింది మిమ్మల్ని గురించి"

"ఇంటి పని వంట పని"

'మీ చదువు?"

యం. యస్ సి"

'ఇంత చదివి ఉద్యోగం చేయటంలేదా?"

"మావారికది యిష్టంలేదు"

"మీరొప్పుకున్నారా?"

'నా భర్త ఏది చెప్పినా ఒప్పుకుంటాను ఇప్పుడు నేను వచ్చింది కూడా వారు చెప్పిన మాట వినటం కోసమే!"

"సరే విషయం చెప్పండి"

'నాకు పీరియడ్స్ సక్రమంగా రావు ఒక్కోసారి రెండు మూడు నెలలు కూడా కావచ్చు ప్రస్తుతం నాకేదో అనుమానంగా వుంది"

'ఎందుకు?

'గర్భమేమోనని'

"టెస్టు చేస్తే సరి' పూర్తయ్యింది

'మీరిప్పుడు గర్భవతి"

'అయితే నా అనుమానమే నిజమయింది". పావని బాధగా అంది.

"ఔను'

'కానీ ఈ గర్భం నిలువకూడదు పోగొట్టండి డాక్టర్",

'అంత అవసరమా?"

ఔను!"

'పెళ్లికాని పిల్లకు గర్భం వస్తే భయపడినట్లు భయపడుతున్నావు పెళ్లి అయింది భర్త వున్నాడు. పైగా తొలి కాన్పు ఎందుకు కంగారు?'

"ప్రస్తుత పరిస్థితుల్లో నేను తల్లినికావడం ఆయనకిష్టంలేదు!'

'ఎందుకని?"

"బహుశా నే చెప్పినా మీ కర్థంకాదు".

'అలాగా!'

"దయచేసి అబార్షన్ చెయ్యండి ప్లీజ్'

మందులు రాసి యిచ్చి వేసుకోవలసిన విధానం చెప్పింది. చెప్పిన ప్రకారం పావని మందులన్నీ వాడింది కాని ఫలితం శూన్యం నీరసం, కళ్ళు తిరగడం ఎక్కువయ్యింది విజయ్ పావనిని ఆసుపత్రి చేర్చాడు

ఏమయింది?"

మీరిచ్చిన మందులన్నీ వాడాను నీరసం, కళ్ళు తిరగడం ఎక్కువయింది తప్ప మీరు చెప్పినట్లు జరుగలేదు' పావని నీరసంగా చెప్పింది

డాక్టరు మళ్లీ పరీక్ష చేసింది

చూడమ్మా ఈ గర్భస్రావం జరగటం చాలా కష్టం

"డాక్టర్!'

'ఇంకా మందులు వాడితే ప్రాణాపాయం కలగొచ్చు!'

ఫర్వాలేదు యివ్వండి!"

'పావనీ! ఏమిటా మాటలు? విజయ్ వారించాడు

'చూడండి అనవసరంగా ప్రాణాలమీదకు తేకండి పిల్లలు వద్దనుకుంటే ముందే జాగ్రత్తపడాలి తీరా వచ్చాక అయినా మొదటి కాన్పు అంతేగా యికపై కనకండి డాక్టరుగా నా సలహా యిది!"

"అలాగే డాక్టర్!"

'నీరసానికి, ఆరోగ్యానికి యీ మందులు వాడండి నెలకోసారి వచ్చి వెళ్ళుతూండండి ప్రిస్క్రిప్షన్ అందించింది

మీ కోర్కె తీర్చలేకపోయానండీ' ఇంటికొచ్చాక భోరున ఏడ్చింది పావని

"పావనీ! ఏమిటా పిచ్చి మాటలు?'

"మరేం ఫర్వాలేదు డాక్టరు చెప్పినట్లే ఓ బిడ్డ పుట్టనీ తరువాత మనకసలు బిడ్డలే వద్దు నేనే ఆపరేషన్ చేయించుకుంటాను చిన్నారి బోసి నవ్వులు చూద్దాం నవ్వు ప్లీజ్" నవ్వించాడు

'అబ్బా చాలు' ముంగురులు సరిచేస్తూ అన్నాడు విజయ్

*   *   *   *   *

కాలగర్భం తనలో మరో నాలుగు సంవత్సరాల కాలాన్ని దాచుకుంది కాలంతో పాటు మనుషుల్లో, పరిస్థితుల్లో, మనస్సుల్లో, వయస్సుల్లో చాలా మార్పులు తనకు తానుగా వచ్చాయి. పావని యిద్దరు కవల పిల్లలకు తల్లి అయింది బాబు పేరు వినోద్. పాప పేరు సునంద మూడవ సంవత్సరం వయసు ఇద్దరూ ముద్దులు మూటకడుతున్నారు నాలుగు సంవత్సరాల కాలంలో విజయ్ అనువయిన వుద్యోగం కోసం ఎన్నో ఇంటర్వ్యూలకెళ్లాడు, వచ్చాడు కాని ఫలితం ఏమీ కనిపించలేదు ఏ వుద్యోగమూ తనకున్న అర్హతలను వరించిరాలేదు బహుశా యిక రాదని నిర్ణయించుకున్నాడు ఆ రోజు విజయ్ చాలా ఆలస్యంగా ఇంటికి వచ్చాడు పిల్లలిద్దరూ నిద్రపోతున్నారు అతని ముఖం చీకటిలో కూడా ఎర్రగా మెరుస్తూంది.

స్నానం చేస్తారా?'






# ఒక సరికొత్త కలర్ టీవీని రూపొందించడంలో 48,500 మంది ఏం చేశారో తెలుసా?




ప్రశంసార్హులైన లక్షలకొలది సాలిడెర్ ఖాతాదార్లలో ఈ 48,500 మంది ఒక శతాంశం మాత్రమే మా కంప్యూటరైజ్డ్ ఖాతాదార్ల డిక్షనరీనుంచి వీళ్ళను మేమురమారమిగా ఎన్నుకొన్నాం వారి అభిప్రాయాన్ని గురించి అడిగాం అందరూ ఏక కంఠంతో తప్పక చెయ్యవలసిందేనన్నారు, తదుపరి మా డిసైన్ ఇంజనీర్లు అలాగే చేశారు ఫలితం తయారైన వస్తువు అన్నిటికంటే అందంగా అన్నిటికంటే బాగా పనిచేసేదిగ్గా కూడా రూపొందినది

అయితే మా సరికొత్త CTS 606ను డిసైన్ చెయ్యడంలో ఈ 48,500 మంది ఖాతాదార్లు ఏం చేశారు? చాలా సరళమైన సాయం మేం పంపిన ప్రశ్నల పత్రానికి ఎంతో శ్రద్ధగా, బాధ్యతగా జవాబులు వ్రాసి పంపారు అందులో చాలామంది కొన్ని ప్రత్యేక సలహాలతో కొంత ముందడుగు వేశారు ఆ సలహాలు ఆచరణాత్మకమైనవి, ఉపయోగకరమైనవి, కన్నుల పండువైనవి, విమర్శనాత్మకమైనవి కూడా కొందరైతే డ్రాయింగులు కూడా వేసి పంపారు వాటిని శ్రద్ధగా పరిశీలించినకొద్దీ మా R & Dకి అదొక ఆత్మపరిశోధనావకాశంగా సహకరించిందంటే అతిశయోక్తికాదు, మేం ఊహించిన దానికంటే అధికమయింది అన్నివేల మందిలో అంత శ్రద్ధతోగూడిన, మనఃపూర్వకమైన ఉత్సాహం ఆశ్చర్యకరం, వారి అమూల్య సలహాలను మేం ఏకత్ర సమ్మేళనం చేశాం యథార్థంగా అంతే సరికొత్త CTS 606 కాని మీరు దాన్ని "ఖాతాదార్లచే నిర్మితమైన కలర్ టీవీ" అని పేర్కొనవచ్చు మీ కోసం!

1. సుందరమైన, బలిష్ఠమైన ప్లాస్టిక్ మోల్డెడ్ క్యాబినెట్.
2. ఇల్యూమినేటెడ్ డిస్ప్లే.
3. సాఫ్ట్‌టచ్ చానల్/ప్రోగ్రాం సెలెక్టర్లు
4. స్మూత్ స్లైడింగ్ వాల్యూం కంట్రోల్
5. పవర్ ఆన్/ఆఫ్ స్విచ్.
6. కనిపించని ఆపరేషన్ కంట్రోలు
7. ఆడియో హార్మోనీకోసం 2-వే స్పీకర్ సిస్టమ్.
8. అన్నిటిని మించి, మీకొక్కవలసిన హామీకోసం మీరెంతోకాలంగా కోరుకున్నది. దీనికి తోడుగా పశ్చిమ జర్మనీ ఐటిటి నుండి వచ్చిన జీరో-డిఫెక్ట్ హై-టెక్ కంపోనెంట్లు
9. సజీవతుల్యమైన కలర్ రీ ప్రొడక్షన్‌కోసం బ్లాక్ స్ట్రైప్ 90° ఇన్-లైన్ పిక్చర్ ట్యూబ్.

**CTS 606**
Looks better Works even better!

**Solidaire** COLOUR
**-that seldom fails!**

## పావని

"అవసరంలా"

'భోజనం వడ్డించమంటారా?"

'నాకాకలి లేదు' మంచంపై వాలాడు

ఏమండీ!'

ఏం!" పడుకునే అడిగాడు

ఏం ఈ రోజు అదోలా వున్నారు!

"ఏంలేదు '

"నే తెలుసుకోకూడదా?"

'తెలుసుకుని చెయ్యగలిగిందేముంది?

"బహుశా లేకపోవచ్చు భార్యగా మీ కష్టసుఖాలలో భాగం పంచుకోవలసిన బాధ్యత నాకు లేదా?"

" . '

'చెప్పండి! ప్లీజ్!" అతని తల తన ఒడిలో పెట్టుకుంది

'చాలా రోజులుగా చెబుతున్నాగా సర్వీసును బట్టి చూచినా క్లాస్ చూసినా నేనే లెక్చరర్ని కావాలని"

"ఔను!"

' ఈవాళ ఏం జరిగిందో తెలుసా?"

ఏం జరిగింది?"

నాకంటే అన్నిటిలో తక్కువయిన ఆ రామారావు లెక్చరర్ అయ్యాడు"

"అదెలా సాధ్యం!"

"గొప్పవారికన్నీ సాధ్యాలే!"

అంటే?'

"ఆ రామారావు కమిటీ సెక్రటరీ చుట్టం"

అంటే ఇందులో కూడా అన్యాయమేనా?

ప్రస్తుతం అదే అందలం ఎక్కుతూంది మనం ఏం చేతగాని వద్దమ్మల్లాగా కూచోవలసిందే"

'అంతేనా"

అంతకంటే మనం చెయ్యగలిగిందింకేం వుంది? కోర్టుకెళ్ళి డబ్బు ఖర్చు చేసినా విజయం సాధించలేం మన ఖర్మింతే!' బాధగా అన్నాడు

'అందుకోసం ఇంతగా బాధపడాలా?'

మరేం చేయను? ఇది నా ప్రెస్టేజ్ క్వొచ్చిన్ అయిపోయింది వెంటనే రిజయిన్ చెయ్యాలనిపించింది" చాలాసేపు మౌనం.

'ఏమండీ!" ఆమె కన్నులలో నీరు

'పావనీ!'

"మీరిలా దిగులుపడితే నే బ్రతకలేనండీ!' భోరున ఏడ్చింది

ఛా! నేనేం దిగులుపడలేదు అలా అయితే వెంటనే రిజైన్‌చేసే వాడినే కదా? ఏదో కాస్త బాధ అంతే!'

'ఈ ప్రపంచంలో మీరు తప్ప ఎవరూ లేని అనాథను మీ సంతోషం చూచుకుంటూ కాలం గడపాలని కోరుకుంటున్న దానిని

"పావనీ నువ్వేనా? నేనూ అనాథనే నాకు నువ్వు, నీకు నేను పదభోంచేద్దాం" వడ్డించింది

"పిల్లలకు పెట్టావా?"

'ఆఁ, పడుకొనేవరకూ సునంద నాన్నా అంటూ మిమ్మల్ని కలవరించింది'

ఛా! కనీసం ఒకనాడయినా వాళ్ళతో సరదాగా గడపలేక పోతున్నా' విజయ్ బాధగా అన్నాడు

'భలేవారే! కానివ్వండి'

'సహించడంలేదు'

"అలాగా" అంటూ అన్నం కలిపి వూ . నోరు తెరవాలి" లాలనగా తినిపించింది అలాగే ఆమెకూ తినిపించాడు ఈ సంతోషం చాలదా! మనసులో తృప్తిపడ్డారిద్దరూ భోజనం ముగించి వచ్చి నిద్రపోతున్న యిద్దరి బిడ్డల్నీ తనివితీరా ముద్దు పెట్టుకున్నారు. ఒకరి మీద ఒకరు చేతులు వేసి నిద్రపోతున్నారు ఇద్దరికీ ఒకరంటే ఒకరికెంత ప్రేమ!

'ఏం! అలాగే చూస్తున్నారు?'

"పావనీ! నిన్నెలాగూ సుఖపెట్టలేకపోయాను కనీసం వీళ్ళనయినా

'అవేం మాటలండీ! ఎందుకలా అనుకుంటారు?'

"మరేం అనుకోను?"

"సుఖం అంటే నిర్వచనం ఏమిటి?"

సుఖానికి హద్దేలేదు ఇంతకంటే సుఖం నాకక్కరలేదు' తృప్తిగా అంది పావనీ!

'ఊ "

నీలా నేను తృప్తిపడలేక పోతున్నాను'

మీరు తృప్తిపడే రోజు త్వరలో తప్పక వస్తుంది

వస్తుందా?

'తప్పక'

'ఎప్పుడో?'

'కాలం కోసం ఎదురు చూద్దాం అనవసరమయిన ఆలోచనలు మాని నిద్రపోండి ప్లీజ్?'

నిద్ర రానిదే!

కళ్ళు మూసుకోండి"

'పావనీ"

ఏమిటండీ?

మన పిల్లలిద్దర్నీ బాగా చదివించాలి సునంద డాక్టరు కావాలి వినోద్ ఇంజనీరు కావాలి!'

"తప్పక అవుతారు, వాళ్ళు మీ పిల్లలు"

అదే నా బాధ'

అంటే!'

నా అదృష్టం వాళ్ళకు రాకూడదు

"అవేం మాటలండీ?

"వాళ్ళ గొప్పతనం చూసి నేను మురిసిపోవాలి!'

'పడుకోండి

చాలాసేపటికి పడుకున్నాడు నిద్ర పట్టని పావని మనసులోనే కుళ్ళి కుళ్ళి ఏడ్చింది 'భగవాన్ మమ్మల్ని ఆదుకో ఆయన ఆవేదన అర్థం చేసుకో బిడ్డల భవిష్యత్తులో మా కోరికలు తీరేలా చేయి" మూగగా రోదించింది ఒకప్పటి కాలేజీ బ్యూటీ పావని

(ఇంకా ఉంది)

## శివోక్తం

(ప్రఖ్యాత కన్నడకవి సర్వజ్ఞ వచనాలు ఆధారంగా)

అళుల గానమ్ము వినకడు నందమయ్య
సుందరమ్ము వస్తుతతిగాంచ నందమయ్య
అనుపమాభంగభాషణ మందమయ్య
అతుల సజ్జన సాంగత్య మందమయ్య

నీచులౌ మానవుల తోడి స్నేహితమ్ము
కన్న, ఈత క్రింద ఉనికి మిన్నగాదె
ఇంతయో అంతయో ఫలమ్మిత యొసఁగు
ఈత కంటెను నీచుడు కీతగాదె

అర్థికిచ్చుట గాని మర్యాద లేదు
చిత్తశుద్ధికి మలినము చింతలేదు
విత్తలైపోవు వానికి భీతి లేదు
పరమ యోగికి చీకటి ఎరుక లేదు

—కనమలూరు వెంకట శివయ్య

# సాత్త్వికసిద్ధి

విశ్వనాథ పావనిశాస్త్రి

మనోహరి మహాజ్వాల ప్రపంచ ప్రసిద్ధి చెందిన గొప్ప నర్తకి. అన్ని రకాలైన భారతీయ, ప్రాచ్య, పాశ్చాత్య నృత్యాలను అభ్యాసం చేసింది. ప్రపంచంలో ఏ దేశంలో నైనా సరే, ఆమె నృత్యం చేస్తున్నంత సేపూ ప్రజలు గ్రుడ్లప్పగించి



నిశ్చేష్టులై చూస్తూ ఉండవలసిందే!

అధునాతన మైన "బ్రేక్‌డాన్స్", "ఫ్లాష్‌డాన్స్" వంటి వాటిల్లో కళ్లు మిరుమిట్లు గొలిపే, అత్యద్భుత మైన శరీర విన్యాసాలుంటాయి. అయితే "తెరెకిట తకతెరె, కిటతక తెరెకిట, తళాంగు తదిగిణ తకతోం, తెరెకిటతోం" వంటి అమిత వేగవంతమైన గతులకి అనుగుణంగా – పాదాలు నేలనే అంటి పెట్టుకుని ఉంటూ, ప్రతి అక్షరంతో వేగంగా కదులుతూ గంటల కొలదీ నృత్యం చేయగల భారతీయ నృత్య కళాకారులకి అదేమంత పెద్ద కష్టం కాదని రుజువు చేస్తూ, భారతీయ నృత్యానికి పాశ్చాత్య దేశాలలో గొప్ప ప్రచారం తెచ్చిన వనితా మణులలో కిరీట మణి ఆమె!

అటువంటి ఆమె చిరకాలానికి తన స్వస్థలంలో దేవీ నవరాత్రాలకి నృత్యం చేయడానికి వచ్చింది. ఆ రోజున ప్రపంచం నలుమూలల నుండి, ఆమెకు ఎన్నో ఆహ్వానాలున్నాయి కొన్ని లక్షల కనక వర్షం కురుస్తుంది. అయినా ఆమె వాటి నన్నిటినీ తిరస్కరించింది. తన ఆరాధ్య దైవం దుర్గాదేవి. ఆ దేవికి తన నాట్య విద్య నర్పణం చేయాలి. అదే ఆమె ధ్యేయం.

ఆ రోజు విజయ దశమి. ఉదయం ఆరు గంటలకి నృత్యం ప్రారంభించింది ఆమె. మధ్యాహ్నం పన్నెండు గంటలు దాటుతోంది. జనం ఒడ్లు విరిగి పోతున్నారు. మృదంగ విద్వాంసుడు నురుగులు కక్కుతున్నాడు. నట్టువ పట్టిన గురువు గొంతెండి పోతోంది. ఇతర వాయిద్యాల వారి సంగతి చెప్పనక్కర లేదు. ఆమె కాలి గజ్జెల ఘలంఘలారావాలు వర్షాకాల మహాప్రవాహ మల్లే సాగిపోసాగాయి మహిషాసుర మర్దనిని చూసికాబోలు, శరత్కాల సూర్యుడు కూడా ఆ రోజు నిప్పులు కక్కుతున్నాడు కన్నులు ఎన్ని భావాలు మారుతున్నా, విన్యాసాలు ఎన్ని దిక్కులకు పరిగెడుతున్నా మనోహరి మహాజ్వాల చూపులు మాత్రం కరాళ జిహ్వా అయిన అమ్మవారి మీదనే ఉన్నాయి అమ్మవారు మాత్రం గ్రుడ్లప్పగించి చూస్తోంది.

అంతలో దూరాన్నించి బ్రహ్మాండ మైన మేళతాళాలతో సూర్య కోటి ప్రభ రాసాగింది. అందరూ తలలు అటు తిప్పారు అమ్మవారి దగ్గరికి ఊరేగింపుగా వచ్చే ప్రభలలో, ఆ చుట్టు పట్ల సూర్యకోటి ప్రభ చాలా ప్రసిద్ధమైంది. కోటి అనే ఒక కూరగాయల వ్యాపారస్తుడు, సూర్య అనే అతని అక్కగారు ప్రతి యేటా నిర్వహిస్తారు ఆ ప్రభని. మేళతాళాలతో, భక్త బృందంతో, అనుచరులతో కోటి క్రింద నడుస్తున్నాడు. ప్రభ మీద సర్వాలంకార భూషితయై, దుర్గ వేషంలో సూర్య నిలబడి ఉంది.

సూర్య అవివాహిత. ఆజాను బాహువు. కిరీట ధారిణి అయిన ఆమె, సామాన్యమైన ఎత్తున్న యిద్దరు మగవాళ్లు ఒకడి భుజాల మీద యింకొకడు నిలబడితే ఎంత ఎత్తుంటారో అంత ఎత్తుంది. నిగనిగలాడే రంగు రంగుల పుష్పాదులతో ఆమె శరీరకాంతి బంగార మల్లే ధగా ధగలాడి పోతోంది. మృగరాజ మధ్యము, నగరాజ వక్షము, ఖగరాజ నాసము, అగరాజ కేశము, ఝషరాజ నేత్రము! ఓహ్! అనేక సంవత్సరాలు తదేక దీక్షగా అభ్యాసం చేసినా అలవడని ఒక మహా ప్రసన్నతా భావం, ఆమె కళ్లలో బంగారు గూడు కట్టుకుని నివాస ముండి పోయింది. ఆమెను చూస్తున్న ప్రజలకు అమ్మవారు ఆమెను ఆవహించిందా అనిపించింది.

సూర్యకోటి ప్రభ దగ్గిరగా వచ్చింది. మనోహరి మహాజ్వాల అప్రయత్నంగా అటు చూసింది. ఉత్తర క్షణంలో వేదిక మీద విరుచుకు పడి పోయింది

అందరూ కంగారు పడసాగారు సూర్య వేదిక మీదకి వచ్చింది ,గండ భేరుండ పక్షి పాల పిట్టని లేవదీసి నట్లుగా మనోహరిని లేపి నిలబెట్టింది. వందమంది అప్సరసలు పైట చెరగులు విసిరినట్టుగా అడుగులు వేయసాగింది సూర్య. మృదంగం, నట్టువ, ప్రక్క వాయిద్యాలు స్తంభించి పోయాయి. సూర్య ముఖంలోని ప్రసన్నతా భావం చెక్కు చెదరలేదు.

మనోహరి మహాజ్వాల తిరిగి నృత్యం ప్రారంభించింది. ఇప్పుడామె నృత్యం తీరే మారి పోయింది. మృదంగ విద్వాంసుడు గుండెనిండా గాలి పీల్చుకున్నాడు. నట్టువ గురువు మంచినీళ్లు తాగి పునఃప్రారంభించాడు. ఇతర వాయిద్యాలు కిలకిలారావాలు చేయసాగాయి ఒడ్లు విరిగిపోయి తొక్కు కుంటున్న జనం ప్రశాంతంగా చూడ సాగారు. గ్రుడ్లప్ప గించి చూస్తున్న అమ్మవారు, అర్ధ నిమీలిత నేత్ర యైంది.

సూర్య తన ఆభరణాలన్నీ అమ్మవారి పాదాల ముందు అర్పించి, వట్టి చీర రవిక గాజులతో నిలబడి ఉంది. అప్పటి దాకా ఆమె ముఖంలో రాజ్యమేలిన ఒక దివ్యభావం అదృశ్యమై, సామాన్య మానవ స్త్రీ లాగానే ఉంది ఆమె! కాని ఆమె విగ్రహం! అతి పౌరుషం!!

మనోహరి మహాజ్వాల తన విద్య అమ్మవారికి అర్పించడం మరిచిపోయి, అమ్మవారి దగ్గర నుండి మరికొంత తీసుకుంది □

# అఖిలభారత స్థాయిలో అన్నామలై విశ్వవిద్యాలయము

ఆయన ఒకవ్యక్తి మాత్రమేకాదు, ఒక మహావ్యవస్థ. దాత, దానకర్ణుడు దక్షిణ భారత దేశములో ప్రఖ్యాతిగాంచిన "చెట్టినాడు"కు చెందిన డా. రాజాసర్ అన్నామలై చెట్టియార్. ఎంతో ముందు చూపుతో వ్యవహరించి "అన్నామలై"ని అధునిక దేవాలయంగా మార్చడానికి నిరంతరము కృషి చేసి సఫలీకృతులైనారు డా. అన్నామలై చెట్టియార్.



మహాదాత, అన్నామలై విశ్వవిద్యాలయము సంస్థాపకులు డా. రాజాసర్ అన్నామలై చెట్టియార్ కాంశ్య విగ్రహము



అన్నామలై విశ్వవిద్యాలయములోని బ్రహ్మాండమైన గ్రంథాలయం

తమిళనాడులో పురాణ ప్రసిద్ధి గాంచిన శ్రీ నటరాజస్వామివారి నిలయమైన "చిదంబరం" పట్టణానికి వెలుపల, అరువందల ఎకరాల సువిశాల మైదానములో 1929లో ఒక రెసిడెన్సియల్ విశ్వవిద్యాలయాన్ని స్థాపించారు. అదే ఆ మహా పురుషుని పేరు మీద "అన్నామలై విశ్వవిద్యాలయం"గా ప్రసిద్ధినందింది. డా. రాజాసర్ అన్నామలై చెట్టియార్, దానికి ప్రో ఛాన్సలర్‌గా వుంటూ, అహర్నిశలు కృషి చేసి, పెంచి, పోషించి, పెద్ద చేసి, అఖిల భారతస్థాయిలో నొక ముఖ్య విశ్వవిద్యాలయంగా రూపొందించారు. అందుకవసరమైన కాలాన్ని, ధనాన్ని ధారాళంగా ఖర్చు చేశారు.

ఆయన అసాధారణ ప్రజ్ఞా పాతవాలున్న వ్యక్తి, మహాదాత, మహామనిషి, విద్యావేత్త. ఒక వ్యక్తి ఒక విశ్వవిద్యాలయాన్ని స్థాపించి, పెంచి పోషించడము అపురూపము, అసాధ్యము. అట్టి అసాధ్యాన్ని సుసాధ్యం చేసి, లక్షల మందికి విద్యాగానం చేసిన చెట్టినాడు చెట్టియార్ చిరస్మరనీయుడు.

ఆయన అనంతరము ఆయన పుత్రుడు డా. రాజాసర్ ముత్తయ్య చెట్టియార్ ప్రో ఛాన్సలర్‌గా వ్యవహరిస్తూ, తండ్రికి తగ్గ తనయుడిగా 1948 నుండి 1984 వరకు ఈ విశ్వవిద్యాలయాన్ని బ్రహ్మాండంగా వృద్ధి చేశాడు.

ఆయన తదనంతరము, భారత దేశములో క్రీడాభిమానిగా, దాతగా, తత్వవేత్తగా, పరిపాలనాదక్షుడుగా పేరెన్నికగన్న డా. యం. ఎ. యం. రామస్వామిగారు ప్రో ఛాన్సలర్ పదవిని చేపట్టారు. ప్రస్తుతము వీరి నేతృత్వ ములో ఈ విశ్వవిద్యాలయము విశ్వ ఖ్యాతినందబోతూంది.

ఈ విశ్వవిద్యాలయములో మొదటి నుండి ప్రజ్ఞావంతులైన వైస్ ఛాన్సలర్లు పని చేస్తూ వస్తున్నారు. విశ్వ విఖ్యాతిగాంచిన "సిల్వర్ టంగ్‌డ్ ఆరేటర్"గా పేరుగాంచిన "రైట్ ఆనరబుల్" శ్రీనివాసశాస్త్రి వంటి మహా మేధావులు, వైస్

నీటిలో ప్రతిబింబిస్తున్న అన్నామలై విశ్వవిద్యాలయం పరిపాలనా భవన సముదాయం యొక్క ముఖ్య కట్టడము



ఛాన్సలర్స్‌గా పని చేస్తూ, విశ్వ విద్యాలయం ఖ్యాతిని పెంచారు. ప్రస్తుతము ప్రొఫెసర్ యస్. వి. చిట్టిబాబు వైస్-ఛాన్సలర్‌గా పని చేస్తున్నారు. వీరు అన్ని విధాల గతంలో పని చేసిన వైస్ ఛాన్సలర్స్‌కు దీటైన మహా పండితుడే కాక, పరిపాలనాదక్షుడు.

గత 50 సంవత్సరాలుగా మహా వ్యక్తుల ప్రాపకములో, నేతృత్వములో, పరిపాలనలో స్థిరంగా పెరుగు తూ వచ్చిన ఈ విశ్వవిద్యాలయములో 40 విభిన్న శాఖలున్నాయి. వేల మంది విద్యార్థులున్నారు. ఇక్కడ విశాలమైన 'క్యాంపస్'లో చక్కని తరగతి గదులు, హాస్టళ్ళు, ఆటస్థలాలు, ఉద్యానవనాలు, ఉన్నత పరిశోధనాలయాలు, గ్రంధాలయాలు, అందమైన రోడ్లు, ఆకర్షనీయమైన కంచెలు, చూపరులనిట్టే ఆకర్షించి ఆకట్టుకుంటాయి.



శ్రీ రాజా ముత్తయ్య చెట్టియార్ పాలిటెక్నిక్ కాలేజీ భవన సముదాయం



చిదంబరంలోని అతి పురాతనమైన నటరాజస్వామివారి "ఆలయ గోపురం"

1979లో ఈ విశ్వవిద్యాలయములో కరస్పాండెన్స్ కోర్సులు ప్రారంభించారు. ప్రతి సంవత్సరము వేల మంది విద్యార్థినీ, విద్యార్థులకు, ప్రాంతీయ భేధ భావాలకతీతంగా, విద్యా సౌకర్యాలనందిస్తుంది విశ్వవిద్యాలయము. ప్రస్తుతము ఆధునిక ఆలయములో 27 రకాలైన కోర్సులలో విద్యా బోధన జరుగుతూంది.

ఇక్కడ, భారత దేశములో ప్రధమ పర్యాయము పోస్ట్ గ్రాడ్యుయేట్ తరగతులలో ప్రయివేటు విద్యార్థులకు, అవకాశమిస్తూ, సైకాలజీ, ఫిజిక్స్, కెమిస్ట్రీ, జువాలజీ సబ్జక్టులలో కోచింగ్ యిస్తున్నారు.

ఈ కరస్పాండెన్స్ కోర్సులలో ప్రతి సంవత్సరము కొన్ని వేలమంది వివిధ శాఖల్లో శిక్షణ పొంది ఉన్నత విద్యావంతులవుతున్నారు. 1985-86 విద్యా సంవత్సరములో కేవలం కరస్పాండెన్స్ కోర్సులద్వారా యావత్ భారత దేశములో ని 39,221 మందికి విద్యా సౌకర్యాన్ని అందించింది డా. యం. రాధాకృష్ణన్ కరస్పాండెన్స్ డైరెక్టరేటులో డైరక్టరుగా వుంటున్నారు

విశ్వవిద్యాలయం ప్రాంగణములో బ్రహ్మాండమైన ఇంజనీరింగ్ కాలేజీ భవనాలు, పాలిటెక్నిక్ కాలేజీ భవనాలు చూపరులనాకర్షించడమేకాక, ఉన్నత శిక్షణ నందిస్తున్నాయి

గ్రంథాలయమునకెదురుగానున్న విశాలమైన ఉద్యానవనములో సంస్థాపకులైన డా రాజాసర్ అన్నామలై చెట్టియార్ నిలువెత్తు కాంశ్య విగ్రహము చూపరుల నాకర్షిస్తూ, విద్యార్థుల నాహ్వానిస్తూ వుంటుంది

అఖిల భారత స్థాయిలో అభివృద్ధి సాధిస్తున్న ఆధునిక దేవాలయమీ అన్నామలై విశ్వవిద్యాలయము.

-వ్యాసము, ఫోటోలు : వి. వీరారెడ్డి.

శ్రీ రాజా ముత్తయ్య చెట్టివారి ఇంజనీరింగ్ కళాశాల భవనం.






## ఆడదానికి ఆస్తి హక్కులు ఇస్తాం.... –అంటున్నారు పెద్దలు!
## ఆడదానికి స్వేచ్ఛ కావాలి..... –అంటున్నారు చదువుకున్న స్త్రీలు!!
## ఆడది పుట్టడానికే వీల్లేదు.... –అంటున్నారు మూర్ఖులు!!

### అటువంటి......
# వాళ్ల మీద దండయాత్రే ఇది!!

ఆడది ఒంటరిగా అర్ధరాత్రి వేళ బయటకు వెళ్ళి తిరిగి ఇంటికి వచ్చిననాడే స్త్రీకి స్వతంత్రం వచ్చినట్టు, అన్నాడు గాంధీగారు!

ఆ రోజు రాలేదు రాదు సరికదా ఆడవారి పరిస్థితి అంతకంటే అధ్వాన్నంగా మారింది!

స్త్రీకి స్వేచ్ఛ కావాలి అంటూ ఉపన్యాసాలు ఇస్తున్నారు! ఉద్యమాలు లేవదీస్తున్నారు! నవలలు రాస్తున్నారు!సినిమాలు తీస్తున్నారు!

అందువల్ల ఫలితం లేక పోగా స్త్రీ జాతి పరిస్థితి రోజు రోజుకి దిగజారి పోతోంది

ఇప్పుడు అది కాకుండా మరో ఉపద్రవం వచ్చి పడింది!

అదే . ఆడశిశు జనన నిరోధం!

గర్భంలో వున్న పిండం ఆడా మగా అనే విషయం తెలుసుకొనే స్థాయికి మన సైన్స్ పెరిగింది.

అదే సెక్స్ డిటర్మినేషన్ టెస్టు

ఈ విధానం వల్ల గర్భంలో వున్న 'పిండం' స్థితి గతులు తెలుసుకోవచ్చు విటమిన్ లోపాలు, అంగ వైకల్యం వచ్చే అవకాశాలు తెలుసుకొని తగిన జాగ్రత్తలు తీసుకోవాలనే సదుద్దేశంతో మన సైంటిస్టులు ఈ విధానాన్ని కనిపెట్టారు!

కానీ, అది కూడా 'అణుశక్తి' లాగానే వినాశనానికి వాడుతున్నారు కొందరు మూర్ఖులు! పండు కోసుకోమని కత్తి ఇస్తే పీక కోస్తున్నారు కొందరు!

గర్భంలో వున్న పిండం ఆడా . మగా అని తెలుసుకొని ఆడపిల్లయితే వెంటనే 'ఎబార్షన్' చేయించుకుంటున్నారు చాలా మంది మహిళలు!

ఆరోగ్య రీత్యా – గర్భస్రావమే . ఆడదానికి శాపం!

ఇప్పుడు ఈ 'ఆడ సంతాన హత్య' అత్యంత ఘోరం! అనాగరికం!!

పేద గొప్ప తేడాలతో మత కల్లోలాలతో ప్రాంతీయ బేదాలతో నిత్యం చస్తున్న ఈ దేశంలో ఆడా మగా తేడాలు మరింత ప్రమాదకరం!

'ఆడ సంతాన నిరోదం' మరి ప్రమాదకరం!

ఇదే విషయాన్ని చర్చించినప్పుడు – దుర్గా శ్రీనివాస్ తను టి వి సినిమా కోసం తాము రాసిన కథని వినిపించారు!

టి వి సినిమా మెల్లిగా తీసుకోవచ్చు! ఆ కథని నాకు ఇవ్వమని అడిగి తీసుకొని కట్టి కొట్టి తెచ్చె . అన్నట్టుగా సంక్షిప్తం చేసి దానిని మీకు అందిస్తున్నాను – అదే తల్లీ! నీకు శతకోటి దండాలు!'.

ఈ కథ చదవండి! మీలో ఏమాత్రం స్పందన కలిగినా మీరు కూడా మరో కధ రాయండి! లేదా మరో వ్యాసం రాయండి!మీరు ఏది రాసినా స్త్రీలలో చైతన్యం రావాలి! ఈ అనాగరికాన్ని ఆపాలనే బావం కలగాలి!

–గీతా సుబ్బారావ్

"మరొక్కసారి ఆలోచించండి. ఇది... ఇది పాపం కాదా...?"

"పాపమో, పుణ్యమో, ఇంతకంటే మార్గం లేదు. బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను".

"ఆ డాక్టర్ చెప్పింది కరక్టేనంటారా?"

"తప్పయే అవకాశం లేదు. అన్ని పరీక్షలూ చేశాకనే కదా చెప్పారు".

"కానీ.... "

"ఇక తర్జన భర్జన అనవసరం. ఆడదానివి కనుక నీకు అలా అనిపించవచ్చు అయినా తప్పదు నేను ఈ రోజే మన డాక్టరు సత్యవతి గారితో మాట్లాడతాను. ఎంత త్వరగా అయితే అంత మంచిది'

తన నిర్ణయం మారదని భార్యకి నిర్ధారణగా చెప్పేసి, మళ్ళీ మాట్లాడే అవకాశం ఇవ్వకుండా ఆఫీసుకు వెళ్ళిపోయాడు రమణమూర్తి.

అరుంధతి అలాగే నిలబడి ఉంది.

"అమ్మా నాకు తమ్ముడు ఎప్పుడమ్మా వస్తాడు? తల్లిని కుదిపింది, నాలుగేళ్ల విజయ

'వస్తాడులే నువ్వెళ్ళి ఆడుకో '

లోపల ఏం చేస్తున్నాడమ్మా? ఆడుకుంటున్నాడా? ఏడుస్తున్నాడా?" తల్లి పొట్ట మీద చెయ్యి వేసి అడిగింది విజయ

'ఏదో చేస్తున్నాడు గానీ, నువ్వెళ్ళి ఆడుకో

తల్లి గొంతులో విసుగు అర్థం చేసుకున్న విజయ ఆడుకోడానికి పక్కింటికి వెళ్ళిపోయింది

ఈసారి తప్పకుండా మగపిల్లవాడే అనుకుంది అరుంధతి అయిదారుగురు దేవుళ్ళకి మొక్కుకుంది ఒకరికి పుట్టు వెంట్రుకలు ఇస్తాననీ, మరొకరికి పేరు పెట్టుకుంటాననీ, ఇంకొకరికి అభిషేకం చేయిస్తాననీ–

ఆయన స్నేహితుడు ఎవరో తన భార్యకి చేయించాడట ఎస్ డి టి (సెక్స్ డిటర్మినేషన్ టెస్ట్) పుట్టడానికి ముందే ఆడపిల్లో, మగపిల్లవాడో తెలిసి పోయే పరీక్ష తనకి చేయిస్తానన్నారు తన కెందుకో మగపిల్లవాడేనని అంత నమ్మకం సరేనంది పరీక్షలన్నీ అయ్యాకా తేలింది ఆడపిల్లేనని

విజయ పుట్టినప్పుడే అన్నారాయన అబ్బాయి అయితే బాగుణ్ను అని ఈ సారి కూడా ఆడపిల్లేనని తెలిశాకా వెంటనే తన నిర్ణయం చెప్పేశారు ఎబార్షన్. తను సరేనన లేక పోతోంది. అయినా

* * * * *

"అమ్మా.. అమ్మా.. "

ఉలిక్కి పడింది అరుంధతి

'అమ్మా '

విజయకాదు పిల్చింది విజయ నిద్రపోతోంది మరెవరు?

ఎవరు?'

ఎవరంటే ఏం చెప్పనమ్మా? ఇంకా పూర్తిగా రూపమే రాని నాకు పేరు మాత్రం ఎలా ఉంటుంది? నే నమ్మా నీకు పుట్టబోయే కాదు కాదు నీకు పుట్టకుండా పోయే నీ కూతుర్ని

తల్లీ ' అరుంధతి చెయ్యి తన పొట్ట మీదకి వెళ్ళింది

నేను నిస్సహాయురాల్ని తల్లీ నన్ను క్షమిస్తావా అరుంధతికి ఏడుపు వచ్చేస్తోంది

'బాధ పడకమ్మా నాకు నీ మీద కోపం లేదు! నువ్వూ, నాన్నగారూ పుట్టడానికి ముందే నన్నెందుకు వదిలించుకోవాలను కుంటున్నారో ముందు నాకూ అర్థం కాలేదు! ఆడపిల్ల అంటే అంత కంగారు, చిన్నచూపు ఎందుకో అనుకున్నాను అందుకని ఒకసారి మన పవిత్ర భారత దేశంలో పర్యటించి ఇప్పుడే వచ్చానమ్మా, నేను విన్నవీ, కన్నవీ, తెలుసుకున్నవీ నీకు చెప్తాను వింటావా అమ్మా ?

## 1.

"నిలువవే వాలు కన్నులదానా వయారి హంస నడకదానా. '

వసంత వెనకాలే సైకిల్ మీద వస్తూ ఇద్దరు మగధీరులు డ్యూయెట్లా అదే పాట పాడుతున్నారు

హంస నడక ఆగిపోయింది వాలుకన్నులు తీక్షణంగా చూశాయి కోపంతో ఎర్ర బడ్డాయి ఇద్దరు మగధీరుల్లో ఒకడి చెంప ఛెళ్ళుమంది

ఆఫ్టరాల్ . ఆడపిల్లవి! , ఎంత ధైర్యమే నీకు గర్జించాననుకుంటూ మొరిగాడు చెంప పగిలిన మగధీరుడు

నీకంత పొగరున్నప్పుడు నాకా మాత్రం ధైర్యం వుండొద్దురా డర్టీ రాస్కెల్ '

ఏం కూశావ్

గురూ జనం వస్తున్నారు గురూ

హెచ్చరించాడు రెండో మగధీరుడు

'ఇప్పుడు కాదు చూస్తా నీ సంగతి చూస్తా'

జనం వచ్చేలోగా సంధు మలుపు తిరిగి పోయింది సైకిల్

జరిగింది ఇంట్లో చెప్పాలా వద్దా అని తనలో తానే తర్కించుకుని చెప్పక పోవడమే మంచిదని నిర్ణయించు కుంది వసంత

–మర్నాడు సాయంత్రం మామూలు వేళకి కాలేజీ నుంచి ఇల్లు చేరలేదు వసంత రాత్రయినా అమ్మాయి జాడ లేదు తల్లి, తండ్రి కంగారు పడ్డారు వాకబు చేశారు వెతికారు చివరికి పోలీసు రిపోర్టు ఇచ్చారు

ఆ మర్నాడు ఉదయం ఇల్లు చేరింది వసంత వాడి పోయిన వసంత

జరిగిందంతా చెప్పింది ఆ నరరూప రాక్షసు లెవరో తనకి తెలుసు! వాళ్ళని పోలీసులకి పట్టించాలి! వాళ్ళ అంతు చూడాలి!!

అమ్మో ఎంత అప్రదిష్ఠ! పేరు పేపర్లో ఎక్కుతుంది పరువు బజారున పడుతుంది తర్వాత నీ పెళ్ళెలా అవుతుంది? ఆడపిల్లవి బ్రతుకు నాశనం అయిపోతుంది

అమ్మాయి క్షేమంగా తిరిగి వచ్చిందని తెలియ జెయ్యడంతో పోలీసులకీ, ఆ సంఘటనకి సంబంధం ముగిసి పోయింది!

వసంతని కాలేజీ మానిపించారు వాడి పోయిన వసంత– ఓడి పోయింది!

## 2.

అనసూయ గుండె దడదడా కొట్టుకుంటోంది

ఇది యాభయ్యోనిమిదో ఇంటర్వ్యూ తనకి ఏమవుతుందో? తనకి ముందున్న యువకుడు లోపలికెళ్ళాడు తర్వాత తనే! ఈ ఉద్యోగం కూడా రాకపోతే ? గుండె వేగం హెచ్చింది –

అతను బయటికి వచ్చాడు అనసూయ లోపలికెళ్ళింది ఆఫీసర్ గారికి నలభై ఏళ్ళుంటాయి కొంచెం బట్టతల నుదుటి మీద పెద్ద కుంకం బొట్టు చూస్తే మంచి వాడిలాగే ఉన్నాడు

అన్ని ప్రశ్నలకీ సరిగ్గానే సమాధానాలు చెప్పింది

యూకెన్ గో అన్నారాయన

లేచి నించుంది అనసూయ ధైర్యం కూడ గట్టుకుంది

సార్ నా క్వాలిఫికేషన్స్ మరీ అంత పెద్దవేం కావు అనుభవం అసలే లేదు కానీ, మాది పేద కుటుంబం! చాలా పెద్ద కుటుంబం అన్నయ్యకి పెళ్ళయాకా, అమ్మకీ, వదినకీ గొడవలొచ్చి అన్నయ్య వేరే వెళ్ళిపోయాడు! ఇంకా ఇద్దరు తమ్ముళ్ళు , ఇద్దరు చెల్లెళ్ళు ఉన్నారు నాన్న గారికి ఏక్సిడెంట్లో చెయ్యి పోయింది నేను ఉద్యోగం చేసి

సంపాదించకపోతే ఇల్లు గడవదు. దయచేసి ఎలాగైనా మీరు నాకీ ఉద్యోగం ఇప్పించాలి గుక్క తిప్పుకోకుండా చెప్పింది

ఆఫీసర్‌గారు ఒక నిమిషం ఏమీ మాట్లాడలేదు ఆ ఏ సీ గదిలో అనసూయకి ముచ్చెమటలు

'చూడమ్మా ఈ ఉద్యోగం కోసం వచ్చిన వాళ్ళందరూ ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నవాళ్ళే 'ఉద్యోగం వస్తుందని కొండంత ఆశతో ఎదురు చూస్తున్నవాళ్ళే'

అనసూయ కళ్ళలో నీళ్ళు

బట్, నువ్వు చెప్పిందంతా విన్నాక, నీకు సహాయం చేయడం న్యాయమనిపిస్తోంది యు ఆర్ ఎప్పాయింటెడ్

'సార్ మీరు థాంక్స్ నేను

'దట్సాల్ రైట్ రేపే వచ్చి జాయిన్ అవొచ్చు యూకెన్ గో

- ఉద్యోగంలో చేరిన రెండో రోజు సాయంత్రం టేబిల్ మీద పేపర్లన్నీ సర్దేసి బయలుదేరడానికి సిద్ధమవుతోంది అనసూయ

"అయ్యగారు రమ్మన్నారు చెప్పాడు ఆఫీసు బాయ్

'గుడ్ ఈవెనింగ్ సార్

"కూచో అమ్మా

ఫర్వాలేదు సార్

'చూడమ్మా ఇది నా పర్సనల్ మేటర్ నువ్వు కాదన్నా నేనేమీ అనుకోను

చెప్పండి సార్

'నాలుగు సంవత్సరాల కిందట సరిగ్గా ఇదే రోజున నా చెల్లెలు సుగుణ ఈ లోకం వదలి వెళ్ళిపోయింది ప్రతి సంవత్సరం ఇదే రోజున ఎవరో ఒక కన్నెపిల్లకి మా ఇంట్లో భోజనం పెట్టి, కొత్త చీరా, జాకెట్టూ ఇచ్చి, ఆ కాసేపూ మా చెల్లెలున్నట్టే అనుకొని తృప్తిపడుతుంటాను లాస్ట్ ఇయర్ మన టైపిస్టు రమ మా ఇంటికొచ్చింది ప్రస్తుతం లీవ్‌లో ఉంది ఇఫ్ యూ డోంట్ మైండ్ నువ్వు మా ఇంటికొస్తావా ?'

కాదనలేకపోయింది అనసూయ

చాలా పెద్ద యిల్లు ఆయనది ఖరీదైన ఫర్నిచర్‌తో, ఖరీదైన ఇల్లు

'కూచో అమ్మా ఇప్పుడే వస్తాను ఆయన లోపలికెళ్ళారు కూచొని ఏదో మేగజైన్ తిరగేస్తోంది చెల్లెలంటే ఆయనకెంత ప్రేమ హుఁ నాకూ అన్నయ్య ఉన్నాడు

ఆఫీసర్‌గారొచ్చారు చైనా సిల్కు జుబ్బా, చైనా సిల్కు లుంగీ మొహాన బొట్టు లేకుండా ఏదో కొత్తగా ఉంది ఆయన మొహం వచ్చి ఎదురుగా కూచున్నారు సెంటు వాసన మరేదో వాసన గుప్పుమన్నాయి

"చూడు మిస్ అనసూయా నీకు చెప్పినట్టుగా నాకు చెల్లెలూ లేదు అది చచ్చిపోడమూ లేదు అదంతా అబద్ధం"

షాక్ తిన్నట్టు లేచి నిల్చుంది

హలో! — గీత

హలో హలో... లో లోలో!

లోలో అని మీరెంత గుంజుకున్నా .. పేకాటకి పైసా ఇచ్చేది లేదు..... అంతే!

## తల్లీ ... నీకు శతకోటి దండాలు!

'కూచో - నేను చెప్పేది పూర్తిగా విను రెండేళ్ళ క్రిందట మా ఆవిడకి నాలుగోసారి ఎబార్షన్ అయి ఫిట్స్ రావడం ప్రారంభమయింది అప్పటినుంచీ నాకు దాంపత్య సుఖం లేకుండా పోయింది నేను దాన్నికాదని వేరే పెళ్ళిచేసుకోలేను ఎందుకంటే మన కంపెనీకి అసలు ప్రొప్రయిటర్ మా ఆవిడే ఈ ఆస్థంతా దానిదే దాన్ని వదులుకుంటే ఉద్యోగం కోసం నేను కూడా నీలాగే వీధినపడాలి' కానీ, ఉప్పు, కారం తింటున్న మగవాడ్ని నాకూ కోరికలుంటాయి! ప్రతివాడికీ ఒళ్ళు అమ్ముకొనే ప్రాస్టిట్యూట్స్ అంటే నాకు వెగటు! నీలాంటి సంసార పక్షంగా ఉండే అమ్మాయిలని చూస్తే నా కోరిక విజృంభిస్తుంది నేను నీకు సహాయం చేశాను అలాగే నువ్వూ నాకు సహాయం చెయ్యాలి ప్రస్తుతం మా ఆవిద వూళ్ళో లేదు నువ్వు నన్ను సంతోషపరిస్తే నీకూ సంతోషమే దక్కుతుంది. ప్రొబేషన్ పూర్తికాకుండానే పర్మనెంట్‌చేసి, ప్రమోషన్ కూడా ఇప్పించగలను నీకిష్టం లేకపోతే వెంటనే వెళ్ళిపోవచ్చు రేప్ అంటే నాకు అసహ్యం. నిన్నాపను కానీ, నిన్ను డిస్‌మిస్ చేసి, నన్ను సంతోషపెట్టగల మరో అమ్మాయికి నీ ఉద్యోగం ఇవ్వాల్సి వస్తుంది ఆలోచించుకో తాపీగా సిగరెట్ వెలిగించాడు ఆఫీసర్‌గారు

ఛీ . ఇంత మోసమా? ఇంత ఘోరమా!? ఇక్కడ ఒక్క క్షణం కూడా ఉండకూడదు వాడు డిస్‌మిస్ చేసేదేమిటి? నేనే రిజైన్ చేస్తాను '

అనుకుంటూ నాలుగడుగులు వేసింది

కానీ ?!

తమ్ముళ్ళకి ఫీజు కట్టాలి చెల్లెలుకి పుస్తకాలు కొనాలి నాన్నగారి మందులు ఇంటి అద్దె పాలవాడు

అనసూయ ఆగింది వెనక్కి తిరిగింది

బెడ్‌రూమ్ ఎక్కడ? తన గొంతేనా అది తనేనా ఆ మాట అన్నది

యూ ఆర్ ఎ వెరి ఇంటలిజెంట్ అండ్ బ్రేవ్ గర్ల్ అంటూ భుజంమీద చెయ్యివేసి అనసూయని బెడ్‌రూమ్ వైపు నడిపించుకువెళ్ళాడు ఆఫీసరుగారు

## 3

" ... ఇలా తరతరాలుగా ఆడది మగవారి ఆగడాలకు బలి అవుతూ వస్తోంది కానీ ఇక మగజాతి ఆటలు సాగవు ఆడదంటే అబలకాదు ఆదిశక్తి ఎదురు తిరిగినంతకాలం మగవాళ్ళు తమ అత్యాచారాలు మానరు ప్రతి స్త్రీ ఎదురు తిరిగిన రోజున ఆడదాని అసలు శక్తి వాళ్ళకి తెలుస్తుంది స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం, భావస్వాతంత్ర్యం, మగవాడితో సమానమైన సోషల్ స్టేటస్ రావాలంటే ఆడవాళ్ళంతా ఏకమై పోరాడాలి ప్రతి స్త్రీ, సాటి స్త్రీని సానుభూతితో అర్థం చేసుకొని సహాయం చేయాలి ఆడది అబలకాదని రుజువు చేసే ఆ రోజు ఇంకెంతో దూరంలేదు

మహిళామండలి అధ్యక్షురాలు శ్రీమతి జగదీశ్వరి ఆవేశపూరితమైన ప్రసంగానికి హాలంతా కరతాళ ధ్వనులతో మారుమ్రోగిపోయింది

శ్రీమతి జగదీశ్వరిలాంటి ఆదర్శ మహిళలే స్త్రీజాతికి నవచైతన్యం అన్నారు ఆ తర్వాత ప్రసంగించిన వారంతా

సాధారణంగా స్త్రీజనోద్ధరణ కార్యకలాపాలతో బిజీగా వుంటూ ఆలస్యంగా ఇల్లు చేరే జగదీశ్వరి ఆ రోజు తొందరగా ఇంటికి వచ్చేసింది ఆ అవసరం వచ్చింది మరి

నేరుగా కొడుకు రాజేంద్ర గదికి వెళ్ళింది జగదీశ్వరి సిగరెట్టు కాలుస్తూ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు రాజేంద్ర తల్లి రాగానే సిగరెట్టు ఆర్పేశాడు

డోంట్ బీ సిల్లీ మై సన్! నీకెన్నోసార్లు చెప్పాను నా ముందు సిగరెట్టు కాల్చినంత మాత్రాన, నేనంటే నీకు గౌరవం లేదనుకొనేటంత నేరో మైండెడ్ కాదు నేను

'రాజేంద్ర ఏం మాట్లాడలేదు

"సరే ఇది మామూలేగా ఇంతకీ ఏం నిర్ణయించుకున్నావ్?

నేను సంధ్యను పెళ్ళిచేసుకోడానికి నువ్వెందుకు అభ్యంతరం చెప్తున్నావో నాకు అర్థంకావడంలేదు

"రాజా! మళ్ళీ మొదటికొస్తున్నావ్ ఆఫ్ ఆల్ ది గర్ల్స్ మొగుడు వదిలేసిన ఆ అమ్మాయిమీద నీకెందుకంత మోజు?

'అమ్మా నీకు మళ్ళీ చెప్తున్నాను సంధ్యని మొగుడు వదిలెయ్యలేదు సంధ్యే విడాకులు తీసుకుంది'

సో వాట్? ఆ అమ్మాయి గురించి నేను అన్ని వివరాలూ కనుక్కున్నాను ప్రభాకర్ . అంటే అదే ఆ అమ్మాయి ఎక్స్ హస్బెండ్ అంత దుర్మార్గుడేం కాదు అనవసరంగా అహంకారంతో ఆ అమ్మాయే గొడవలు పెట్టుకుని విడాకులు తీసుకుంది'

'రోజూ తాగడం, తాగినప్పుడు నోటికొచ్చినట్టు వాగడం. ఒక్కోసారి చెయ్యిచేసుకోవడం. ఇవన్నీ మంచివాడి లక్షణాలా?"

ఈ మోడర్న్ సొసైటీలో తాగడం తప్పుకాదని నీకూ తెలుసు మీ నాన్న కూడా తరచు తాగుతారు ఒక్కోసారి కొంచెం మోతాదు ఎక్కువై కాస్త రఫ్‌గా ప్రవర్తించినంత మాత్రాన

'అంతేకాదు బోలెడంత కట్నం గుంజి పెళ్ళిచేసుకుని, అంత మంచి భార్య ఉండగా నీకెలా చెప్పాలో తెలీడంలేదు

ఇందులో నువ్వు సంకోచపడవలసిందేమి లేదు అది కూడా నాకు తెలుసు అడపాతడపా వేరే ఆడవాళ్ళతో కొంచెం కక్కుర్తిపడ్డాడు అంతేగా ఇట్'స్ జస్ట్ ఏ వీక్‌నెస్! ఈనాటి మగవాడు శ్రీరామచంద్రుడిలా ఉండాలనుకోడం అవివేకం అనవసరంగా అతన్ని బజారుకీడ్చి విడాకులు తీసుకోవడం ఏదో గొప్ప ఆదర్శం అనుకుంది ఆ పిల్ల అలాంటి ఎల్లని చేసుకొని నువ్వు సుఖపడవు

అమ్మా నువ్వెన్ని చెప్పినా నేనుసంధ్యని తప్ప మరో అమ్మాయిని చేసుకోలేను

ఆ ప్రభాకర్ తల్లి మా ఒంశానికి చాలా కావాల్సిన మనిషి ఇట్'స్ ఎ క్వొశ్చన్ ఆఫ్ మై ప్రెస్టేజ్

నాకు ఇట్ స్ ఎ క్వొశ్చన్ ఆఫ్ మై హేపీనెస్

ఒక్కగానొక్క కొడుకువని ఇంత దూరం చెప్పాను నన్ను కాదని నువ్వా సంధ్యని పెళ్ళి చేసుకుంటే ఆ అవమానం భరించలేక నేను ఆత్మహత్య చేసుకోవాల్సి వస్తుంది నీకు తల్లి కావాలో, ఆ పిల్లే కావాలో తేల్చుకో

కోపంగా వెళ్ళిపోయింది జగదీశ్వరి

# ఒక్క మొక్క

-డా. సి. నారాయణరెడ్డి

ఈ పుటల్ని ఇలా దున్నుకు పోతుంటే
మొలవక పోతుందా ఒక్క చుక్క
ఆకాశం ఒంటి నుంచి ఒ ులపడి
పిచ్చిగా పెరిగే లక్ష జీబురు కంపలెందుకు?
పొడవనీ ఒక్క మొక్క
బోధి వృక్షంలా

## 4

"ఏమిటింత ఆలస్యం?

ఇవాళ మా సేల్స్ ఎగ్జిక్యూటివ్‌కి ప్రమోషన్ వచ్చింది పార్టీ ఇచ్చారు

రోజూ ఏదో ఒక ఫంక్షన్, ఏదో ఒక పార్టీ తప్పవనుకుంటాను నీ ధోరణి నాకు నచ్చడంలేదు

నేను కూడా చూస్తున్నాను ఈ మధ్య ప్రతిదానికి ఆరాలు, వివరాలూ అడగడం, సంజాయిషీలు అడగడం ఎక్కువ అవుతోంది

అంటే భర్తగా ఆ మాత్రం అడిగే హక్కు నాకు లేదా? ఎంత ఉద్యోగం చేసే భార్య అయినా ఇలా విచ్చలవిడిగా

రవీ

గట్టిగా అరిచినంత మాత్రాన నిజాలు మారిపోవు

ఏమిటా నిజాలు?

అదే మీ జనరల్ మేనేజర్ నిన్ను కార్లో డ్రాప్ చెయ్యడం, ఆన్ ది వే డ్రైవ్- ఇన్- రెస్టారెంట్‌లో అయిస్‌క్రీమ్‌లూ, కాఫీలూ

'అంతేనా ?'

ఆయనగారి కూతురు హిందీలో వీక్ గనుక ఆ పిల్లకి హింది పాఠాలు చెప్పడానికి అడపాతడపా నువ్వు వాళ్ళింటికి వెళ్ళి గంటలకొద్దీ అక్కడే ఉండటం

'వాట్'స్ రాంగ్ ఇన్ ఇట్?

నాకు నచ్చదు అంటున్నాకా కొన్ని కట్టుబాట్లు, కొన్ని పరిదులు ఉండాలి

హౌ సిల్లీ చదువుకున్న ఉద్యోగం చేసుకుంటున్న అమ్మాయి కావాలని కోరి నన్ను పెళ్ళి చేసుకున్నప్పుడు, నువ్వేదో ఆదర్శ యువకుడివనుకున్నాను

ఆదర్శం అంటే భార్య ఎలా తిరిగినా వూరుకోవడం అని నీ నిర్వచనం కాబోలు

కాస్త చనువుగా, నవ్వుతూ మాట్లాడితే అది ఇష్టం వచ్చినట్టు తిరగడం అని నీ నిర్వచనమా?

ఈ ఉద్యోగం మానెయ్యమనీ, నేనువేరే కంపెనీలో ఉద్యోగం వేయిస్తాననీ ఎన్నిసార్లు చెప్పినా, మానకపోవడానికి కారణం ఏమిటో ?

నువ్వనుకుంటున్న కారణం మాత్రం కాదు అసలీ ఉద్యోగం ఎందుకు మానెయ్యాలి? మా ఆయనకి నామీద నమ్మకం లేదనా? మరో చోట మరో ఉద్యోగం చేస్తే మాత్రం నీకు ఇలాంటి సందేహాలు రావని గ్యారంటీ ఏముంది? కావాలంటే అసలు ఉద్యోగమే చెయ్యను హాయిగా ఇంట్లోనే ఉంటాను కానీ, అది నీకు పనికిరాదు ఎందుకంటే నీకు నా జీతం కావాలి ఈ లగ్జరీ లైఫ్ నువ్వు వదులుకోలేవు నీ ఒక్కడి సంపాదనతో ఇప్పుడున్న ఈ లెవెల్ మెంటెయిన్ చెయ్యలేవు బట్ భార్యమీద పరిపూర్ణ నమ్మకం చూపించలేవు నీ ఉద్యోగంలో నువ్వు అనేకసార్లు బైట వూర్లకి వెళ్తుంటావు కానీ, అక్కడ నువ్వేం చేస్తున్నావో, ఎవరితో తిరుగుతున్నావో అనే అనుమానం నాకు రాదు ఎందుకంటే నీ మీద నాకున్న ప్రేమ, గౌరవం అలాంటి అనుమానానికి చోటివ్వవు

నేను తిరగాలనుకున్న రోజున చాటుమాటుగా తిరగను పబ్లిగ్గానే తిరుగుతాను నేను మగాడ్ని

నువ్వు కూడా ఒన్ ఆఫ్ దోస్ ఏవరేజ్ మేల్స్ అని నాకు ఇప్పుడే అర్థం అయింది

ఎలాగైనా అనుకో నువ్వు ఈ ఉద్యోగం మానేసి వేరే చోట ఉద్యోగం చెయ్యడానికి ఒప్పుకోకపోతే ఫలితం చాలా తీవ్రంగా వుంటుంది'

'అంటే?'

'విడాకులు '






# ఆంధ్రసచిత్రవారపత్రిక

## పాఠకులకి అవకాశం

'గర్భస్థ శిశువు చెప్పిన కథలు' శీర్షిక క్రింద పాఠకులెవరైనా తమ రచనలని కథా రూపంగా కానీ వ్యాసంగా కానీ రాసి పరిశీలనకి పంపవచ్చు తమ రచనతో పాటు ఈ క్రింద ఇచ్చిన కూపన్‌ని జతపరచి పంపవలసిందిగా కోరుతున్నాము రచనలు తమ స్వంత ఊహలేనని, ఎవరినీ ఉద్దేశించినవి కావని, దేనికి అనువాదం, అనుకరణ, కాపీ కాదని హామీ రాసి పంపాలి. రచన వ్రాత ప్రతిపై రాసినవారిపేరు, పూర్తి చిరునామా స్పష్టంగా రాయాలి. రచనతో పాటు దానిని రాసిన వారి ఫొటో కూడా జతపరిచి పంపవచ్చు. ప్రచురణకి స్వీకరించిన రచనలని అవి రాసినవారి ఫొటో లతో సహా ప్రచురిస్తాము.

రచనలు ఒక అరఠావు పేజికి మించరాదు కాగితానికి ఒకవైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి

ప్రచురణార్హంకాని రచనలని తిప్పి పంపగోరేవారు తమ రచనలతో పాటు తగినన్ని స్టాంపులు అతికించిన స్వంత చిరునామా కల కవరు జతపరచి పంపాలి. లేకపోతే వాటిని తిప్పి పంపటం జరగదు వాటిపై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ అవకాశం లేదు.

ఈ శీర్షికకి పంపే రచనలని సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధినగరం, విజయవాడ–520003 అన్న చిరునామాకి పంపాలి కవరు పై భాగంలో "గర్భస్థ శిశువు చెప్పిన కథలు" శీర్షికకి అని స్పష్టంగా రాయాలి.

ప్రచురించిన ప్రతి రచనకీ పారితోషికం ఉంటుంది. పాఠకులందరూ ఈ అవకాశాన్ని వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము

–సంపాదకుడు

కూపన్

### ఆంధ్ర సచిత్ర వారపత్రిక

### గర్భస్థ శిశువు చెప్పిన కథలు

కథ వ్యాసం రాసిన వారి పేరు : ____________________

పూర్తి చిరునామా ____________________

____________________

____________________

పిన్ కోడ్ : ____________________

## తల్లీ ... నీకు శతకోటి దండాలు!

## 5

"ఆమె పరిస్థితి ఎలా ఉంది డాక్టర్?'

నో హోప్ బతకడం కష్టం

'నేను ఆవిడ స్టేట్‌మెంట్ తీసుకోవాలి'

ఎక్కువ సమయంలేదు వెళ్ళండి ఇన్‌స్పెక్టర్'

ఆ అమ్మాయి మెడవరకూ దుప్పటి కప్పబడి వుంది మొహం భీకరంగా ఉంది. కిరోసిన్ మంటల్లో కాలిపోయిన మొహం ఎలా ఉంటుంది?

ఇన్‌స్పెక్టర్ ఆమె దగ్గరగా వచ్చి కూచున్నాడు

ఆమె ఎక్కడో నూతిలోంచి మాట్లాడుతున్నట్టు, ఆగుతూ ఆగుతూ చెప్పసాగింది

నా పేరు సీత మా నాన్నగారికి నాతో కలిపి నలుగురు ఆడపిల్లలు నేను రెండోదాన్ని కట్నం బాకీ కారణంగా నన్ను మా ఆయన శేఖరం, అత్తగారు సుభద్రమ్మ నానా హింసలూ పెట్టేవారు. అన్నీ భరించాను వేరే మార్గంలేదు అత్తగారింట్లో అత్యాచారాలు భరించలేక పుట్టింటికి వెళ్తే అది మా నాన్న దృష్టిలో పరువు బజారునపడటం అంతేకాక భర్త వదిలేసిన భార్యగానో, భర్తని వదిలేసిన భార్యగానో నేను పుట్టింటికి వెళ్ళిపోతే, మిగతా చెల్లెళ్ళెవ్వరికీ పెళ్ళిళ్లా అవుతుంది - అని మా అమ్మ భయం అందుకే అన్నీ భరించాను కానీ, బాధల నుంచి వాళ్ళే నాకు విముక్తి ప్రసాదించారు మా ఆయన అరవకుండా నా నోట్లో గుడ్డలుకుక్కేసి, కాళ్ళూ, చేతులూ కట్టేశారు మా అత్తగారు నా మీద కిరోసిన్ పోసి అంటించారు'

-సీత చచ్చిపోయింది

సీత భర్తనీ, అత్తగార్ని అరెస్టు చేశారు

కోర్టులో కేసు నడుస్తోంది

* * * * *

అరుంధతి వెక్కి వెక్కి ఏడుస్తోంది

ఏడవకమ్మా ఇంకా చాలా చూశానమ్మా, సంఘటన ఏదయినా సారాంశం ఒక్కటే కన్నీటి కడలిలో కొట్టుకుపోవడమే ఆడదాని జీవితం వద్దమ్మా ఈ ఆడ పుట్టుక నాకొద్దు పుట్టాకా నరకయాతనలు పడకుండా, పుట్టకముందే విముక్తి ఇస్తున్నావమ్మా నాకు అందుకే, నాకు నువ్వు చేస్తున్న ఈ మహోపకారానికి, తల్లీ . నీకు శతకోటి దండాలు "

* * * * *

'అమ్మా అమ్మా ఎందుకమ్మా ఏడుస్తున్నావ్?

విజయ తల్లిని కుదిపింది

ఉలిక్కిపడింది అరుంధతి

* * * * *

ఆ మర్నాడు, డాక్టర్ సత్యవతి నర్సింగ్‌హోమ్‌లో అరుంధతికి విజయవంతంగా ఎబార్షన్ చేయబడింది □

### అంకితం

(ఆడబ్రతుకు అనే గండం నుంచి గట్టెక్కిన ఆ చిన్నారి పిండానికి ఈ కథ అంకితం)

బాంబినో ఒక అద్భుతమైన వెర్మిసెల్లిని. పరిశుభ్రమైన పద్ధతిలో అధునాతన ఇటాలియన్ యంత్రములతో తయారు చేయబడినది. మిక్కిలి ప్రోటీన్లు కలిగియుండి క్రొవ్వు పదార్థములు లేకుండుటయే బాంబినో విశిష్టత. వండినప్పుడు కాని, తరువాత కాని ముద్దగా కాకపోవటమే బాంబినో ప్రత్యేకత. నిమిషములలో బాంబినోతో ఎన్నో రకములైన, నోరూరించే వంటకాలు, ఫలహారాలు తయారు చేయవచ్చును. ఇంకా బాంబినోతో పొదుపు కూడా. నేడే వాడి చూడండి. మీకే తెలుస్తుంది.



### బాంబినో హల్వా

1 కప్పు బాంబినోని నేతిలో ము
రంగు వచ్చేదాక వేయించి, ప్రక్క
పెట్టుకొండి. మూడు కప్పుల నీ
మరగించి, బాంబినో కలిపి మూ
పెట్టండి. దీనిని తక్కువ మంట
నీరు పూర్తిగా ఇంకేదాక ఉంచం
మూడు చంచాల పంచదార కలి
నిమిషాలు కలపండి. రుచికి పిస్త
జీడిపప్పు చేర్చి వేడిగా వడ్డించం
ఇది నలుగురికి సరిపోతుంది.




## ఉచితం

బాంబినో వంటల విధానం తెలిపే పుస్తకం, ప్రతి బాంబినో డీలరు వద్ద.






వెర్మిసెల్లిని




తీపైనా ఖారా అయిన బాంబినోతో రుచే రుచి!

# సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు



**జి వెంకటరామిరెడ్డి, కర్నూలు**

పెళ్లయిన తర్వాత సినిమారంగం నుండి విరమించుకుంటారా? కొనసాగిస్తారా?

పెళ్లిచేసుకున్న తర్వాత కదా ఏం చెయ్యాలని ఆలోచించేది!

**ఎ శ్రీదేవి, జమ్మలమడుగు**

మీరు ఎక్కువగా 'ఉత్తమ ప్రశ్న' ఎన్నుకునేది మిమ్మల్ని పొగిడినవాళ్లనే కదా?

కాదు. ఆ ప్రశ్న ఆలోచింపచేసేదిలా వుండాలి. మీరూ ప్రయత్నించండి. అలాంటి ప్రశ్న కోసం.

**షేక్ అబ్దుల్లాకాశిం, కొత్తగూడెం, నాగండ్ల, (అమ్మపాలెం) దోర్నకల్**

ఆంధ్రప్రదేశ్ వరద బాధితులకు విరాళం ప్రకటించేది వుందా? లేదా?

పత్రికలు చదవరా మీరు. చదివివుంటే యీ ప్రశ్న అడిగి వుండేవారుకాదు. గోదావరి వరద బాధితుల నిధికి లక్ష రూపాయలు ప్రకటించిన సంగతి అన్ని పత్రికల్లోనూ వచ్చింది.

**ఎ రోజా, ఖరగ్‌పూర్**

మీ దృష్టిలో నటన ప్రధానమా? ధనము ప్రధానమా?

ముందు నటన.

ఆ తర్వాతే ధనం ప్రసక్తి.

**బి. రామరాజు, నర్సీపట్నం**

స్త్రీలు ఎక్కువ శాతం చూసేదానికంటే వినేదానికే ప్రాముఖ్యతనిస్తారు ఎందుచేతనంటారు?

స్త్రీలే అని ఎలా చెప్పగలుగుతున్నారు మీరు. మనుషులు ఎవరైనా సరే ఎక్కువగా వింటారు.

**యస్. జె. పి. కళ్యాణి, కైకలూరు**

సమాజంలో స్త్రీని పురుషునితో సమానంగా చూసేది ఎప్పుడు?

స్త్రీకి పురుషునితో బాటు సమాన హక్కులు లేవని మీరెందుకు అనుకుంటున్నారు?

## ఉత్తమ ప్రశ్న

**యం. రవికుమార్, రామవరం**

మీ దృష్టిలో ప్రేక్షకుల ప్రశంసలు ముఖ్యమా? ప్రభుత్వ అవార్డులు ముఖ్యమా?

ఏ నటికైనా ...., నటుడికైనా ప్రేక్షకుల ప్రశంసలు లేకపోతే చిత్రసీమలో రాణించడం కష్టం. ఎంత చక్కని పాత్రలు వేసినా ప్రేక్షకాదరణ పొందకపోతే ఆ నటీనటులు పడిన కష్టం వ్యర్థమైపోతుంది. నావరకూ నేను ప్రేక్షకుల ఆదరణే నటీనటుల పురోభివృద్ధికి ఎంతో దోహదపడుతుందనుకుంటాను.

ప్రేక్షకులు మెచ్చాక ప్రభుత్వ ఆదరణ తప్పక లభిస్తుంది.

**యం సునీత, కరీంనగర్**

సినిమాలలో పేదరికపు బాధలకు చలించి పాత్రలతో పాటు కన్నీరు పెట్టి బయటకు రాగానే పేదవాడు సహాజ్ బిచ్చగాడు కన్పిస్తే చీదరించుకుంటారు. ఎందుకని?

చూసింది సినిమా కనుక ...

జరుగుతుంది జీవితం కనుక ...

బాధల్లో వున్న తోటివారికి ఉన్నదాంట్లో సహాయపడే రోజులు అతి త్వరలో రానున్నాయని అభిప్రాయపడ్తాను.

**బి. జి. ఆర్. చౌదరి, కాగితపురం**

నేటి విద్యా విధానంలో డొనేషన్లపై మీరిచ్చే సందేశం?

సందేశాలు యిచ్చేంత వయసు నాకు యింకా రాలేదు.

**యం నరసింహులు, తిరుమల**

విజయం మీ పేరులో వుంది శాంతి మీ ముఖంలో వుంది యీ రెండు కల్సి మిమ్మల్ని సూపర్ హీరోయిన్‌ని చేసాయి ఏమంటారు?

ఏమీ అనలేను. నా పట్ల అభిమానం ఎప్పుడూ ఇలాగే వుండాలని కోరుకుంటా!

**బి. విజయకుమారి, నల్లపాడు**

మీరు ఏ చిత్రంలో చూసినా ఆడదాని హక్కుల కొరకు పోరాడతారు ఎందుకని?

సమాజంలో స్త్రీకి మరింత గౌరవం రావాలని ఆయా చిత్రాల్లోని నా పాత్ర ద్వారా దర్శక – నిర్మాతలు చెబుతున్నారు. కనీసం కొంత మందిలోనైనా చైతన్యం వస్తే చాలు.

**పి. విద్యాసాగర్, నల్లగొండ**

భారతి, ఝాన్సి, అరుణ, సరస్వతి వంటి పాత్రలు పోషించిన మీరు గ్లామర్ పాత్రలో నటిస్తున్నప్పుడు మీ భావాలు ఎలా వుంటాయి?

మామూలుగానే వుంటాయి. నటి అన్న తర్వాత అన్ని రకాల పాత్రలు పోషించి ప్రేక్షకుల మెప్పు పొందాలని నా అభిప్రాయం. ఫలానా పాత్రలకే పరిమితం కావాలన్నది నా అభిమతం కాదు. □

---

కూపన్

### ఆంధ్రసచిత్ర వారపత్రిక
## విజయశాంతి సమాధానాలు

ప్రశ్న. ______________________________

______________________________

పంపిన వారి పేరు : ______________________________

పూర్తి చిరునామా. ______________________________

# అభిమాన తారలపై అభిప్రాయం

నా అభిమాన నటుడు చిరంజీవి. చిరంజీవి నటించిన చిత్రాలన్నీ నేను క్రమం తప్పకుండా చూస్తాను. చిరంజీవి ఎక్కువగా యాక్షన్ చిత్రాలలోనే నటిస్తున్నారు. అలా కాకుండా హాస్యం, ప్రేమ చిత్రాలలో నటిస్తే ప్రేక్షకులను ఆకట్టుకొంటారు. ఫైట్స్ ఓవర్‌గా వుండకూడదని నా అభిప్రాయం. "శుభలేఖ", మరియు "విజేత" వంటి కుటుంబ కథా చిత్రాలలో నటిస్తేనే మంచి పేరు సంపాదించగల్గుతారు. ఎటువంటి పాత్రనైనా



అవలీలగా పోషించి అభిమానుల హృదయాలలో ముద్రవేసుకొనేలా వుండాలని నా కోరిక."చంటబ్బాయ్" లాంటి హాస్య చిత్రాలలో నటిస్తేనే మంచిది.

–మట్టపర్తి ఈశ్వరప్రసాద్, ఉండ్రాజవరము

★ ★ ★

యాభై ఐదు సంవత్సరముల సినిమా పరిశ్రమ యొక్క, మరియు నా పద్దెనిమిది సంవత్సరముల "నిరీక్షణ" ఫలించినది. అందులో నుంచి విరబూసిన సుగంధ, సుమధుర సంపెంగ అయిన కుసుమ కోమలియే అర్చన.

నేను "నిరీక్షణ" సినిమా చూసి అందులో అర్చనయొక్క యాక్షన్, గ్లామర్, వాయిస్ చూసి నేను ఆమె అభిమానిని అయ్యాను. ఈమధ్య



విడుదల అయిన "శ్రీ వేమన చరిత్ర" చూసినాను. అందులో ఆమె చేసిన యాక్షన్ సుపర్బ్. నేను ఆమెకు ఇచ్చే సలహా ఏమిటి అనగా వెరైటీ పాత్రలను మాత్రమే చేయమని.

షేక్ యం.డి. హనీఫ్, సి. ఆర్. పాలెం డొంక, నెల్లూరు

అసలు చిరంజీవి అంటే అందరికీ ఎందుకంత అభిమానం? పర్సనాలిటీ - 100%, అందం - సూపర్బ్,



యాక్షన్ - సినీ రంగానికే తలమానికం, డాన్సు -హైలైట్! అందరితోనూ చాలా సరదాగా ఉంటారు కూడా.

మరి ఇన్ని సుగుణాలు ఉన్న చిరంజీవికి అన్ని బిరుదులు రావటం కూడా సమంజసమేకదా. అయితే డేరింగ్, డైనమిక్, సుప్రీమ్ హీరో చిరంజీవిగారికి ఒక చిరుడివ్వోగా నేనిచ్చే సలహా ఏమిటంటే అన్నీ ఒకే రకం పాత్రలు ధరించవద్దని. వెరైటీగా ఉంటే ఆంధ్రదేశంలో 3/4 వ వంతు చిరంజీవి అభిమానులే అవుతారు కదా మరి!

–బి. సుగుణ, విశాఖపట్నం

★ ★ ★

తెలుగు చలన చిత్ర చరిత్రలో యువ హీరోగా ఏ చిత్రము విడుదల కాకుండా తన స్టిల్స్‌తోనే



అభిమానులను ఆకట్టుకున్న యువ నటుడు వెంకటేష్. మొదటి చిత్రం "కలియుగ పాండవులు" చిత్రంలో తన నటనా కౌసల్యం చూపి తెలుగు సినీ పరిశ్రమలో తన స్థానం నిలకడ చేసుకొన్న హీరో వెంకటేష్. తన చిత్రాలను వ్యాపారాత్మకంగా కాక కళాత్మకంగా ఉండాలని కోరుచున్నాను. కథా బలం కల చిత్రాలలో నే నటించాలి.

-ఎ. వెంకటేశ్వర్లు, కనిగిరి

★ ★ ★

సినీ పరిశ్రమ ఒక నిచ్చెన లాంటిది. అనతికాలములోనే ఎవరి అండదండలు లేకుండా



కేవలము తన స్వయం కృషితో కష్టపడి ఆరున్నర కోట్ల ఆంధ్ర ప్రజల హృదయాలను దోచుకొని ఒక్కొక్కమెట్టు ఎక్కుతూ పైకి వచ్చిన హీరో మా నట భాస్కర చిరంజీవి.

సినీ నీలాకాశములో తారాజువ్వలా శరవేగముతో దూసుకొనిపోతున్న మా హీరో చిరంజీవిగార్కి మేము ఎన్నో లెటర్లు వ్రాసి వుంటిమి. వారు మాకు జవాబు ఇవ్వలేదు. ఇప్పటినుంచి అయినా మా నట భాస్కరుడు అభిమానుల లెటర్లుకు వెంటనే జవాబు ఇవ్వవలెనని మనసారా కోరుకుంటున్న ఒక అభిమాని.

-కె. వి. రమణ, నంద్యాల

★ ★ ★

నా అభిమాన నటుడు "సూపర్‌స్టార్ క్రిష్ణ"గారు.



ఆయనగారు నటించిన చిత్రాలలో నూటికి 80 సినిమాలు చూసేవాడిని. "ఖైదీ రుద్రయ్య"లో ఆయన నటన, ఫైట్లు అమోఘం. యాక్షన్‌లోనే కాదు ఫీలింగ్‌లో కూడా అతనికి అతనే సాటి. ఆయనగారు ఇంకా స్టెప్స్‌లో కొద్దిగా శ్రద్ధ తీసుకుంటే బాగుంటుందని ఆయన అభిమానిగా నా సలహా.

–వారణాసి క్రిష్ణారావు, బుడితి

## మనవి

అభిమాన తారలపై అభిప్రాయం శీర్షికకి రాసేవారు తమ రచనలని పావుఠావు కాగితంపై 500 అక్షరాలకి మించకుండా రాసి పంపాలి. రాసిన వారి ఫొటో కూడా జత పరచి పంపాలి. పంపిన వారి పేరు, పూర్తి చిరునామా వివరంగా రాయాలి. ప్రచురణకి స్వీకరించని రచనలు, ఫొటోలు తిప్పి పంపగోరేవారు స్వంత చిరునామా కల, తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన కవరు జతపరిచి పంపాలి. వాటిపై ఉత్తర ప్రత్యుత్తరాలకి అవకాశం లేదని మనవి చేస్తున్నాము. రచనలు, ఫొటోలు శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 520003కి పంపాలి.

– సం

# సినిమా

"పసుపుతాడు"లో రాధ

## క్రాంతి కుమార్- వెంకటేశ్‌లతో మురారి చిత్రం

"నవంబర్ నుంచి షూటింగ్" అన్నారు "సీతామాలక్ష్మి, గోరింటాకు, త్రిశూలం, సీతారామ కల్యాణం" వంటి ఉత్కృష్టమైన చిత్రాల నిర్మాతగా వాసికెక్కిన యువచిత్ర అధినేత కె. మురారి. ఈయన కొత్త చిత్రంలో వెంకటేశ్ సరసన భానుప్రియ నాయిక. గొల్లపూడి మారుతీరావు, జగ్గయ్య, వేలు, రమాప్రభ తతిమ్మా నటవర్గం. కె. వి. మహదేవన్ సంగీతం, శరత్ ఛాయ,, తార నృత్యాలు, రాజు సాహసాలతో కె. నరసింహంనాయుడు సమర్పించే ఈ ప్రతిష్టాత్మక చిత్రానికి క్రాంతికుమార్ దర్శకుడు.

## డైరెక్టర్ కె. రాఘవే
## చిత్రాలు

బాలకృష్ణ ద్విపాత్రాభి
కృష్ణమోహనరావు నిర్మిం
సహోదరులు" విజయదశమి కాను
చిరంజీవి-విజయశాంతి జంట
నిర్మించిన "చాణక్య శపథం" నవ
ఒక సుప్రసిద్ధ సంస్థ
సూర్యదేవర రావ ...నరావు క
నాగార్జున హీరోగా అన్న
చిత్రానికి జనవరి 1న
జరుగుతుంది.
జనవరిలోనే కె. కృష్ణమో
కె. అసోసియేట్స్ ద్వితీయ చిత్ర



"కౌబాయ్ నెంబర్-1"లో రజని

# ...సినిమాలు

_జి.వి.జి.

...ంద్రరావు

...యంతో ...కె
...న అపూర్వ
...క
...కో డి.వి.ఎస్.రాజు
...టేర్ విడుదల
...ర్మించే చిత్రానికి
...క ఆధారం
...ర్ణ స్టూడియోస్
...ప్రారంభోత్సవం

...వు ...ర్మించే ఆర్
...చిరంజీవి హీరో



చిరంజీవి, "రాక్షసుడు"లో



## చిరంజీవి, భారతీరాజా కాంబినేషన్‌లో అల్లు అరవింద్ చిత్రం "ఆరాధన"

"ఆగస్టు 23 నుంచి 31 వరకు కన్యాకుమారి ప్రాంతాలలో షూటింగ్ జరిపాం. సెప్టెంబర్‌లో మద్రాసులో తతిమా షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు అల్లు అరవింద్. ఈయన నిర్మిస్తున్న గీతా ఆర్ట్స్ వారి "ఆరాధన" చిత్రంలో చిరంజీవి, సుహాసిని, రాధిక, డబ్బింగ్ జానకి, పి. ఎల్. నారాయణ వగైరా నటవర్గం. సోమశేఖర్ కథ, ఇళయరాజా సంగీతం, కణ్ణన్ ఛాయ, బాబూరావు సహకార దర్శకత్వం, తిరునావక్కరసు కూర్పుతో భారతీరాజా స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.



"బ్రహ్మరుద్రులు"లో వెంకటేశ్, రజని



"ఓ ప్రేమకథ"లో రాధిక, సత్యనారాయణ

## దాసరి నారాయణరావు చిత్రావళి

కృష్ణంరాజు సమర్పించె గోపీకృష్ణా ఫిలిమ్స్ "తాండ్రపాపారాయుడు" ప్రతిష్టాత్మక చిత్రం సెప్టెంబర్ 25న విడుదలవుతుంది. ఇదే సంస్థ 1987 జనవరిలో ప్రారంభించే చిత్రం దాసరి 100వ చిత్రమవుతుంది.

విజయమాధవీ వారి "నేనే రాజా– నేనే మంత్రి" (మోహన్‌బాబు హీరో), "విశ్వనాధ నాయకుడు" (కృష్ణ హీరో) త్వరలో విడుదల కానున్నాయి.

కృష్ణంరాజు హీరోగా తారక ప్రభు ఫిలిమ్స్ "ఉగ్ర నరసింహం" విడుదలకు సిద్ధంగా ఉంది. నాగార్జున హీరోగా "మజ్ను" రెండవ షెడ్యూల్ పూర్తయింది.

రేలంగి నరసింహారావు దర్శకత్వం వహించే భ్రమరాంబికా ఫిలిమ్స్ "రౌడీషన్ చక్రవర్తి"లో దాసరి ప్రధాన పాత్రధారి.

1987 జనవరిలో సురేష్ ప్రొడక్షన్స్ చిత్రం, మే 4 నుంచి ఎ. ఎన్. ఆర్. నాగార్జునలతో అన్నపూర్ణ స్టుడియోస్, చిత్రం, కృష్ణంరాజుతో అట్లూరి పుండరీకాక్షయ్య నిర్మించే చిత్రం, ఎ.ఎన్. ఆర్.తో దత్తా ఫిలిమ్స్ నిర్మించే "ఆ ఇంటి తల్లి– ఈ ఇంటి తండ్రి" కాక మరికొన్ని చిత్రాలు దాసరి దర్శకత్వంలో రూపొందనున్నాయి.

## "తాయారమ్మ– తాండవకృష్ణ" చివరి షెడ్యూల్

"తాయారమ్మ పరమ భక్తురాలు. తాండవకృష్ణ నిరీశ్వరవాది; మానవత్వాన్నే నమ్మేవాడు. వీరిద్దరి మధ్య సాగే వినోదభరిత చిత్రం. ఆగస్ట్ 1 నుంచి 25 వరకు మూడవ షెడ్యూల్ పూర్తయింది. సెప్టెంబర్‌లో చివరి షెడ్యూల్. మంగళంపల్లి బాలమురళీకృష్ణ గానం చేసిన భక్తి గీతం ఒక ఆకర్షణ అయితే, గొల్లపూడి– వై. విజయల పైన పిక్చరైజ్ చేసిన సినిమా హిట్ సాంగ్స్ అన్నిటితో కూడిన ఒక రికార్డ్ పాట మరో విశేషం." అన్నారు

## సినిమా

కొమ్మినేని. ఈయన దర్శకత్వంలో పోలా రామయ్యశెట్టి సమర్పించే లోకేశ్వరి ఆర్ట్ క్రియేషన్స్ వారి పై చిత్రంలో షావుకారు జానకి, అర్జున్, గొల్లపూడి, రాళ్ళపల్లి, పద్మనాభం, జె.వి.సోమయాజులు, అల్లు రామలింగయ్య, త్యాగరాజు, వీరభద్రరావు, నళినీకాంత్, కాశీ విశ్వనాధ్, అర్జా జనార్ధనరావు, రామకృష్ణ శాస్త్రి, రజని, వై. విజయ, సీత నటించారు. రవీంద్రబాబు కథకు కాశీ విశ్వనాధ్ సంభాషణల కర్త. జాలాది గీతాలకు చక్రవర్తి స్వరకర్త; శివశంకర్ నృత్యాలు.

---

నాది దసరా వేషంకాదు నాయనా! నీతో ఒక సినిమా తీసిన దానికి ఫలితం!....




జూడో రత్నం సాహసాలు, కబీర్‌లాల్ ఛాయ, దిలీప్‌సింగ్ శిల్పం, రవీంద్రబాబు కూర్పు, కె. ఎల్. ఎన్. శాస్త్రి నిర్వహణతో పోలా శ్రీనివాసులు నిర్మాత.

## హీరో వెంకటేశ్ చిత్రావళి

ఎ. ఎన్. ఆర్.తో వెంకటేశ్ నటించే అశ్వనీదత్ చిత్రం "బ్రహ్మరుద్రులు" తుది మెరుగులు దిద్దుకుంటోంది. రామ మోహనరావు దర్శకత్వంలో ఎస్. వెంకటరత్నం నిర్మించే పల్లవి ఫిలిమ్స్ చిత్రం, రవిచంద్ర దర్శకత్వంలో డాక్టర్ తిరుపతి రెడ్డి నిర్మించే సంయుక్తా మూవీస్ చిత్రం నిర్మాణంలో ఉన్నాయి. "నసీబ్" ఆధారంగా టి. సుబ్బరామిరెడ్డి, పి. శశిభూషణ్‌లు రూపొందించే శ్రీ సారధి స్టూడియోస్ చిత్రం, క్రాంతికుమార్ దర్శకత్వంలో యువచిత్ర మురారి నిర్మించే చిత్రం, గోపాల్ దర్శకత్వంలో ఉష చిత్ర అధినేత అశోక్ నిర్మించే చిత్రం త్వరలో ప్రారంభం కానున్నాయి. వచ్చే జనవరి, జూన్‌లలో డి. రామానాయుడు నిర్మించే సురేష్ ప్రొడక్షన్స్ రెండు చిత్రాలలో కాక జూన్ నుంచి కె. రాఘవేంద్రరావు, తాతినేని రామారావు, ఎ. కోదండరామిరెడ్డి, బాపయ్య దర్శకత్వం వహించే చిత్రాలలో వెంకటేశ్ హీరో.

## కమల్, ముత్తురామన్ కాంబినేషన్‌లో ఎ. వి. ఎం. వారి "నవరస నాయకుడు"

"ఈ చిత్రంలో కొత్త కమలహాసన్ కనిపిస్తాడు. సెంటిమెంట్ ఉంటుంది. యాక్షన్ కూడా ఉంటుంది. తెలుగు, తమిళ భాషల్లో ఒకేసారి తయారౌతుంది. నూతనవత్సరారంభంలో సెట్స్‌కు వెళుతుంది;" అన్నారు ఎస్. పి. ముత్తురామన్. ఈయన దర్శకత్వం వహించే ఎ.వి.ఎం. ప్రొడక్షన్స్ "నవరస నాయకుడు" చిత్రానికి ఎం. శరవణన్, ఎం. బాలసుబ్రహ్మణియన్, ఎం. ఎస్. గుహన్ నిర్మాతలు.

## విజయబాపినీడు దర్శకత్వంలో శోభన్‌బాబు "పున్నమి చంద్రుడు"

"శోభన్‌బాబు సరసన సుహాసిని, సుమలత నాయికలు. సెప్టెంబర్ 19 నుంచి 24 వరకు ఆఖరి షెడ్యూల్ జరిగింది", అన్నారు రాశీ మూవీ క్రియేషన్స్ అధినేత ఎం. నరసింహారావు. ఈయన నిర్మిస్తున్న పై చిత్రంలో జె. వి. సోమయాజులు, నూతన్‌ప్రసాద్, గిరిబాబు, రాళ్ళపల్లి, అల్లు రామలింగయ్య, అంజలి, రాజ్యలక్ష్మి, వై. విజయ, మమత, జయమాలిని, అనూరాధ పాల్గొన్నారు. కథ : గౌరీశంకర్. మాటలు: సత్యమూర్తి. గీతాలు : ఆత్రేయ, వేటూరి. సంగీతం : చక్రవర్తి. ఛాయ : మహీధర్. శిల్పం : దిలీప్‌సింగ్. నిర్వహణ : వి. కొండలరావు. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : విజయబాపినీడు.

## "భార్గవరాముడు"గా బాలకృష్ణ

"రెండు షెడ్యూల్స్ పూర్తయ్యాయి. సెప్టెంబర్, అక్టోబర్‌లలో ప్రతి నెలా 11–20 తేదీల మధ్య జరిగే తదుపరి షెడ్యూల్స్‌తో మొత్తం షూటింగ్ పూర్తయి పోతుంది. సంక్రాంతి కానుక", అన్నారు ఎస్. జయరామారావు. ఈయన నిర్మించే జె. బి. ఆర్ట్ క్రియేషన్స్ వారి పై చిత్రంలో బాలకృష్ణ, విజయశాంతి, చంద్రమోహన్, జగ్గయ్య, రంగనాథ్, గొల్లపూడి మారుతీరావు, కోట శ్రీనివాసరావు, వేలు, చలపతిరావు, మందాకిని, అరుణ, అన్నపూర్ణ, పరుచూరి గోపాలకృష్ణ పాల్గొంటున్నారు. కొమ్మనాపల్లి గణపతిరావు మూలకథకు పరుచూరి సోదరులు కథాసంవిధానం, సంభాషణలు సమకూర్చారు. వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త. నందమూరి మోహనకృష్ణ ఛాయ. శ్రీనివాసరాజు శిల్పం. కె. సదాశివరావు సంయుక్త దర్శకత్వం. సలీమ్ నృత్యాలు. సత్యం–సుబ్రహ్మణ్యం ప్రాతకర్తతో రావు గోపాలరావు ఎం. ఏ. సమర్పించే ఈ భారీ చిత్రానికి ఎ. కోదండరామిరెడ్డి దర్శకుడు.



"పున్నమి చంద్రుడు"లో ఒక దృశ్యం



"మామా కోడలు సవాల్"లో



"శాంతినివాసం"లో

"బ్రహ్మ నీరాత తారుమారు"లో స్మిత, రాజేంద్రప్రసాద్

## శ్రీ లక్ష్మీ అన్నపూర్ణ ఆర్ట్స్ చిత్రం

"ఆఖరి షెడ్యూల్ నవంబర్‌లో," అన్నారు గబ్బిట మధుమోహన్. ఈయన సమర్పించే పై సంస్థ చిత్రానికి సెప్టెంబర్ 6న ప్రారంభోత్సవం జరిగింది. ఆనంద్‌బాబు, రాజేష్, అశ్విని, సాగరిక, అరుణ, ప్రీతి, సంధ్య, పద్మ, శ్యామల, నూతన్ ప్రసాద్, శుభలేఖ సుధాకర్, రాళ్ళపల్లి, పి. ఎల్. నారాయణ, రవికాంత్ ప్రభృత నటవర్గం. ఆత్రేయ సంభాషణల కర్త. గీతాలను గబ్బిట వెంకట్రావు, ఆత్రేయ, వేటూరి, జాలాది, కొసరాజు రాయగా పార్థసారథి స్వరపరచారు. పాచు-శర్మ ఛాయ, బొబ్బిలి ప్రకాష్ సంయుక్త దర్శకత్వం, శేషు నృత్యాలు, బాబూ రమేష్ సాహసాలు, మధు కథ- కూర్పు, కె. జయకుమార్ నిర్వహణతో వై. ఎన్. రెడ్డి, జి. ఉమాకుమార్, పి. ఎన్. రామారావు నిర్మిస్తున్న ఈ చిత్రానికి లలితాబాలు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

## శోభన్‌బాబు "పూలరంగడు"

"సక్కనోడు" అనంతరం రాఘవేంద్ర సినీ క్రియేషన్స్ వారి చిత్రం "పూలరంగడు" అని నిర్మాత కందేపి సత్యనారాయణ తెలిపారు. శోభన్‌బాబు హీరో

## సినిమా



"దొరబిడ్డ" లో రాజశేఖర్

## మౌళి దర్శకత్వంలో "రౌడీ పోలీస్"

"ఇదొక తమాషా సబ్జెక్ట్ అని టైటిల్‌బట్టి ఊహించుకోవచ్చు. టి. వి. లోనూ, రంగస్థలం మీద ఎన్నో ప్రదర్శనలివ్వబడిన నా నాటకం ఆధారంగా తెలుగు వాతావరణానికి తగ్గట్టు స్క్రిప్టును మలచాను. భానుచందర్ ఈ చిత్రంలో తన విశ్వరూపాన్ని చూపిస్తాడు," అన్నారు మౌళి. ఈయన కథ, మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో జి. వి. ఎస్. రాజు సమర్పించే విజయలక్ష్మి మూవీస్ వారి "రౌడీ పోలీస్" చిత్రంలో భానుచందర్, సత్యనారాయణ, కోట శ్రీనివాసరావు, వేలు, వీరభద్రరావు, రాధిక, కల్పన (ఇళవరసి) వగైరా నటవర్గం. రాజశ్రీ, కొత్త రచయిత విరంచివి గీతాలకు రాజన్- నాగేంద్ర స్వరకల్పన చేశారు. సుదర్శన్ భట్టాచార్య రచనా సహకారం. దేవీప్రసాద్ ఛాయ, బాలు శిల్పం, సాహుల్ సాహసాలు, రామచంద్రన్ సహకార దర్శకత్వం, డి. వెంకటరత్నం కూర్పు, డి. రాజేంద్రరాజు నిర్వహణతో ఎస్. వెంకటేశ్వరరావు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. "సెప్టెంబర్ 10-20, అక్టోబర్ 1-10, నవంబర్ 8-25 షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది." అన్నారు ఈ చిత్రాన్ని నిర్మించే జి వి జి రాజు □



సీరియల్

# సంకెళ్ళెవరికి?

డాక్టర్ కొత్త రవీంద్రబాబు

(గత సంచిక తరువాయి)

రూపకు కళ్ళ వెంట నీళ్ళు గిర్రున తిరిగాయి ఇన్ని అవస్థలు పడి సర్వం వొదులుకుని చింటూ కోసమై ఇలా వొచ్చింది! ఎలాగైనా అతడిని మంచి మార్గంలోకి తీసుకు రావాలని సభ్య ప్రపంచంలోకి తెచ్చి అంకుల్ ఆంటీల ఋణం తీర్చుకోవాలని గత కొన్ని నెలలుగా విపరీతమైన తపన పడివున్నది

తన ప్రయత్నం మొదలెట్టక ముందే తీవ్రమైన విఘాతం తగిలేట్లు వున్నది! ఇప్పుడు చింటూకేమైనా అయితే ఏ ముఖం పెట్టుకు వెళ్ళి డ్యూటీలో జేరుతుంది అంకుల్ ఆంటీలకు ఎలా ముఖం చూపిస్తుంది

తాతా! పోనీ చింటూను ఏదైనా ఆస్పత్రిలో జేర్పించితే?

ప్రవేటు డాక్టర్లెవరూ జేర్చుకోరు! గవర్నమెంటు ఆస్పత్రిలో జేరిస్తే మందుల కంటె ముందు సంకెళ్ళు వేస్తారు! అదృష్టం బాగుంది సక్రమంగా బయట పడాలే గాని ఏమాత్రం తేడా వచ్చినా కుక్క చావు తప్పదు!

చింటూ అదృష్టం బాగాలేదు! అంతా ప్లాన్ ప్రకారం బాగానే జరిగి పోయింది యాభై వేల డబ్బు గాక రెండు లక్షల విలువ చేసే నగలు దొరికాయి! కాని జాతిరత్నం లాంటి చింటూ చేయి జారిపోయేట్లున్నాడు'

'తాతా' అంతే నంటావా? అలా అయితే దోచుకవచ్చిన యీ డబ్బుకు విలువేముంటుంది? మనకు వుపయోగపడని డబ్బు వుండి ఏం ప్రయోజనం?'

తెల్లవారే వరకూ రూప తాతతో మాట్లాడుతూ చింటూ వంటి మీద చేయి వేసి చూస్తూ జాగారం చేసింది

తెల్లవారిన తర్వాత చింటూకు వణుకు ఎక్కువయింది సంధిప్రేలాపన మొదలయింది 'రాణీ! నీకు రవ్వల నెక్లెస్ ఇస్తా. .!" ఏమిటేమిటో అర్ధం లేని మాటలు మాట్లాడటం మొదలెట్టాడు ఛమేలీ అతని మంచం పక్క కూర్చుని వెక్కి వెక్కి ఏడ్వసాగింది మణి దిగాలు పడి మంచం దగ్గర కూర్చుండి పోయింది గూడెంలో చిన్నా పెద్దా అంతా ఒకరి తర్వాత వొకరు వచ్చి అతన్ని చూసి వెళ్ళసాగారు

రూప ఇక వుండబట్టలేక పోయింది

తాతా! చింటూను ఎలాగయినా ఆస్పత్రిలో జేర్పించాలి! ఇలా వుంటే ఇంకా ఎంతో కాలం బతకడు అంది

"కాని ఎలాగ తీసుకు వెళ్ళాలి! వెంబడి మనం ఎవరం వెళ్ళినా పోలీసులు వచ్చి ముట్టడి వేస్తారే ?

దానికి ఆలోచించాను! చింటూకు గళ్ళలుంగి లాల్చీ వేద్దాం! నేను తురక పిల్లలా బురఖా తగిలించు కుంటాను టాక్సీలో రామనాధపురం వెళ్ళి అక్కడ టాక్సీ మారి మధుర వెళతాను ఎవరయినా ప్రయివేటు డాక్టరుగారి నర్సింగ్ హోమ్‌లో జేర్పించి సరయిన వైద్యం జరిగేట్లు చూస్తాను! ఆ పైన అదృష్టం ఎలా వుంటే అలా జరుగుతుంది'. కనుగొలుకుల నుండి జారే నీరు తుడుచుకుంటూ అంది రూప

నేనూ వస్తా! వాడిని వదలి వుండలేను అంది ఛమేలీ!

'నేనూ వస్తా'! అంది మణి

సరిపోయె! మీ ఇద్దరూ వెళ్తే పోలీసులు వెంట బడి తరుముతారు రాణి ఇంకా ఇక్కడ పోలీసులకు బాగా తెలియదు గనుక బురఖా తగిలించుకుంటే ఏమైనా పోలీసుల కండ్లు గప్పుతుందేమో'? అన్నాడు తాత

అక్కడ జేరిన వాళ్ళు కూడా 'రాణి ప్లాను బాగుంది ఇక్కడే వుంటే వాతం కమ్మి చనిపోయేట్లున్నాడు అల్సేషియన్ కుక్క కోరలు బాగా లోతుగా దిగబడ్డాయి" అన్నారు

అరగంటలో టాక్సీ వచ్చి యింటి ముందాగింది టాక్సీవాడు రసూల్ నమ్మకస్తుడు. తాత, చింటూ మనుషులను రహస్యంగా తన కారులో అటూ యిటూ జేరవేస్తూ వుంటాడు ఏ పరిస్తితులలోను వీళ్ళ విషయాలు పోలీసులకు తెలియ జేయడనే గురి వున్నది అతనిమీద.

గళ్ళ లుంగి లాల్చీ వేసి స్పృహలేని చింటూని టాక్సీ వెనక సీటులో పడుకోబెట్టారు అతని తల తన వడిలో వుంచుకుని రూప కూర్చునివుంది ఆమె ముఖానికి బురఖా తగిలించుకుని వున్నది!

టాక్సీ వెంబడే గ్రామ ప్రజలంతా నడచి వచ్చి సాగనంపారు ఛమేలీ, మణి వెక్కి వెక్కి ఏడ్వసాగారు మెయిన్ రోడ్డు వరకూ వచ్చారువారు అక్కడ నుండి టాక్సీ స్పీడ్ పెంచేసాడు రసూల్

దారిలో ఒక చోట పోలీస్ చెక్‌పోస్ట్ వద్ద టాక్సీ ఆపారు పోలీసులు

"రహమాన్‌మియాకు కలరా బేదులు వచ్చి డీలాపడిపోయాడు అర్జంటుగా ఆస్పత్రికి వేసుకు వెళుతున్నాను వస్తారా? మీరు కూడా రండి తీసుకు వెళతాను" అన్నాడు రసూల్ కాన్‌స్టేబిల్స్‌తో!

వాళ్ళు "ఛ! చ! వెళ్ళు వెళ్ళు మేము దొంగలు ఎవరైనా టాక్సీలో పారిపోతున్నారేమోనని చెకింగ్‌కు ఆపాము కలరా రోగి పక్కన కూర్చుని మమ్మల్ని రమ్మంటావా'? అన్నారు

ఇంతలో రూప "ఆవ్! ఆవ్" అంటూ డోకు వచ్చినట్లు శబ్దం చేయసాగింది

రసూల్ అదుగో బాభికి కూడా వాంతులు కలరా వచ్చింది అంటురోగం కదా' అన్నాడు

వెళ్ళు! వెళ్ళు! జల్దీజావ్! ఇక్కడే వున్నావంటే నీకు మాకు కూడా కలరా వస్తుంది" అన్నారు

క్లియరెన్సు ఇవ్వటంతో కారు తారురోడ్డున సర్రున దూసుకుని పోయింది

రూప మనసులో ఆలోచనలు కారుకంటే వేగంగా పరిగెత్త సాగాయి చింటూని తీసుకుని అంకుల్ ఆంటీల దగ్గరకు వెళ్ళిపోతే?

అదృష్ట వశాత్తు అతను ప్రమాదం నుండి బయట పడ్డా అతను కొత్త వాతావరణంలో ఇమడగలడా? అతన్ని మార్చకుండా, అతనిలో పరివర్తన

జరిగిన కథ-11. రూప కోసం తీవ్రంగా వెదకమని కాలముత్తుతో చెప్తాడు తంగవేలు ఛమేలి, రూపలతో వేరే జిల్లాలో ఉన్న సుబ్రమణ్యం తాత దగ్గరకు చేరుతాడు చింటూ కోటి చెట్టి ఇంట్లో దొంగతనం చేయాల్సిన బాధ్యతని చింటూకి అప్పగిస్తాడు సుబ్రమణ్యం తాత రంగ, రూప, శారంగపాణి, అయ్యప్పలను కూడా తీసుకువెళ్లి చెట్టి ఇంట్లో నగలు, డబ్బు దొంగలించుకుని వస్తాడు చింటూ చెట్టి ఇంట్లో అల్షియేషన్ కుక్క చేసిన గాయాలవల్ల చింటూకి ప్రమాదకరమైన శీత జ్వరం వచ్చింది చింటూ పరిస్థితి చూసిన రూపకు మనసులో భయం ఎక్కువయింది

తేకుండా, ఇంటికి తీసుకు వెళ్ళినందు వలన ప్రయోజనం వుండదు! అతన్ని మార్చాలి! అతని చుట్టూ వుండే వారిని మార్చాలి! అప్పుడు గాని అతన్ని ఇంటికి తీసుకు వెళ్ళి నందువల్ల ప్రయోజనం వుండదు!

రామనాథపురంలో రసూల్ టాక్సీ మారి వేరే టాక్సీలో ఎక్కింది రూప. కట్టెలా పడివున్న చింటూను తెచ్చి వెనక సీటులో పడుకో బెట్టారు. అతని శరీరం బాగా శీతలం గమ్మి వున్నది!

టాక్సీ మధుర జేరేంత వరకూ రూప మనసు-మనసులో లేదు! వాకబు చేసి టాక్సీని "మీనాక్షి నర్సింగ్ హోమ్" వద్దకు పోనిమ్మంది. ఆ పట్టణంలో అదే పెద్ద నర్సింగ్‌హోమ్!

"డాక్టర్ సాబ్! మా ఆయన్నకు రెండు రోజుల నాడు కుక్క పీకింది. వకటే జ్వరం! చలి! స్పృహలో లేదు. ఎన్ని రూపాయలయినా పరవాలేదు! ఆయన్ని బతికించండి" రెండు చేత్తులూ జోడించి దణ్ణం పెడుతూ ప్రార్థించింది డాక్టర్ సుందరాన్ని!

"ఇట్ యీజ్ ఎకేస్ ఆఫ్ సెప్టిసీమియా! కనీసం ఎ. టి. యస్ ఇంజక్షన్ అయినా చేసారా మీ వూర్లో? ఇనాళ్ళు ఏం చేసావమ్మా, ఇలా ముదిరి పోయిందాకా"? అన్నాడు డాక్టర్ సుందరం!

"పల్లెటూళ్ళో మాకేం తెలుస్తాయి! మీ పేరు విని ఇక్కడకు వచ్చాను" అంది రూప.

"సరే! నా మీద అంత నమ్మకం పెట్టుకు వచ్చావు గనుక నా ప్రయత్నం నేను చేస్తాను" అంటూ నర్సును కేక వేసి చింటూను స్పెషల్ రూమ్‌లో జేర్పించాడు. వళ్ళంతా స్పిరిట్‌తో క్లీన్ చేయించి జబ్బమీద వున్న గాయాన్ని శుభపరచి ఏంటీసెప్టిక్ ఆయింట్ మెంట్ వేసి కట్టు కట్టాడు.

ఇంజక్షన్లు చేయించి సెలైన్ డ్రిప్ పెట్టించాడు. ఇన్ని చేసినా చింటూలో చలనం లేదు! ఉండీ వుండీ వులిక్కి పడుతున్నాడు. వంట్లో వున్న కండరాలు అప్రయత్నంగా కొట్టుకుంటూ వున్నాయి. వంటికి వేడి ఏ మాత్రం రాలేదు. టెంపరేచర్ చూస్తే 96° పారెన్ హీట్ వుంది.

"జ్వరం 106° వున్నా పర్వాలేదు గాని ఇలా 96° వుంటే ప్రమాదం" నర్సు తనలో గొణుక్కోవడం వినగానే రూపకు ఆందోళన ఎక్కువయింది.

అరగంట వున్నాక డాక్టరు సుందరం వస్తే "సార్! ఆయన్ను చూస్తే నాకు భయంగా వుంది"! అన్నది.

ఆయన చింటూని పరీక్షచేసి. "ఏమీ మార్పు రాలేదు! ఒక సీసా రక్తం ఎక్కించి చూద్దాం" అన్నాడు.

"అలాగే సార్! వెంటనే ఎక్కించండి"



# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

**ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ, యితర రచనలు పంపదలచుకున్నవారు**

**సంపాదకుడు,**
**ఆంధ్రసచిత్ర వారపత్రిక,**
**గాంధీనగరం, విజయవాడ-520 003.**
**అన్న చిరునామాకి వ్రాయాలి.**

★ కవరుమీద శీర్షికపేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ, చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి — హామీపత్రం జతచెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునే వారు — వారి స్వంత చిరునామాగల తగినన్ని తపాలాబిళ్ల లంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనేగాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటి పై నిర్ణయంకోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు. కాని— తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు — రచన పేరు — అది పంపినతేదీ, వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామాగల తగినన్ని తపాలాబిళ్ళలంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్‌లు పంపేవారుకూడా ఎనిమిది వారాలలోగా మా మీద ఉత్తరాలదాడి చెయ్యకూడదు ... ప్రతీ కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి.

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్‌ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ రచనల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలువెంబడి జరుగుతుంది

★ రచయితలకు, కార్టూనిస్టులకు [ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పడ్డ' వారికి తప్ప తతిమ్మా అందరికి] అవి పడ్డ ''ప్రతు''లను — కాలక్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలో పోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు.

సం॥

## సంకెళ్లెవరికి?

చుట్టూరా చూసి ఎవరూ లేరో మరి రక్తం ఎవరు ఇస్తారు! మీ బంధువులకు కబురు పెట్టండి

ఎందుకు సార్! నేను వున్నాగదా! నా రక్తం పరీక్ష చేసి చూడండి! పనికి వస్తే తీసుకోండి

ఎవరూ మీ దగ్గర లేరు నువ్వే రక్తం యిస్తే తర్వాత నీరసం వస్తుంది! రోగిని ఎలా చూడగలవు ?

పర్వాలేదు! ఈ యాస్మిన్ భర్త బ్రతకాలే గాని ఎన్ని సీసాల రక్తం అయినా యిస్తుంది

సరేనమ్మా యాస్మిన్! నర్స్ యాస్మిన్ బ్లడ్ గ్రూప్, రోగి బ్లడ్ గ్రూప్ చూడటానికి ఏర్పాట్లు చేయి

ఇద్దరి రక్తం పరీక్ష చేసి హండ్రెడ్ పర్సెంట్ సర్‌ప్రయిజ్! మీ ఇద్దరిదీ బినెగిటివ్ గ్రూపే! భార్యా భర్తలిద్దరిదీ ఒకే గ్రూప్ అవడం అందులోనూ బినెగిటివ్ లాంటి అరుదైన గ్రూప్ కావటం విశేషం! మీరు ఇవ్వనని అన్నా మీ రక్తం తీసుకోక తప్పదు! ఎందుకంటే బినెగిటివ్ బ్లడ్ ఇవ్వగల డోనర్సు యీ ప్రాంతాలలో ఎవరూ లేరు

బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూషన్ ఏర్పాట్లు చురుకుగా చేసారు నర్సులు రూప మోచేతిపైభాగంలో టూర్నికే కట్టారు దబ్బనం లాంటి సూది తెచ్చి మోచేతి దగ్గర వుబ్బివున్న సిరలో కటిక్కున గుచ్చింది నర్స్! పళ్ళు బిగబట్టి బాధవోర్చుకుంది రూప చేతి వేళ్ళ మధ్య గాజ్‌రోల్ వుంచి వేళ్ళను ముడుస్తూ చాపుతూ వుండమంటే అలాగే చేస్తూ వచ్చింది రూప

నల్లటి చిక్కటి రక్తం, మనిషి ప్రాణాన్ని నిలపటానికి అవసరమైన ద్రవం, నెమ్మదిగా ట్యూబ్ గుండా వెళ్లి కిందసీసాలో వున్న సిట్రేట్ సొల్యూషన్‌లో పడుతుంటే రూపకు నీరసం అనిపించడం లేదు ఏదో ఒక విధమైన మానసిక తృప్తి! చింటూ ప్రాణాలు కాపాడటానికి నా చేతనైనంతా చేస్తున్నానన్న మానసిక తృప్తి అది! సీసా దాదాపు మూడొంతులు నిండాక రూప మోచేతి దగ్గర సూది లాగేసింది నర్స్! రూప లేవబోతుంటే

వద్దమ్మా వద్దు! అప్పుడే లేవకు ఒకోసారి కళ్ళు తిరుగుతాయి అంది నర్స్

'పరవాలేదమ్మా! నాకేం నిరసంగా లేదు! అవతల ఆయన వొక్కడే వున్నాడు వస్తాను అంటూ నర్స్ వెంటే చింటూ వున్న గదిలోకి వెళ్ళింది రూప

తన రక్తం ఒకోచుక్కా చింటూ వంట్లోకి ఎక్కుతుంటే రూప మనసులో ఒక విధమైన తృప్తి కలుగసాగింది. కాని అంతలోనే ఏదో అనుమానం వచ్చి

"ఏమ్మా? ఈ రక్తం సీసా ఎక్కగానే ఆయనకు నయమవుతుందా"? అని పక్కనున్న నర్సును అడిగింది

ఏమోనమ్మా ఎలా చెబుతాం! రక్తం యివ్వగానే మనిషి బ్రతికితే ఇక మరణా లెందుకు వుంటాయి'?

అలాగా!" రూపకు ఒక్క సారిగా మనసులో శరీరంలో ఏదో నీరసం ముంచెత్తుకొచ్చింది చుట్టూవున్న వస్తువులన్నీ గిర్రున తిరిగినట్లయి ఒక్క సారిగా దబ్‌మని కిందపడి పోయింది

కండ్లు తెరిచి చూస్తే హాస్పటల్ మంచం మీద పడుకుని వున్నది. చుట్టూ నర్సులు నిలబడి వున్నారు

డాక్టర్ సుందరం "విశ్రాంతి తీసుకోమ్మా బాగా అలసి పోయి వున్నావు" అంటూ వెళ్ళి పోయాడు.

"పాపం ఎన్ని రోజులయిందో నిద్ర పోయి! రక్తం ఇచ్చే సరికి నీరస పడి పోయింది" అన్నది ఒకనర్స్.

"ఆయన కెలా వుంది"?

'రక్తం ఎక్కిస్తున్నారు గదా! పరిస్థితి మెరుగవుతుంది' ఇందాక "ఏమో? ఎలా చెబుతాం ? అన్న నర్సే ఆ మాటలు అంది

అంత నీరసంలోనూ నవ్వు వచ్చింది రూపకు బత్తాయి రసం, హార్లిక్స్ యిస్తే తాగింది కాసేపటికి నీరసం తగ్గిపోయి లేచి కూర్చుంది రూప

నర్సులు వద్దంటున్నా వినకుండా వెళ్ళి చింటూ మంచం దగ్గర కూర్చుంది. "నాకు ఇక్కడ వుంటేనే బాగుంటుందమ్మా' అంటూ!

చింటూ నుదిటి మీద చేయి వేసి చూచింది రూప! 'పెనంలా కాలిపోతున్నది'

బాగా జ్వరం వచ్చినట్లుంది! చూడండి' అంటే నర్స్ వచ్చి టెంపరేచర్ చూసి అరె! నూట ఆరు డిగ్రీలున్నది ' అంటూ డాక్టరుగారి కోసం పరిగెత్తింది

డాక్టర్ సుందరం ఆమె వెంటే వచ్చి నాడి చూచి స్టెతస్కోప్‌తో హార్ట్, లంగ్సు పరీక్ష చేసి

జ్వరం బాగా ఎక్కువగా వచ్చింది! ఈ నీరస స్థితిలో మరలా ఇదొక అవాంతరం!

అయితే ఒక సుగుణం వున్నది జ్వరం వొచ్చిందంటే ఇంకా అతని శరీరం మృత్యువుతో పోరాడు తున్నదన్న మాట ఇందాకటి వరకు అతని శరీరం దిగ్భ్రాంతిపోయి సొమ్మసిల్లి, పోరాటానికి శక్తి లేక నిశ్శబ్దపడి పోయి వున్నది. ఇప్పుడు నీ రక్తం, మహిమ వల్లనేమో అన్ని శక్తులూ కూడగట్టుకుని జబ్బుతో పోరాడుతున్నది అతని శరీరం' అని రూపతో అన్నాడు'

అతని సైగ గమనించి నర్సులు చింటూ నుదిటి మీద ఐస్ బాగ్ వుంచి, వళ్ళంతా చల్లని నీటిలో ముంచిన గుడ్డతో తుడవసాగారు. అలా అరగంట సేపు చేసాక జ్వరం నూట నాలుగు డిగ్రీలకు వచ్చింది!

తెల్లవారే వరకూ ప్రతి అరగంటకూ జ్వరం చూస్తుండండి నూట నాలుగు దాటినప్పుడల్లా తడిగుడ్డతో వళ్ళు తుడుస్తుండండి అంటూ వెళ్ళిపోయాడు సుందరం!

నర్సు పన్నెండు గంటల వరకూ డాక్టర్ చెప్పినట్లు చేసి ఆ తర్వాత కుర్చీ మీద కునుకు తీయసాగింది.

ఆ తర్వాత మళ్ళీ ఆమె నాలుగు గంటలకు లేచే వరకూ రూప జ్వరం చూస్తూ వళ్ళు తుడుస్తూ గడిపింది

చింటూ మధ్య మధ్య 'రాణీ! రాణీ'! అంటూ పలవరిస్తుంటే ఉలికిపడ సాగింది రూప

తెల్లవారేసరికి జ్వరం నూట నాలుగు మీద నిలబడి పోయింది!

డాక్టర్ సుందరం వచ్చి చూచి "పరవాలేదు! గుడ్డిలో మెల్ల నిన్నటి కంటె పరిస్థితి విషమించలేదు! అదే ఆశగా వున్నది ' అన్నాడు

ఆ పగలూ, రాత్రీ కూడా జ్వరం నూట నాలుగు మీద నిలబడి పోయి వున్నది

నర్సులు 'వెళ్ళమ్మా! వెళ్ళి విశ్రాంతి తీసుకో! మేము చూస్తాంగా'! అన్నా వినకుండా మంచం పక్కనే వుండి పోయి చింటూకు పరిచర్యలు చేయసాగింది

నర్సుల సాయంతో అతని బట్టలు మార్చడం, వళ్ళు శుభ్రం చేయడం, పండ్లు క్లీన్ చేసి తలదువ్వడం ఆమెలో ఏదో వింత అనుభూతిని, మానసిక తృప్తిని కలిగించాయి.

భుజం మీద గాయానికి కట్టు కట్టి "పరవాలేదు గాయం ఎర్రవుండు పడింది"! అన్నాడు డాక్టర్ సుందరం

మరుసటి రోజుకు జ్వరం నూట రెండుకు వచ్చింది చింటూ కళ్ళు తెరచి చుట్టూ చూడసాగాడు రూప వైపు అతని చూపు మరలినప్పుడు కండ్లలో గుర్తుపట్టినట్లు ప్రసన్న భావం ఏదో తళుకు మంటున్నది! రూప కండ్లలో సంతృప్తి చూచి ముసి ముసి నవ్వులు నవ్వుకున్నారు నర్సులు

కొద్ది కొద్దిగా కాఫీ, హార్లిక్సు పట్టమన్నారు డాక్టర్ సుందరం! నెమ్మదిగా ఒకో చెంచా కాఫీ అతని నోట్లో పోస్తుంటే గుటక వేయసాగాడు చింటూ! అతని కళ్ళు తదేకంగా రూప ముఖం వంకే చూస్తూ వుండి పోయాయి!

(ఇంకావుంది)

"ఆంధ్రపత్రిక పాఠకులకి చక్కటి అవకాశం!

# కళ్యాణవేదిక

ఉచిత సమాచారం

## వధూవరుల సమాచారము వుచితంగా ప్రతి బుధవారం ప్రకటిస్తాము. సమాచారం పంపేవారు ఈ దిగువ నిబంధనలు పాటించాలి.

★ వధువు / వరునికి సంబంధించిన వివరాలు సమగ్రంగా, అచ్చులో 150 అక్షరాలకు మించనట్లుగా తెలుగులోనే స్పష్టంగా వ్రాసి పంపాలి.

★ వధువు / వరుని తల్లిదండ్రులు, సంరక్షకులు తాము యిచ్చే సమాచారము వాస్తవమని, ఎవరిని కించపర్చే విషయము అందులో లేదని హామీ ఇవ్వాలి.

★ సమాచారం పంపేవారి పేర్లు మా వద్ద రహస్యంగానే వుంచబడతాయి. ప్రతి ప్రకటనకు ఒక బాక్సు నెంబరు కేటాయించి, వచ్చిన జవాబులు **వుచితంగానే** వాటికి సంబంధించినవారికి పది రోజులలోపు పంపడం జరుగుతుంది.

★ ఈ శీర్షికను కుల మత వర్గ భేదాలు లేకుండా అందరూ వుపయోగించుకోవచ్చును.

★ అందిన సమాచారము ప్రతి బుధవారం అవి అందిన వరుస క్రమంలో ప్రకటించబడుతుంది. వీటిని తిప్పి పంపే ప్రసక్తి లేదు. కావున స్వంత అడ్రసు గల కవర్లు లేదా స్టాంపులు జతపర్చకూడదు.

★ ప్రకటనను ఏదైన అనర్హమైనదిగా తోచినపుడు దానిని వెయ్యకుండా ఆపు చేసే హక్కు పత్రికకు వుంటుంది.

★ ఇతర విధములైన ఉత్తరప్రత్యుత్తరములకు అవకాశం లేదు. ఫోటోలు పంపకూడదు.

★ సమాచారము పంపేవారు ఈ దిగువ కూపను పూర్తిచేసి, స్థానిక ఏజెంటుచే సంతకం చేయించి పంపాలి. కూపను జతపర్చనియెడల పరిశీలించబడవు.

★ కళ్యాణవేదిక శీర్షికద్వారా సంబంధం కుదిరి వివాహం జరిగిన వధూవరుల ఫోటోలు ఉచితంగా ఆంధ్రపత్రికలో ప్రకటించగలము. ఏ తేదీన ప్రకటన పడినది తెలియచేస్తూ ఫోటోలు జతపర్చి "కళ్యాణవేదిక ఫోటో ప్రచురణార్థం" అని వ్రాసి పంపవలెను.

### కళ్యాణవేదిక ఉచిత సమాచార కూపను

పేరు... ... ... ... ... ... ... ... ...

చిరునామా ... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ...పిన్‌కోడ్... ... ...

స్థానిక ఆంధ్రపత్రిక ఏజెంటు సంతకం.........................

# కలువబాల లక్కీడిప్ చందాదారులకు నిబంధనలు సూచనలు.

1. చందా సైకము రు 60లు మనియార్డరు ద్వారా గాని, డిమాండు డ్రాప్టు ద్వారా గాని పంపవచ్చును
2 ఎమ్ ఒ లు పంపేవారు వారి కూపన్‌తో పాటు, ఎమ్ ఒ పంపిన తేదీ తెలుపుతూ, దాని రశీదు జతచేసి మరీ కూపన్ పంపాలి లేదా డి డి ని కూపన్‌తో జతచేయాలి
3 చందా భారత దేశంలో వున్న వారెవరైనా కట్టవచ్చును.
4 చందా సైకము నేరుగా విజయవాడ, ఆంధ్రపత్రిక కార్యాలయంలో కూడా కట్టవచ్చును
5 ఎమ్ ఒ లు, డి డి లు వ్యక్తుల పేర పంపించకూడదు
6 కూపన్‌లు రిజిష్టర్డు పోస్టులో పంపరాదు లక్కీడిప్ గడువు పూర్తి అయిన తర్వాత యిందులో పాల్గొన్న చందాదారులకు చీట్లుతీసి, పైన తెలిపిన బహుమతులను ప్రకటించుతాము. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు
7. కూపన్‌మీద, మనియార్డరు కూపన్ మీదా కూడా పంపేవారి పేరు, చిరునామా స్పష్టంగా, పూర్తిగా వ్రాయాలి. వారు ఇదివరకే చందాదారులైతే కూడా, వారి స్నేహితులెవరికైనా, "కలువబాల" చందాను బహుమతిగా కట్టవచ్చును డి డి లు "ఆంధ్రపత్రిక- విజయవాడ-3" పేర తీసుకొని పంపించాలి

కత్తిరించాలి



నిజమయితే ✓
కాక పోతే X
అని గుర్తు పెట్టాలి

ఆంధ్రపత్రిక బొంబాయి నుంచి వెలువడుతూ వుండేది. ( )

దినపత్రిక కన్నా వారపత్రిక ముందే పుట్టింది. ( )

"భారతి" సాహితీప్రియుల పక్ష పత్రిక ( )

బాలరంజని పిల్లల పత్రిక ఆంధ్రపత్రిక ప్రచురణ ( )

కలువబాల చందాదారుల 'లక్కీడిప్' చందా కట్టిన వారి పూర్తి పేరు :..............................

..............................

చిరునామా :..............................

..............................

..............................

ఎమ్ ఒ పంపిన తేదీ. ..............................

లేదా

డి. డి జత చేయడమైనది.

8. "లక్కీడిప్" 1-11-1986 లేదా ఆ లోపల కట్టే చందాలకి మాత్రమే వర్తిస్తుంది.
కూపన్‌లు, చందాలు పంపవలసిన చిరునామా :
కలువబాల, కేరాఫ్; ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ-3కి పంపాలి.

9. ఈ పథకంలో పాల్గొనే వారికి స్థానిక ఏజెంట్ ద్వారా పత్రిక సప్లయి చేస్తాము.
గమనిక: ఏజెంట్ లేనిచోట పోస్టులో పంపిస్తాము.

10. ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు, వారి బంధువులు ఈ లక్కీ డిప్‌తో పాల్గొనరాదు.

ఎక్కడో దూరంగా ఏదో మధురంగా మేలుకొలుపు పాడుతున్నట్లుగా మెలకువ వచ్చింది రవీంద్రకి. అప్పుడప్పుడే మసక చీకటి తెరలు తొలగుతూ బాలభానుని లేలేత కిరణాలు సున్నితంగా స్పృశించబోతున్నాయి అప్పుడే కనులు తెరుస్తున్న లోకాన్ని.

వసంతకాలం వచ్చిందంటూ ప్రపంచానికి చాటి చెప్తూ దూరంగా పొగడ చెట్టుపై మధురాతి మధురంగా గానం చేస్తున్నాయి ఎక్కడెక్కడి నుంచో వచ్చి చేరిన రకరకాల పక్షి సమూహం.

అతి కష్టంపై కాస్త పైకి జరిగి దిండు కానుకుని కూర్చుంటూ కిటికీ తెరలు కాస్త తొలగించి రాత్రి మంచులో తడిసిన ప్రకృతి అందాన్ని తిలకిస్తూ నిన్న సాయంత్రం విన్న కోయిల గానాన్ని మననం చేసుకోసాగాడు. మామిడి చిగుర్లు తింటూ మత్తెక్కిన కోయిల "వసంత కాలపు తొలి ఆగమనం" అంటూ పాడ సాగింది. చాలా మందికి అది మామూలు కోయిల పాట. ఏదో కోయిల కూస్తోంది అంటారు. అంతే. కానీ తనకు మాత్రమే తెల్సు ఆ పాటలోని అర్థం.

సరిగ్గా పది సంవత్సరాల క్రితం అచ్చం ఇలాంటి వసంత కాలపు తొలి ఉషోదయం లోనే వ్యర్థమనుకున్న జీవితంలోనూ అర్థముందంటూ, చీకటి నిండిన భవిష్యత్తులోనూ వెలుగు లేకపోలేదంటూ, ప్రకృతి అందాలకు పరవశించడం, కలకూజితాల స్వరాలకు సాహిత్యాలు చెప్పు కోవడం లాంటి పాఠాలు నేర్పడం మొదలెట్టింది డెయిజీ.

హవుస్ సర్జన్సీ కాగానే ఇంగ్లండ్ రమ్మంటూ వ్రాశాడు అంతకుముందే ఇంగ్లండ్‌లో సెటిలయిన అన్నయ్య. తనకూ ఇంటరెస్టింగ్ గానే అన్పించింది ఇంగ్లండ్ వెళ్ళాలంటే. అమ్మా నాన్నా తామే అయి పెంచి ఇంతవాడిని చేసిన అన్నా వదినలను చాలా రోజుల తర్వాత కల్సుకోబోతున్నందుకు అంతులేని ఆనందంగా ఉంది. ఓ పది రోజులు కబుర్లతోను, లండన్‌లో చూడాల్సిన ప్రదేశాలు దర్శించడం తోను పది క్షణాల్లా గడిచి పోయాయి. ఆ తర్వాత అన్నయ్యే ఏవైనా జాబ్స్ కోసం అప్లై చేసుకోమంటూ బ్రిటిష్ మెడికల్ జర్నల్ తెచ్చిచ్చాడు.

లండన్‌లో ఓ టీచింగ్ హాస్పిటల్‌లో ఇంటర్వ్యూ రావడం, సెలెక్ట్ కావడం అన్నీ క్షణాల్లో జరిగి పోయాయి.

అంత త్వరగా అలాంటి హాస్పిటల్‌లో జాబ్ రావడం తన అదృష్టమంటూ మురిసి పోయారు అన్నావదిన లిద్దరూ. అలాంటి అన్నావదినలున్న తన అదృష్టానికి తనే గర్వపడుతుండగా విధి చూడలేక తన గర్వం అణచాలనుకుంది.

ఆ రోజే జాబ్‌లో జాయినయ్యే రోజు. తను ట్రెయిన్‌లో వెళ్తానన్నా వినకుండా ఇద్దరూ సెలవు పెట్టి కార్‌లో బయల్దేరారు తనను తీసుకుని. ఫిబ్రవరి నెల అయినా ఇంగ్లండ్‌లో మిడ్ వింటర్ అన్నమాట. వేళ్ళ కొనలు, ముక్కు, చెవులు స్పర్శాజ్ఞానం కోల్పోయి నొప్పి పెట్టేంత చలి. కార్లో హీటింగ్, పై నుండి ఓ టన్ను బరువుండే ఓవర్‌కోట్ వేసుకున్నా కొంకర్లు పోయేంత చలి. కార్ స్టార్టయిన ఓ అరగంటకు గానీ తెలీలేదు హీటింగ్ పెచ్చుదనం. దానికి తోడు హెడ్ లైట్లు వేసినా రోడ్డు కూడా కన్పించకుండా పొగమంచు. చాలా తక్కువ స్పీడ్‌లో చాలా జాగ్రత్తగా డ్రైవ్ చేయసాగాడు అన్నయ్య. ఎ12 డ్యుయల్ క్యారేజ్ వే లోంచి మోటార్ వేలో జాయినయ్యారు. వరుసగా నాలుగు లేన్లు అంటే నాలుగు కార్లు ఒకేసారి ప్రక్క ప్రక్కగా ఒకే వేపు ప్రయాణం చెయ్యొచ్చన్నమాట. అసలు స్పీడ్ లిమిట్ 70 మైళ్ళవరకూ, కానీ ఇంగ్లండ్ వెదర్ ఎప్పుడూ నమ్మలేం. ఆ పొగమంచుకి మాక్సిమమ్ స్పీడ్ లిమిట్ 40 మైళ్ళు మాత్రమే అంటూ వార్నింగ్ సిగ్నల్స్ చూపించసాగాయి.

ఆ తెల్లని పొగమంచులో ఏం కన్పించకుండా నక్షత్రాల్లా ముందు కార్ ఉంది జాగ్రత్త అంటూ వార్నింగ్ ఇస్తున్న మరో కార్ ఫాగ్ లైట్స్ మాత్రం దూరంగా కన్పిస్తూ ఏదో మబ్బుల్లోంచి దూసుకు పోతున్నట్లుగా గమ్మత్తుగా అన్పించసాగింది.

హఠాత్తుగా చెవులు బ్రద్దలయేలాంటి భయంకర శబ్దం, కళ్ళముందు మెరుపులు మిరుమిట్లు గొలిపి మాయమయి అంతా చీకటి అలముకుంది అంతే. ఆ తర్వాత కళ్ళకు కన్పించింది హాస్పిటల్ వాతావరణం. తన రెండు కాళ్ళూ ప్లాస్టర్లు, కట్లుతో నిండి జీవచ్ఛవంలా బెడ్‌పై పడివున్న తన శరీరం. ఒక్క



# 'జీవితాన్ని జీవించు'

## మాచర్ల హేమ

క్షణంలో అంతా అర్థమయినా ప్రశ్నార్థకంగా బెడ్ కిరువైపులా ఒకరు తలకి, ఒకరు చేతికి చిన్న చిన్న కట్లుతో దీనవదనులై కూర్చున్న అన్నా వదినల వేపు చూశాడు. అన్నయ్య తప్పు చేసినవాడిలా చెమర్చిన కళ్ళతో తల దించుకున్నాడు. వదిన నీళ్ళు నిండిన కళ్ళు ఈ విషాదం భరించలేమన్నట్లుగా జలజలా కురిశాయి.

రెండు కాళ్ళూ జీవం లేకుండా వీల్‌చేరే శరణ్యమయి ఒక్క క్షణంలో తన కళ్ళముందే తను జీవితం గురించి నిర్మించుకున్న కలల రమ్యహర్మ్యాలన్నీ కుప్పకూలిపోగా మనసంతా శూన్యంగా మూగవోయిన మౌనిలా తయారయ్యాడు. అన్నయ్యా, వదినా ఎంత ప్రయత్నించినా తన నోటి నుండి ఒక్క మాటా పలికించలేక పోయారు. శూన్యం లోంచి చూపూ మరల్చలేక పోయారు.

కనీసం వాతావరణం మార్పుతోనైనా కాస్త మామూలుగా కాగల్గుతాడనుకుని లండన్‌కు కాస్త దూరంగా "నార్త్‌వీల్డ్" అనే అతి చిన్న పల్లెటూరిలో ఓ చిన్న కాటేజ్ రెంట్‌కి తీసుకుని రెండు నెలలు ఇద్దరూ సెలవుపెట్టి అహర్నిశలూ తననే కనిపెట్టుకుని ఉండసాగారు.

లండన్ నగరపు హడావుడి, వేగం చూసింతర్వాత నార్త్‌వీల్డ్ చూస్తే అలాంటి స్థితిలో కూడా వింతగా అన్పించింది తనకి. తుఫాను సమయంలో సాగరం లోని అలల తాకిడికి అలవాటు పడిన చేపపిల్ల నిశ్చలంగా నిలిచిన సరస్సులోకి వచ్చిన అనుభూతి కల్గింది.

అచ్చం ఇండియాలోని అతి చిన్న పల్లెటూరిలా ఉంది. కాకపోతే చాలా పరిశుభ్రంగా తీర్చిదిద్దినట్లున్న ఇళ్ళు, పూల చెట్లు, ఊరి చుట్టూ చిన్న చిన్న కొండలుతో అందంగా ఉంది.

దాదాపు నెల రోజులవరకూ తన రూమ్ దాటి బయటికే వెళ్ళలేదు. ఆ రోజు రాత్రి ఎప్పటిలాగే చీకటి నిండిన ఆలోచనలు ముసురుకుంటూ సరిగా నిద్రే పట్టలేదు. ఏ తెల్లవారు ఝామునో కాస్త నిద్రపట్టబోతుండగా ఇలాగే "బ్లాక్ బర్డ్" కూతతో మెలకువ వచ్చేసింది. పాడు బ్లాక్‌బర్డ్, నిద్రంతా పాడు చేసిందని విసుక్కుంటూ అతి కష్టంపై కాస్త పైకి జరిగి ఇలాగే దిండుకానుకుని కూర్చుంటూ విండో కర్టెన్స్ కాస్త తొలగించాడు. చీకటిని పారద్రోలుతూ పలుచని వెలుతురు గదంతా అలముకుంది. ఇంకా పడుకోవాలన్పించక పైనుండి మంచం మధ్యలోకి వ్రేలాడుతున్న స్ప్రింగ్‌కి తగలకుండా అతి జాగ్రత్తగా ప్రక్కనే ఉన్న వీల్ చేర్‌లోకి అతి ప్రయత్నంపై పళ్ళ బిగువున నొప్పిని భరిస్తూ చేరి మెల్లిగా బ్రేక్ తీసి బాత్‌రూమ్ వేపు నిశ్శబ్దంగా దారి తీశాడు. పాపం పగలంతా చేసే సేవ చాలదనుకొని రాత్రిళ్ళు అవసరమైతే పిలవమంటూ ఓ బెల్ ఏర్పాటు చేశాడు. ఆ స్ప్రింగ్ లాగితే పెద్దగా గంట మ్రోగేలా. అయినా తనకెంత సిగ్గుగా ఉందని వాళ్ళిద్దరితో అలా సేవలు చేయించుకుంటుంటే.

వాళ్ళవల్లే ఈ ప్రమాదం వాటిల్లింది కదా అని కుమిలిపోతున్నారిద్దరూ. ఎవరివల్లా కాదు, ఎవరి తప్పూ కాదు కేవలం విధి లిఖితం, ఇంగ్లండ్ వెదర్ వలన, ఆ పొగమంచు వలన ఇలా జరిగిందని ఎంత ప్రయత్నించినా వాళ్ళను ఒప్పించలేక పోతున్నాడు. చివరికి ఆ ఆక్సిడెంట్‌కి గురైన మరో మూడు కార్లల్లో వాళ్ళు ఏ అపాయం లేకుండా ప్రాణాలతో బయటపడిన వాళ్ళు పదగా మిగిలిన వాళ్ళు ప్రాణాలే కోల్పోయారు. ఇంకా తను ప్రాణాలతో బయట పడడం అదృష్టం కాదూ అంటూ ఓదార్చ ప్రయత్నించాడు. మనసులో మాత్రం అప్పుడే అక్కడే ప్రాణాలు కోల్పోయే అదృష్టం తనకు లేదు కదా అని వాపోతూ.

ఎవరినీ లేపొద్దనే ఉద్దేశ్యంతో నిశ్శబ్దంగా కాలకృత్యాలు ముగించుకుని వచ్చి, టీ కావాలన్పించి కిచెన్‌లోకి వెళ్ళాడు. తనెప్పుడూ ఇంతవరకు కిచెన్ ఎలా ఉంటుందో చూడలేదు.

కెటిల్‌లో చూస్తే నీళ్ళు లేవు. ఎంత ప్రయత్నించినా సింక్ దగ్గర ట్యాప్స్ అందడం లేదు. ప్రక్కనే ఉన్న పొడుగాటి స్పూన్ ఒకటి చేతిలోకి తీసుకుని దానితో ట్యాప్స్ త్రిప్పడానికి ప్రయత్నిస్తూ ఓ పావుగంట కష్టపడి గానీ సాధించలేక పోయాడు.

కెటిల్ ప్లగ్ ఆన్ చేస్తుండగా వెనక నుండి హఠాత్తుగా చిరుగా చప్పట్లు విన్పించి ఉలిక్కిపడి తల కాస్త వెనక్కి తిప్పి చూశాడు. "వెల్‌డన్" అంటూ నవ్వుతూ ఎంతసేపటి నుండి గమనిస్తుందో ఓ ఇంగ్లీష్ అమ్మాయి లైట్ గ్రీన్ ప్రింటెడ్ డ్రెస్‌తో తెల్లని ఏప్రన్ కట్టుకుని నిలబడి ఉంది.

ఒక్క క్షణం ఏమి అర్థంగాక తెల్లబోయి చూస్తూ మరుక్షణం సర్దుకుని "హు ఆర్ యూ? వాటార్ యూ డూయింగ్ హియర్?" అంటూ అడిగాడు. మీకు తెలీదా? అన్నట్లు ఆశ్చర్యంగా చూస్తూ, "మై నేమ్ ఈజ్ డెయిజీ అండ్ అయామ్ వర్కింగ్ హియర్ ఇన్ యువర్ హౌస్ ఆజ్ ఎ మెయిడ్" అంది కష్టపడూ



## జీవితాన్ని జీవించు

టీ కలుపుకుంటున్న తనకి ఏ సహాయమూ చేయ ప్రయత్నించకుండా తనకి విషయం వదిన ఎందుకు చెప్పలేదా? అని ఆశ్చర్య పడ్తూనే అడిగాడామెని. ఇన్ని రోజులుగా మీరు వచ్చిన అలికిడిగానీ, పనిచేస్తున్న శబ్దంగానీ విన్పించలే దెందుకని? అంటూ మీ వదిన ముందే చెప్పింది మీకు డిస్ట్రబెన్స్ కాకుండా అతి నిశ్శబ్దంగా పని చెయ్యాలని' అంది సింక్‌లోని ప్లేట్లు కడుగుతూ

వీల్ చేర్‌లో అక్కడే కూర్చునే టీ సిప్ చేస్తూండగా, మరోసారి కూసింది బ్లాక్ బర్డ్ చేస్తున్న పని ఆపి ి టికీ తలుపులు మరి కాస్త తెరుస్తూ సంభ్రమంగా తనతో డిడ్ యు హియర్ దట్ బ్లాక్ బర్డ్స్ సాంగ్ దిస్ మార్నింగ్? డిడ్ యు నో వట్ వాట్ ఇట్‌వాజ్ సంగింగ్? ఇట్‌వాజ్ ఏ స్ప్రింగ్ సాంగ్, లిటిల్ ఫ్లవర్స్ సన్ బీమ్స్ ఆర్ డాన్సింగ్ ఇన్ ద ఏర్, టెల్ అజ్ దట్ ద స్ప్రింగ్ టైమ్ ఈజ్ కమింగ్ ఎవ్రీ వేర్ అని పాడుతూ చూడండి ఈ స్ప్రింగ్ ఉదయం ఎంత బాగుందో ఇంకా విచ్చుకోని ఆ మాగ్నోలియా పూలపై మంచు బిందువులు పెయిరీ టేల్స్‌లోని అందమైన రాకుమారి మెళ్లోని ముత్యాల్లా లేవూ' కిచెన్ డోర్ లాక్ తీస్తూ ఆ మంచులో తడిసిన మెత్తని పచ్చని లాన్‌లో నడిస్తే ఎంత బాగుంటుందో అంటూ సగంలోనే ఏదో తప్పు చేసినట్లు చటుక్కున ఆపేస్తూ ఉదయపు గాలి ఎంత ఫ్రెష్‌గా ఉంటుందో ఆరోగ్యానికి చాలా మంచి దంటారు మీరలా వెళ్ళి కాసేపు తిరిగి రాకూడదూ' అంటూ డోర్ తీసి పట్టుకున్న డెయిజీపై ఎందుకో ఒక్కసారిగా కోపం ముంచుకొచ్చింది తన స్థితి తెలిసీ, చూస్తూ కూడా ఎవరూ వీల్ చేరైనా నెట్టకుండా ఎలా వెళ్తాననుకుంటూంది? ఒక్కసారిగా చేర్ తిప్పుకుని, ఉక్రోషంగా వడివడిగా వెళ్ళిపోయాడు తన రూమ్‌లోకి

ఆ మరునాడు మళ్ళీ అదే టైమ్‌కి మెలుకువ వచ్చింది తనకి. మళ్ళీ బ్లాక్‌బర్డ్ పాడుతూంది అదేపాట నిన్న డెయిజీ పాడినపాటే విన్పిస్తూంది బ్లాక్‌బర్డ్ గొంతులో నిన్నటిలాగే కిచెన్‌లోకెళ్ళాడు టీ కోసం కెటిల్ నిండుగా నీళ్ళునింపి ఉన్నాయి డెయిజీ పనే అని చెప్పకనే తెలుస్తుంది కానీ ఆమె అలికిడి ఎక్కడా కన్పించలేదు బహుశ ఎక్కడో ఏదో పనిలో మునిగి ఉంటుంది టీ కప్పు అతి జాగ్రత్తగా పట్టుకుని డైనింగ్ టేబిల్ దగ్గరగా వీల్‌చేర్ జరుపుకుంటూ అప్రయత్నంగా గ్లాస్ డోర్‌లోంచి బ్యాక్ గార్డెన్‌లోకి చూశాడు ఫెన్స్‌ని సరిగ్గా కత్తిరిస్తూ విరిసీ విరియని మాగ్నోలియా పూలసుగంధాన్ని ఆస్వాదిస్తూ బ్లాక్‌బర్డ్ పాటకు బదులు చెప్తూంది డెయిజీ తనను చూడగానే చేస్తున్న పని ఆపి గుడ్‌మార్నింగ్ చెప్తూవచ్చి 'గార్డెన్‌లో ఎంత ఫ్రెష్‌గా ఉందో కాసేపు అలా తిరగకూడదూ ఆరోగ్యానికి కూడా మంచిదంటారు అప్పుడే మొదటిసారిగా చెప్తున్నట్టు చెప్తున్న ఆమె మాటలకు కోపం ముంచుకొచ్చింది ఆమెకు తెలీదా? తను వెళ్ళలేడని నాకు వెళ్ళాలనిలేదు నాలాంటివాళ్ళకు అంతా ఒకటే ఈ రూమ్‌లో కూర్చున్నా, బయటకు వెళ్ళినా, చీకట్లో ఉన్నా వెల్తురులో ఉన్నా అన్నీ సమానమే ఈ వీల్‌చేర్‌లో కూర్చోడం తప్పితే మరేముంది అందుకే మీకోసమే చెప్తున్నాను ఆరోగ్యానికేకాదు మనసుకూ మంచిదని

గార్డెన్‌లో తిరుగుతే కాళ్ళొస్తాయా? వేదన నిండిన మనసులో ఆనందం చిలుకుతుందా? ఉక్రోషంగా అంటూ కప్పు టేబిల్‌పై పెట్టబోతుండగా ఒలికి చేతిపై అంతా పడింది వేడి టీ పడిన చేతిని ఊదుకుంటూ చేర్ నెట్టుకుంటూ సింక్ వరకూ వెళ్ళి చల్లటి నీళ్ళలో చేయి కడుక్కుంటుంటే చూస్తూ నిలబడి కాస్త కూడా సహాయం చేస్తానని మాటమాత్రమైనా అనని డెయిజీని చూస్తే మరింత కోపం ముంచుకొచ్చింది

బయట వాతావరణం కాస్త చలిగా ఉన్నా చాలా ఆహ్లాదకరంగా అన్పించింది ఎందుకో ఒక్కసారిగా పువ్వుపువ్వునూ సున్నితంగా స్పృశిస్తూ, ప్రతిరెమ్మా కొమ్మా అందం పరికిస్తూ తిరిగే డెయిజీపై అసూయ ముంచుకొచ్చింది గార్డెన్‌లో తిరగమని చెప్తుందేగానీ చేర్‌నెట్టి సహాయం చేయదెందుకో, అయినా నా కెవరి సహాయమూ అక్కర్లేదు తనెవరిపైనా ఆధారపడి ఉండకూడదు అనుకుంటూ నెమ్మదిగా వీల్‌చేర్ నెట్టుకుంటూ అతికష్టంగా, అతి ప్రయత్నంపై వెడల్పాటి రెండు మెట్లూ జాగ్రత్తగా దిగి గార్డెన్‌లోకి వచ్చాడు ఉషఃకాలపు పూలగాలికి గార్డెన్‌లో తిరుగుతూంటే ఏదో గొప్ప పని సాధించిన అనుభూతి కల్గుతూ ఇందాకటి శ్రమ, నొప్పి అన్నీ మర్చి పోయేలా హాయిగా అన్పించింది పసుపుపచ్చగా విరిసిన డాఫొడిల్స్ వాటికి పోటీగా అప్పుడే విచ్చుకుంటున్న ఎర్రని ట్యులిప్స్ ఆకుపచ్చని లాన్‌కు వింత శోభను కల్గిస్తూ నీరెండలో మెరిసిపోతున్నాయి ఎందుకో డెయిజీ కోసం చుట్టూ చూశాడు ఎక్కడా కన్పించలేదామె

ఆ మధ్యాహ్నం డెయిజీ గురించి తనకు చెప్పలే దెందుకంటూ అడిగాడు వదినని 'అసలు చెప్పడానికి సమయం రాలేదు నీ పరిస్థితి చూస్తూనే గుండె నీరయిపోయి మరో విషయమే గుర్తుకి రావడం లేదు అంటూ చిన్నగా నిట్టూరుస్తూ 'డెయిజీ మంచి అమ్మాయి, ప్రక్క టౌన్‌లో కాలేజ్‌లో చదువు కుంటూంది. తండ్రిలేడు తల్లీ ఇద్దరు తమ్ముళ్ళు కాస్త పేద కుటుంబం మన విషయం తెల్సి తనంతట తనే వచ్చింది సహాయం చేస్తానంటూ అందుకే నేనన్నాను మామూలు సహాయం చేసే బదులు జాబ్‌లాగా రోజూ ఉదయం మూడు గంటలు ఇంటి పని చేయమని అందుకే ఉదయం ఐదు గంటలకే వచ్చి 8 గం ల కల్లా వెళ్ళి పోతుంది అంటూ చెప్పింది వదిన

ఆ రాత్రి ప్రతిరాత్రిలాగే శివరాత్రిలా గడిచి ఏ

తెల్లవారు ఝామునో నిద్రపట్టి ఉదయం ఏడు గంటలక్కీ మెలకువ రాలేదు ఎందుకో ఏ బ్లాక్‌బర్డ్ పాటా లేపలేక పోయింది మెలకువగా ఉన్నా లేవాలన్పించక అలాగే పడుకున్న తను చిన్నగా తలుపు తట్టిన శబ్దానికి కళ్ళు తెరిచాడు చేతిలో టీ కప్పుతో వచ్చింది డెయిజీ, 'గుడ్‌మార్నింగ్! ఈ రోజు బ్లాక్‌బర్డ్ పాట కూడా లేపలేనంత గాఢంగా నిద్రపోయారా?' అంటూ, 'ఒంట్లో బాగుంది కదూ?' ఆదుర్దాగా అడిగింది నుదుటిపై చేయివేసి చూస్తూ చాలా రోజులుగా అంటే దాదాపు రెండు నెలల పైగా ఒంట్లో బాగులేదని ఇక బాగుండబోదని తెలీదా నీకు" అన్నట్టుగా విసుగ్గా కాళ్ళవేపు చూపు మరల్చుకున్నాడు తను ఎందుకో డెయిజీ ఎప్పుడూ మామూలు మనిషిలానే ట్రీట్ చేస్తుంది తనని తను ఎంత బాధపడుతున్నా, శ్రమపడుతున్నా చూస్తూ ఊర్కుంటుందేగానీ కనీసం సాంత్వన వచనాలు కూడా పలకదు కానీ ఆ రోజు ఆమె ఆదుర్దాలో ఒక్క క్షణం తన కోసం ఆరాటం, ఒక్క క్షణం ఆమె కళ్ళల్లో తనపై ఎనలేని కరుణ ఆశ్చర్యంగా అన్పించింది తనకు

'లేవండి ఎంతసేపు పడుకుంటారు ఏడున్నర అయింది. బయట ఎంత బాగుందో ఈ రోజు మొన్న క్రొత్తగా నాటిన స్వీట్‌పీస్ మొగ్గ తొడుగుతున్నాయి చూడరూ" అంటూ టీ సిప్ చేయసాగింది

ఆమె చేతిలోని టీ కప్పువేపే ఆశగా చూస్తూ ఈ రోజు టీ చేసుకునే శ్రమ తప్పిందనే సంతోషం క్షణం కూడా నిలువ లేదు తనలో ఇంత పని చేస్తుంది కదా ఇంట్లో, ఆ చేత్తోనే తనకో కప్పు టీ ఇస్తే తప్పేమిటో? ఎందుకో ఒక్కసారిగా నిస్సత్తువ ఆవరించి మనసంతా నిర్లిప్తమై పోయింది. లేవకుండా అలాగే శూన్యంలోకి చూస్తూ పడుకున్న తననే చూస్తూ అంది డెయిజీ

చూడండి! మీరిలా ఉంటే మీ వాళ్ళెంత బాధపడుతున్నారో! మీరు కాస్త బయట తిరుగుతూ మామూలుగా మనుషుల్లో పడితే వాళ్ళకూ సంతోషమే కదూ!

'అంటే మీ అర్థం? కాళ్ళు లేకున్నా, మనసులో లేని సంతోషం బయటికి నటిస్తూ, అందరికీ చూడండి నేనెంత అదృష్టవంతుడినో! మీలాగ నడిచే శ్రమ నాకు లేకుండా హాయిగా నా వీల్‌చేర్ వాహనంలో తిరుగుతున్నానని గర్వంగా చెప్పుకోనా? లేక చూడండి మా అన్నయ్య నన్ను ఎంతో కష్టపడి డాక్టర్‌ను చేస్తే హాయిగా ఏ పనీ చెయ్యకుండా రాత్రింబవళ్ళు బెడ్‌లోనే పడుకుని రాజభోగాలనుభవిస్తున్నాను ఇలాంటి అదృష్టం ఏ డాక్టర్‌కైనా ఉంటుందా అనా? ఇదేనా మీ అర్థం మామూలుగా కావడమంటే? నటిస్తూ బ్రతకడం నా తరం కాదు '

తన కన్నీరు చూసి చలించిపోతూ, సారీ! మీ మనసు బాధ పెట్టాను క్షమించండి కానీ ఒక్కసారి ఆలోచించండి! ఎంతగానో కుమిలిపోతున్న మీ అన్నయ్యను ఒక్కసారి అడగండి అలా వాకింగ్‌కి తీసికెళ్ళమని ఆయన ఎంత సంతోషపడ్తారో!

నో! వీల్ చేర్‌లో కూర్చోవాల్సొచ్చిన నా స్థితికి, దాన్ని నెట్టాల్సొచ్చిన తన స్థితికి ఇంకా బాధపడ్తారు

చూడండి జరిగిందేదో జరిగిపోయింది బాధపడడం వల్ల ఎవరూ ఏం చేయలేరు, కాలాన్ని వెనక్కి తిప్పి ఆ అక్సిడెంట్‌ని తప్పించి మళ్ళీ మీ కాళ్ళు మీకు ఎవరూ ఇవ్వలేరు కానీ ఇది ఇలా జరగకుంటే ఎంత బాగుండేదో అని ఆలోచించి టైమ్ వేస్ట్ చేసే బదులు, జరిగిందాన్ని ఇప్పుడు అనుకూలంగా ఎలా మార్చుకోవాలో ఆలోచించాలి వాకింగ్‌కి తీసికెళ్ళమంటే మీ స్థితి చూసి మీ అన్నయ్య బాధ పడ్తారంటున్నారు కదూ!పడనివ్వండి, మీకూ బాధగానే ఉంటుంది అయినా దిగమ్రింగుకోవడం నేర్చుకోండి మళ్ళీ రేపూ వెళ్ళండి వాకింగ్‌కి, అలానే ఎల్లుండీ. ఆ తర్వాతా ప్రతి రోజూ అప్పుడు మీ ఇద్దరికీ అలవాటై పోతుంది దిన చర్యలో ఒక భాగంగా దేనికైనా కాలమే మందు అంటారు అంటూ టైమ్ చూసుకుంటూ "కాలేజ్ బస్ మిస్సవుతాను" అనుకుంటూ పరుగెత్తుతూ వెళ్ళి పోయింది

ఆ తర్వాత చాలా సేపు డెయిజీ మాటలే చెవుల్లో మార్మోగుతుండగా నిశ్చలంగా అలాగే ఉండిపోయాడు ఆలోచిస్తూ

ఆమె చెప్పిందాంట్లో నిజం లేకపోలేదన్పించింది

ప్రతి రోజూ ఎటువేపు వాకింగ్‌కి వెళ్ళాలో, ఎటు వెళ్తే ప్రకృతి దృశ్యాలు బావుంటాయో, డైరెక్షన్స్ ఇవ్వసాగింది డెయిజీ

వదిన తన కోసం కొని తెచ్చిన బినాక్యులర్స్ దూరాన సముద్రంపై ఎగిరే 'సీగల్స్', కొండల అంచుల్లో మాయమయ్యే సూర్యాస్తమయం, మారే ఋతువుల అందాలు రోజులు ఇదివరకంత భారంగా అన్పించడం లేదు

క్రమంగా తన అవిటి తనానికి అలవాటు పడసాగాడు వీల్ చేర్ తన శరీరంలోని ఒక భాగంగా మారిపోయింది

## మంగళదాయిని

ప మంగళదాయిని జగన్మాతా
మానస పూజను గైకొనుమా
మహిషాసురుని దునిమి
దుష్టసంహారము సేసితివి

చ కామమే మహిషమట
క్రోధమే కొమ్ముయట
మదమత్సరములు చేతులట
అహం, అసూయ, ఈర్ష్య
నాలుకలై సాచినవి
ఈనాటి జగములో ,మంగళ

రావమ్మా మాతా
రావమ్మ కాళీ, చం డికా
భైరవీ, శాంభవీ,
శక్తి స్వరూపిణీ
గిరినందినీ జగన్మాతా
మమ్ము రక్షించి, దీవించు మంగళ

(రాగం ఆనందభైరవి)

—కె. నాగేశ్వరి






# ఈ వేమన పద్యాలు




ఆలు రంభయైన యతి శీలవతియైన
జాడలేలమాను జారపురుషు
పాలుద్రాగు కుక్క బడుగుకు బారదా
విశ్వదాభిరామ వినురవేమ.

## జీవితాన్ని జీవించు

రోజూ ఆ కొన్ని నిముషాల డెయిజీ సాన్నిధ్యం, ఆమె మాటలు మనసులోని చీకటిని క్రమంగా పారద్రోలుతూ జీవితం పరిపూర్ణంగా అనుభవించలేక పోయినా, ఆనందంగా జీవించడానికి అవిటితనం ఒక అడ్డు కాదన్పించింది

తొలి ఉషస్సు లాగా మనసులో క్రొత్త వెలుగు ఎన్నడూ అనుబవానికి రాని అనుభూతిలా నిండసాగింది

క్రమంగా డెయిజీ తను శ్రమపడి పనులు చేసుకుంటున్నా ఎందుకు చూస్తూ కూడా సహాయం చేయకపోయేదో, ఎందుకు ఒక్కసారి కూడా ఎంత దీనస్థితిలో ఉన్నావంటూ జాలి చూపించక పోయేదో అర్థం కాసాగింది.

అందుకే తన పనులన్నీ ఎవరి సహాయం లేకుండా చాలా తేలికగా చేసుకో గల్గుతున్నాడు అందుకే తనూ ఒక మామూలు మనిషిననే నమ్మకం క్రమంగా ఏర్పడ సాగింది

అందుకే తను ఎవరూ జాలిపడేంత దీన స్థితిలో లేనంటూ తన జీవితం తను జీవించగల్గుతూ, తన చదువు నిరర్థకం కాకుండా నల్గురికి ఉపయోగపడేలా రివాల్వింగ్ చేర్‌కు బదులు వీల్‌చేర్‌లో కూర్చునే సార్థకం చేసుకోవాలనే డెయిజీ సలహా పాటించి ఆ రోజే ఎంతో ఆలోచించి అన్నావదినలను అతి కష్టంపై ఒప్పించి తీసుకున్న నిర్ణయం, ఇండియాకు తరిగి వచ్చి ఓ అతి చిన్న పల్లెటూరిలో తనకు చేతనైనంత వరకూ డాక్టర్‌గా సేవ చెయ్యడం కోసం ఇండియాకు ప్రయాణమయ్యే రోజు

ఉదయాన్నే గార్డెన్‌లో వీల్ చేర్‌లో కూర్చుని గతమంతా నెమరువేసుకుంటూ, అన్నా వదినలను, ముఖ్యంగా డెయిజీని వదిలి వెళ్లాలంటే భరించలేని బాధగా ఉండింది ఈ కొద్ది కాలంలోనే డెయిజీ ఒక ఉన్నతస్థానం ఏర్పర్చుకుంది తన హృదయంలో ఆమె తన చీకటి జీవితంలో దారి చూపించిన వెలుగురేఖ, ఆమె తన జీవిత నౌకకు చుక్కాని తన ప్రక్కనే వచ్చి మౌనంగా నిలబడిన డెయిజీ అలికిడికి ఆలోచనల్లోంచి తేరుకుని డెయిజీ అంటూ ఆశ్చర్యంగా పైకి చూసిన తనకు కన్పించింది డెయిజీ కాదు తనకు తెల్సిన డెయిజీ కాదు గలగలా నవ్వుతూ, తనను వెక్కిరిస్తూ, ధైర్యం చెప్తూ, సలహాలు ఇస్తూ శాసిస్తూ సెలయేటి సవ్వడిలాంటి డెయిజీ కాదు బేలగా, నీళ్ళు నిండిన కళ్లతో అది దీనంగా ఉందామె డెయిజీ! పిల్చాడు తను ఏమనాలో తెలియక, ఆమె కన్నీళ్లనెలా అర్థం చేసుకోవాలో తెలియక ఆర్ద్రంగా

రవీ' అంటూ రెండు చేతుల్తో ముఖం తుడుచుకుంటూ ఆమె కన్నీళ్ళు తను చూడకూడదనే ప్రయత్నంలో ప్రక్కనే గడ్డిలో కూర్చుంటూ రవీంద్రా! ఐ లవ్ యూ! ఐ వాంటెడ్ టు టెల్ యూ దిస్ ఆల్ దీజ్ డేస్ బట్ ఐ కుడ్‌నాట్, బికాజ్ యు హావ్ టు గో టు ఇండియా అండ్ యు నో రవీ! ఐ విల్ టెర్రిబుల్లీ మిస్ యూ, బట్ యు మస్ట్ ప్లీజ్ టు ఇండియా దుఃఖం గొంతులో అడ్డుపడగా తడబడుతూ అంటూ పరుగెత్తుకెళ్ళిపోయింది డెయిజీ

ఆమెకోసం మనసెంత తపించి పోయినా తనకన్నా ఉన్నతుడు ఆమెకు భర్తగా రావాలని, ఆమె జీవితం సుఖమయ్యం కావాలని, మనసారా కోరుకుంటూ ప్లేన్ ఎక్కాడు తను

ఇప్పటికీ ఒక్క వసంత ఋతువులోనే కాదు, ప్రతి క్షణమూ తన కళ్లల్లో ఎవరికీ కన్పించని సన్నటి కన్నీటి తెర, ఆ తెరపై తెల్లని సున్నితమైన 'డెయిజీ ఫ్లవర్ లాంటి డెయిజీ అందంగా నవ్వుతూ అనవసరంగా జరగని వాటి కోసం బాదపడకుండా జరిగేవాటిని అనుకూలంగా మలుచుకొని వీలైనంత ఆనందంగా జీవితాన్ని జీవించు అంటూ తియ్యగా శాసిస్తూ □

# కోటయ్య అనుభవం- సూరయ్య నోటనే విందాం.



కోటయ్యా సూరయ్యా ఇరుగు పొరుగు ఊళ్ళ రైతులు.
ఎన్నాళ్ళనుంచో మిత్రులు. ఒకసారి అనుకోకుండా కలిశారు...




























పూర్తి వివరాలకై మీకు దగ్గరలోని న్యూ ఇండియా కార్యాలయానికి విచ్చేయండి.
లేదా ఏజెంటును కలవండి.



**న్యూ ఇండియా ఎష్యూరెన్స్**

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ)

నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం — భీమా!

# పుణ్యక్షేత్రాల నిలయం రాజమహేంద్రవరం

"వేదంలా ఘోషించే గోదావరి – అమర ధామంలా శోభిల్లే రాజమహేంద్రి, శతాబ్దాల చరిత గల సుందర నగరం" అని ఆరుద్రగారు ప్రాచీన రాజమహేంద్రవరం యొక్క కీర్తి ప్రతిష్టలను, అలనాటి వైభవాన్ని గూర్చి ఒక చలన చిత్రంలో ప్రస్తుతించారు. పవిత్ర గోదావరి నది తీరస్థ ప్రాంతమైన ఈ పట్టణంలో చారిత్రిక ప్రసిద్ధి గాంచిన దేవాలయాలు మనకు కనబడతాయి. అశేష భక్త జనావళి నిరంతరం గోదావరి నదీస్నానం చేసి పునీతులవుతారు. అసంఖ్యాక మైన రీతిలో దేశం నలుప్రాంతముల నుండి యాత్రికులు వివిధ పుణ్యక్షేత్రాలకు నెలవైన రాజమహేంద్రవరాన్ని దర్శించడము గమనించ దగ్గ విషయం. రాజమండ్రికి చారిత్రికముగా గల ప్రాముఖ్యత కంటె ప్రాచీన మగు పౌరాణిక ప్రాముఖ్యత బ్రహ్మ, బ్రహ్మాండ, శివ, స్కాందాది పురాణములందు విశేషముగా కనపడుచున్నది. ఓఢ్రదేశము మొదలు కృష్ణానది వరకుగల కళింగ దేశమునకు రాజమండ్రి రాజధానిగా గలదన్న గౌరవమును మహాభారతము కూడా పేర్కొన్నది. గృహములందు పూజింపబడు గంగా జలమున గోదావరి జలము కలిపిన పూజార్హము కానేరదు, కనుకనే గంగను తెచ్చు యాత్రికులందరూ రాజమండ్రిలో దిగి పూజ చేయుదురు.

తూర్పు చాళుక్య వంశపు రాజయిన రాజరాజునకు రాజమహేంద్రుడను బిరుద ముండుటచే శ్రీనాథుని నాటికే రాజమహేంద్రవరమని వ్యవహరించ బడినది. రాజరాజ నరేంద్రుడు క్రీ. శ. 1022 నుండి 1063 వరకు నలభై సంవత్సరాలు రాజ్యపాలన చేసెను. ఇంగ్లీషు వారు రాజమండ్ర మనెడివారు. ఇప్పటికి గోదావరి జిల్లాలోని పామరులు రాజమండ్రం అని పిలవడం జరుగుతుంది. రాజమండ్రిలోని మదన గోపాలస్వామి ఆలయమును మహ్మద్ బీన్ తుగ్లక్ కీ. శ. 1325లో ధ్వంసంచేసి, దానిని మసీదుగా మార్చెను. ఇంతటి ప్రసిద్ధి గాంచిన ఈ రాజమండ్రిలోని గోదావరి గట్టుకు అనుకొని సుమారు నలభై దేవాలయాలు ఉండగా, వాటిలో శ్రీ ఉమా మార్కండేయేశ్వరాలయం, శ్రీ ఉమా కోటిలింగేశ్వర స్వామి దేవాలయాలు పవిత్ర క్షేత్రాలుగా ప్రజలచే కీర్తించ బడుచున్నవి.

## శ్రీ ఉమా మార్కండేయేశ్వరాలయం

బ్రహ్మాండ పురాణములో ఈ క్షేత్ర ప్రాశస్త్యమును గూర్చి వివరింప బడినది. మృకండుడు అను మునీశ్వరుని ధర్మ పత్ని సుశీల. ఆ దంపతులకు సంతానము లేనందున మహర్షుల సలహాపై పుష్పగిరి వద్ద శివలింగమును ప్రతిష్ఠించుకొని కొలుచుచుండగా శివుడు ప్రత్యక్ష మయ్యెను. ఆ ముని దంపతులు సంతాన భాగ్యం కలుగజేయుమని కోరగా శివుడు తథాస్తు అనెను. పిదప సుశీల గర్భవతి యయి పుత్రుని కనెను. పిన్న ప్రాయముననే శివభక్తి తత్పరుడై పదునైదు సంవత్సరముల ప్రాయుడైనాడు ఆ బాలుడు. ఒకనాడు ఆకాశము నుండి మార్కండేయా పదహారవ సంవత్సరం మొదటి దినమే నీకు మృత్యువు అను మాటలు వినపడగా సుశీలా మృకండులు మిగుల దుఃఖించుచు, మహర్షులను వేడుకొనగా, దైవఘటన తప్పదని తెలిపిరి. అంతట మార్కండేయుడు, నాకు జీవించే భాగ్యము లేదా? నీ మంత్రశక్తులు ఏమైనాయని తండ్రిని వేడుకొనగా, అంతట మృకండుడు గోదావరియే నీ దారి. ఆ పుష్పగిరిపై ఉండే ఆ ఈశ్వరుడే నీకు దారి చూపును. ఆయనను వేడు కొనుము అని చెప్పెను. ఆ బాలుడు పుష్పగిరి క్షేత్రమునకు పోవుచుండగా ఒక విచిత్రము జరిగెను. తల్లిదండ్రులతో, మునిబృందాలతో పోవుచున్న మార్కండేయునకు దారిలో నారద మహర్షి కనపడెను. వెంటనే ఆయన పాదాలపై పడెను. ఆయన వెంటనే చిరంజీవ! అనెను. వాటికి ప్రక్కన మునులు నవ్వగా, దేవర్షి నా పొరపాటు ఏమని అనెను. సంవత్సర ఆయువు అని యాకాశవాణి నేడే చెప్పినది. ఇట్టి అల్పాయుష్కునకు చిరంజీవిత, దీర్ఘాయుష్మత లెట్లు అనినారు. నారదుడు పౌరుషముతో నా మాట నిజమై తీరును. ఈ బాలుని తనతో తీసుకొని వెళుదునని చెప్పగా పెద్దలు అంగీకరించినారు. అంత నారదుడు మార్కండేయునితో ఇట్లు చెప్పెను. నేను నమః అను సరికి వారి పాదాలు రెండు విడువక పట్టుకొనుము. వారి ఆశీస్సులు పిదపనే విడువుము. త్రిమూర్తుల శక్తి సామర్థ్యాలు పరీక్షించదము. దానికి మార్కండేయుడు అంగీకరించెను. ఇరువురు సత్యలోకమునకు బోయి నారదుడు వాగి విధాతృభ్యం నమః అనగా బాలకుడు పాదాలంటగా బ్రహ్మ చిరంజీవి అన వాణి దీర్ఘాయుష్మా న్భవ అనియు పలికెను. నారదుడు నవ్వగా, నీనవ్వుకు కారణమేమిటని యాది దంపతులు కోపముతో అడిగినారు. పూజ్యులారా ఈ

శ్రీ ఉమా మార్కండేయస్వామి దేవాలయం



మృత్యుంజయుడు



కాళ్ళు పట్టిన వాని నాలొ చింపక దివించినారు వీని కొక యేడాది మాత్రమే యాయువని యశరీరవాణి పలుకు అని తెలుపగా ఆదిదంపతులు మా మాట నెగ్గితీరుతుంది కైలాస వాసి వైకుంఠ వాసుల వెంతకు జని మా మాటకు బలం చేకూర్చుము అని చెప్పిరి అంతట వైకుంఠమునకు వెళ్ళగా శ్రీహరి లక్ష్మి అటులనే ఆశీర్వదించిరి అంతట కైలాసమునకు వెళ్ళిరి నృత్యమును చేసిన తరువాత ఒక్కచోట విశ్రాంతి గైకొనుచున్నారు మనకిదే సమయము నారదుడు ఓం నమః పార్వతీ పరమేశ్వరాభ్యాం నమః అనగా బాలుడు పాదాలు పట్టును పార్వతీ పరమేశ్వరులు దీర్ఘాయుష్మాన్భవ అని ఆశీర్వదించె, ఎవరితను అని నారదుని ప్రశ్నించిరి అంతట పార్వతి, ఒక సంవత్సరం శివుని గొలిచినట్లయితే అమృత ఘటికలు దాటి చిరంజీవి అగును అని వివరించగా నారదాజ్ఞ చేత బాలకుడు పుష్పగిరీంద్రున్ని కొలుచుచుండెను అతడు పూజించుటకై ఒక ఈశ్వరలింగమును ప్రతిష్ఠించెను చివరకా బాలుడు శివానుగ్రహముచే మృత్యువును జయించినాడు మరల పది వేల వసంతులు ఉగ్ర తపస్సుచే మహర్షిగా అయ్యెను

ఇది శివక్షేత్రము గోపాలుడు క్షేత్రపాలకుడు కాన ముందు గోపాలుని పూజించి పిదప మార్కండేయేశుని సేవించిన శీఘ్ర ఫలసిద్ధి కలుగును ఈ దేవాలయము దేవాదాయ శాఖ వారి నిర్వహణలో ఉన్నది కార్తీక మాసం దేవీ నవరాత్రులు శివరాత్రుల రోజులలో భక్తులు అధికంగా వస్తుంటారు



## శ్రీ ఉమా కోటిలింగేశ్వర క్షేత్రము

రాజమండ్రి పట్టణ శివార్లతో ఒక వైపు గోదావరి మరొక వైపు దూర ప్రాంతం నుండి కనపడే కొండలతో ప్రకృతి రామణీయకతకు నిలయమైన కోటిలింగేశ్వర క్షేతం భక్తుల పాలిట పుణ్యస్థలిగా దేశ వ్యాప్తంగా పేరు గాంచింది ఇది శంకరుని నిత్యనివాసము బ్రహ్మ పురాణమును బట్టి త్రిపుర సంహారము ఇచ్చుటనే జరిగినది కోటలాదిగా రాక్షసులు శంకరునిచే చంపబడి లింగాకారములతో సారూప్య ముక్తిని బొందిరి కోటలాది లింగములు ఈశ్వరునితో నిక్కడుండుటచే దీనికి కోటి లింగ క్షేత్రమని పేరు కలిగినది త్రిపుర సంహారానంతరము ఇక్కడ శివుడు ఆనందతాండవం చేసెను శివుని ఆనందాశ్రువులచే నిది ఆనందామృత కుండమనియు, ఆనంద సాగర మనియు పేరొందెను శ్రీరామచంద్రుడు అరణ్యవాస సమయమున కొంత కాలమిచ్చట నుండుటకు గురుతుగా నిచ్చట సీతారామాలయము కలదు శివరాత్రి ముక్కోటి కార్తీక మాసములలో అసంఖ్యాకముగా భక్తులు వస్తుంటారు దేవాదాయ ధర్మాదాయశాఖ ఆధ్వర్యంలో, నిర్వహింపబడుచున్న ఈ క్షేత్ర ప్రాంగణములో భువనేశ్వరి దేవి ఆలయము, శ్రీ సీతారామ స్వామి వారి ఆలయములు ఉన్నాయి

## మృత్యుంజయుడు

రాష్ట్రం నలుమూలల నుండి మాత్రమే కాకుండా రాష్ట్రేతర ప్రాంతాల నుండి అశేష భక్త జనావళికి పుణ్యస్థలి యైన రాజమండ్రికి ప్రత్యేకాకర్షణ మృత్యుంజయుని విగ్రహము గోదావరి స్టేషనుకు సమీపము మెయిన్ రోడ్డుకు కూడలి యైన కోట గుమ్మంలో పెద్ద శివుని విగ్రహం చూపరులను విశేషంగా ఆకర్షిస్తుంది సాయంత్రము విద్యుద్దీపాల కాంతిలో కృత్రిమముగా ఏర్పరచిన గంగాజలం శివుని శిరస్సు పై నుండి జాలువారు దృశ్యం శిల్పకారుని ప్రతిభకు నిదర్శనమే! 1977లో లయన్స్‌క్లబ్ ఆద్వర్యంతో శ్రీనివాల్ చంద్ రాజపాల్ ఆర్థిక సహాయంతో దేవశిల్పి శ్రీ దార్ల అచ్యుతం ఈ మృత్యుంజయుని విగ్రహానికి సజీవత కల్పించారు

వ్యాసం, ఫొటో లు.
అరదాడి లో వరాజు

సీరియల్: నిశ్శబ్ద సంగీతం

బెహరా వెంకట సుబ్బారావు

(గత సంచిక తరువాయి)

కంపెనీ రిక్రియేషన్ క్లబ్‌లో కేరమ్స్ ఆడుతూ గేమ్ అవగానే టైం చూసుకున్నాడు రఘు పదిన్నరైంది లేచాడు పక్క రూంలో ఇంకా జోరుగా పేకాట సాగుతోంది ఆ గదిలోకివెళ్ళి ఆటగాళ్ళ పక్కన కాళీగా వున్న కుర్చీలో కూర్చున్నాడు

కార్డ్స్ పంచమన్నారా?' అడిగాడొక ఆటగాడు పేకను కలుపుతూ

తక్కిన ప్లేయర్సంతా రఘు వైపు ఆశ్చర్యంగా చూసారు

వద్దు అన్నట్టు అడ్డంగా తలూపాడు రఘు

ఆయన ఆడడు! అన్నాడు పంచిన కార్డ్సని చేతిలోకి తీసుకొంటూ కంపెనీ డాక్టర్ రఘుఅక్కడికి ఎందుకు వచ్చిందీ అతనికి తెలుసు

ఈ రౌండ్ అయ్యాక వెళదాం! ప్లీజ్ వెయిట్! అన్నారు రఘుతో ఆలస్యానికి నొచ్చుకుంటూ

కిషోర్‌కి జ్వరం ఎక్కువగా వుందని సాయంత్రం వెంకాయమ్మగారు ఫోనులో చెప్పారు డాక్టరుగారిని ఇంటికి తీసుకొని వస్తానన్నాడు అసలు బాబుకి జ్వరం వచ్చిన మొదటి రోజునుంచీ డాక్టరుకి చూపిస్తాననే అంటున్నాడు గాలి జల్లిన లక్షణాలు కనబడటంతో వైద్యం చేయించవద్దంది తల్లి జ్వరం బాగా వుండటంతో అందరికీ కంగారుగా వుంది రఘు ఎంత పట్టుపట్టినా తల్లి వైద్యానికి అంగీకరించలేదు అయినా డాక్టరుగారికి చూపించదలచుకున్నాడు ఆయనకి పేకాట పిచ్చి! ఒక గంటలో వెళ్దాం అని సాయంత్రం ఏడు గంటలకి పేకాటలో కూర్చుంటూ అన్నారు పదిన్నర అయినా ఇంకా లేవలేదు ఆ డాక్టరుగారంటేనే ఆ ఇంట్లో అందరికీ గురి ఆయనే ఫామిలీ డాక్టరు ఆయన రఘు తండ్రి ధర్మరాజుగారి శిష్యుడు ఆ కుటుంబంతో చాలా సన్నిహితంగా వుంటాడు

డాక్టరుగారిని ఇంటికి తీసుకొని వెళ్తూ దారిలో చెప్పాడు రఘు బాబుకి మామూలు జ్వరం కాదనీ గాలి జల్లిందనీ, తల్లి వైద్యం చేయించడానికి అంగీకరించడం లేదనీనూ

అంతా విని డాక్టరుగారన్నారు

ఈ గాలి జల్లడాలూ అమ్మవార్లూ అన్నీ మూఢనమ్మకాలు! వైద్యశాస్త్రం ఒప్పుకోదు దానికి ట్రీట్‌మెంటుంది చేస్తాం! డాక్టరుగా కాక మామూలు వ్యక్తిగా ఈ మూఢనమ్మకం మీద నాకూ విశ్వాసం వుంది! ఈ పరిస్థితిలో రోగికి హై టెంపరేచర్ వుంటుంది అందుకు బయపడనవసరం లేదు ఇంజక్షన్ యిచ్చి టెంపరేచర్‌ని కంట్రోలు చెయ్యగలను! కాని దానివల్ల ప్రయోజనం పెద్దగా వుండదు మరో రెండు రోజులు పోతే దానంతటదే నార్మల్‌కి వస్తుంది నేను ట్రీట్‌మెంట్ యిచ్చినా అంత టైమూ తీసుకుంటుంది! దాని డ్యూరేషన్ని తగ్గించలేం! మీ అమ్మగారి మాట కాదని వైద్యం చేస్తే ఆమె బాదపడ్తారు! ఆ నమ్మకం అలాంటిది! అదొక దైవ సంబంధమయిన నమ్మకం! టెంపరేచర్ వుందని వర్రీ కానవసరంలేదు రఘూ! అది రోగ లక్షణం! అంతే!

ఇటు తల్లీ అటు డాక్టరూ అదే మాటంటూ వుంటే బలవంతం చేయలేకపోయాడు రఘు డాక్టరుగారికి గుడ్‌బై చెప్పి ఒంటరిగానే యిల్లు చేరుకున్నాడు

బాబుకెలా వుందమ్మా? నిద్రపోకుండా వున్న తల్లిని అడిగాడు ఎదురుగా మంచంమీద బాబు పక్కనే పడుకొని నిద్రపుచ్చుతున్న ఉషని చూసి ఆశ్చర్యపోయాడు బాబుని సాకడానికీ అత్తయ్యకి సహాయంగా వుండడానికి పంపారనుకున్నాడు

సాయంత్రం నుంచీ ఒకటే ఏడుపు! చెయ్యి దిగడు! సాయంగా వుంటుందని ఉషనిపంపమన్నా! ఇప్పుడే నిద్రపోయాడు! అయినా యింత ఆలస్యంగా వస్తే ఎలా బాబూ! నెమ్మదిగా అంది తల్లి

డాక్టరుగారి కోసం వెళ్లానమ్మా! బాబు సంగతి చెప్పా! నువ్వన్నట్టుగా మరో రెండు రోజుల్లో తగ్గిపోతుంది కంగారుపడనవసరం లేదన్నారు చెప్పాడు

అవును బాబూ! ఎల్లుండికి దిగజారుతుంది! అంతవరకూ బాధపడక తప్పదు! నిట్టూర్చారు అనసూయమ్మ

నీకెలా వుందమ్మా?

అలాగే వుంది బాబూ! ఆయాసం తగ్గలేదు! ఆయాసపడింది తల్లి

కిషోరు తేరుకొనేసరికి వారం రోజులు పట్టింది

* * * * * *

ఆ రోజు కంపెనీ అడ్రసుకి ఓ కవరు వచ్చింది కవర్ని వెనక్కి తిప్పి చూసాడు రఘు పంపినవారి అడ్రస్ రబ్బర్ స్టాంపు వేసి వుంది అపరిచిత వ్యక్తి పేరు! తులసీరాం! ఆతృతగా కవరు విప్పాడు ఇంగ్లీషులో రాసి వుంది బొంబాయి నుంచి వచ్చింది

శ్రీ రఘునాథ్‌గార్కి

నా పేరు తులసీరాం! నాకు మీర్తు తెలియదు నేనెవరో మీరెరుగరు! గత రాత్రి ఈ నగరంలో మీ బార్య రేణుకాదేవిగారిని ఓ బ్రోతల్ హవుస్‌లో కలియడం తటస్థపడింది ఆమె తన దీన గాథను వివరించారు సీతామహాతల్లిని ఆమెలో చూసాను సీతామహాతల్లిని తాకబోయిన రావణబ్రహ్మకు కలిగిన కీడే నాకూ మూడుతుందేమోనన్న భయంతో ఆమెను సమీపించలేకపోయాను మీకు ఉత్తరం రాయాలని చాలాసార్లు ప్రయత్నించారుట! కానీ ఆ ప్రయత్నాలు ఫలించలేదుట! ఈ విషయాలు మీకు తెలుపమని మీ అడ్రసు ఇచ్చారు తక్షణం వచ్చి నన్ను కలియండి మీ సహధర్మచారిణిని విడిపించే ప్రయత్నంలో మీకు సహాయపడగలనని దృఢంగా నమ్ముతున్నా! వెంటనే రండి! ఇట్లు - తులసీరాం

ఉత్తరం చదివి అచేతనుడయ్యాడు రఘు కళ్ళు చెమర్చాయి ఎంత హీనస్థితిలో వుంది! మనసు వికలమైంది ఎవరితోనూ కనీసం తల్లితో కూడా ఈ

జరిగిన కథ-9 రేణూ- రఘూ రమా- శశిధర్‌ల వివాహాలు జరిగిపోయాయి సంవత్సరం గడిచాక కొడుకుని కని అత్తగారి కోర్కెను తీర్చింది రేణూ రేణు పుట్టిన రోజునాడు ఉదయం శ్రీ వెంకటేశ్వరుని దర్శించుకొనేందుకు భర్తతో బిర్లా మందిర్ వెళ్తుంది ఆరోజు మధ్యాహ్నమే ఎవరో మోసగాళ్ళు రఘుకి ఏక్సిడెంట్ అయిందని చెప్పి రేణుని మోసగించి అపహరించుకుపోతారు. రేణు లేని జీవితం నిస్సారంగా తయారయింది రఘుకి రఘు కొడుకు కిశోర్‌ని చూసుకోడానికి కూతురు ఉషను తీసుకుని వస్తాడు రామనాథం రఘుబాబుని దారిలోకి తెచ్చే పూచీ తనదని అనసూయమ్మకి ధైర్యం చెప్తారు రామనాథంగారు

విషయం చెప్పకూడదని నిశ్చయించుకున్నాడు కంపెనీ పనిమీద బొంబాయి వెళ్తున్నానని చెప్పి బయలుదేరాడు

సూపర్ ఫాస్ట్ ఎక్స్‌ప్రెస్ బయలుదేరింది స్పీడు అందుకుంది అయినా నెమ్మదిగానే పోతున్నట్టు అనిపిస్తోంది రఘుకి కిటికీలోంచి బయటకు చూస్తూ ఆలోచిస్తున్నాడు ఆమె ఎలాంటి పరిస్థితిలో వుంటుందో ఊహించుకుంటే హృదయం ద్రవిస్తోంది

బొంబాయి వస్తారాండీ? ఎదురుగా కూర్చున్న వ్యక్తి పలకరింపుగా అడిగాడు అతని వైపు తిరిగాడు రఘు వయసు అరవై దాటి వుంటాయ్ పొందూరు ఖద్దరు పంచ లాల్చీ ధరించాడు నుదుట కుంకుమ బొట్టుంది

అవునన్నట్టు తలూపాడు

అయితే మాకు చివరి వరకూ మంచి కంపెనీయే వుంటుందన్న మాట' సంతోషించారాయన సభ్యత కోసం చిరునవ్వు నవ్వాడు రఘు జవాబుగా రఘు మనసెప్పుడో బొంబాయి నగరం చేరుకొంది తులసీరాంతో బొంబాయి నగరంలో రేణూని గాలిస్తోంది

ఒక పావు గంట గడచింది రఘు మాటామంతీ లేకుండా కూర్చోవడం ఆ తోటి ప్రయాణీకునికి నచ్చలేదు ఎలాగైనా మాటల్లోకి దింపాలనుకున్నాడు

నా పేరు క్రిష్ణారావు మాది పిఠాపురం మా అబ్బాయి బొంబాయిలో ఓ షిప్పింగ్ కంపెనీలో మానేజరు' అక్కడే మా ఆఖరమ్మాయికి ఎల్లుండి వివాహం' తన గురించి చెప్పుకొన్నాడు క్రిష్ణారావు

రఘు రెస్పాన్సివ్వకపోవడంతో ఏవిటంత పరధ్యాన్నంగా వున్నారు? అడిగారు

ఏంలేదు' చెప్పండి' సర్దుకొని కూర్చున్నాడు రఘు

మనసు బావు లేనప్పుడు ఏకాంతంగా గడపడం మంచిదికాదు' నలుగురితోనూ నవ్వుకొంటే కొంత రిలీఫ్' మనసు మళ్ళి ఆ విషయంపై నున్న ధ్యాస తాత్కాలికంగానైనా కొంత తగ్గుతుంది'

అబ్బే' ఏంలేదు' చెప్పండి' సంబాళించుకున్నాడు రఘు ఎటెన్షన్‌లో కూర్చున్నాడు క్రిష్ణారావుగారు చెప్పడం మొదలుపెట్టారు

వీరి పేరు అష్టావధానిగారు' పెద్ద ఘనాపాటి' అంటూ పక్కనున్న పెద్దమనిషిని చూపించి పరిచయం చేసారు

నా పేరు రఘు చేతులు జోడించి నమస్కరించాడు రఘు

దీర్ఘా యుష్మాన్‌భవ' దీవించారు అవధానిగారు

మా జిల్లా మొత్తంమీద వీరి పేరు నెరుగనివారు లేరంటే అతిశయోక్తి కాదు' వీరు మా కుటుంబ పురోహితులు' అని ఆగారు క్రిష్ణారావుగారు

ఇంత దూరంలో వుండటం వల్ల తమ పేరు ప్రఖ్యాతులు తెల్సుకో లేకపోయినందుకు సిగ్గుపడుతున్నా' అన్నాడు రఘు నమ్రతగా

అవధానిగారు ప్రసన్న వదనులయ్యారు

క్రిష్ణారావుగారు చెబుతున్నంత పెద్దవాణ్ణేంకాదు బాబూ' నామీదున్న అబిమానంకొద్దీ అలా అంటారు కొన్ని వేదాలు చదివా' పౌరోహిత్యం చేస్తున్నా' అన్నారు

వీరు ముహూర్తం పెడితే తిరుగులేదండి' ఆ దంపతులు ఏమాత్రం పొరపొచ్చాలు లేకుండా ఏ ఎడబాటు లేకుండా పెద్దకాలం అన్యోన్య దాంపత్య జీవితాన్ని అనుభవిస్తారు ఎల్లుండి ముహూర్తమే మంచిదని వీరనడంతో టైము చాలకపోయినా సిద్ధపడ్డాం! ఆ ముహూర్తబలం మీద మాకు నమ్మకం వుంది!" చెప్పారు క్రిష్ణారావు

ముహూర్తాలకి అంతటి బలం వుంటుందంటారా? జాలగా అవధానిగారిని అడిగాడు రఘు

వివరంగా చెప్పసాగారు అవధానిగారు

ఒక్కో ముహూర్తానికి నిశ్సందేహంగా అంతటి బలం వుంటుంది బాబూ' వధూవరుల తారాబలం చంద్రాబలం చూసి అటువంటి ముహూర్తం పెట్టడానికే తహతహ లాడ్తాం! వారు అన్యోన్యంగా జీవించాలనే కదా పెద్దలు ఆశించేది'కాంక్షించేదీనూ

'అటువంటి దివ్యమైన ముహూర్తంలో వివాహం జరిగితే ఆ దంపతులకి ఎడబాటు వుండదంటారా? మళ్ళీ అదే ప్రశ్న వేసాడు రఘు



అవధానిగారి పెదవిపై చిరునవ్వు చిందులు వేసింది

ఎడబాట్లు వారి వారి గ్రహస్థితి ననుసరించి కలుగుతాయ్ బాబూ' వీణ అపశ్రుతి పలికిందని పక్కన పడేస్తామా? సరిచేస్తాము అన్యోన్య దాంపత్య జీవితానికి సీతారాముల దాంపత్యాన్ని ఆదర్శంగా తీసుకొంటాం కానీ ఆ పురాణ పురుషుని కూడా దారా వియోగం తప్పలేదు అష్టకష్టాలు పడి ఆ రావణునితో పోరాడి ఆ మహాసాధ్విని చెరవిడిపించాడు తిరిగి గ్రహించాడు అది ఉత్తమ పురుషుల లక్షణం!

జనకుడు తన పుత్రికను సహధర్మచారిణిగా నిర్ణయించాడు ఆమె చేతిని రఘురాముని చేతిలో వుంచి అప్పగిస్తూ—

ఇయం సీతామయ సుతా



"మహిషాసుర మర్ధిని

(ఊహా చిత్రం)

చిత్రకారుడు – వెల్లటూరి పూర్ణానందశర్మ

## నిశ్శబ్ద సంగీతం

సహధర్మ చరి తవ
ప్రతీచ్ఛ చైనాం బద్రంతే
పాణిం గృహ్ణీష్య పాణినా – అని అన్నాడు

జానకి చేయి పట్టుకొని అగ్ని చుట్టూ ప్రదక్షణం చేసి ఎట్టి పరిస్థితుల్లోనూ ఆమేను త్యజించనని ప్రమాణం చేసాడు జానకీ నల్లబుడు వివాహ కార్యక్రమంలో ముఖ్యమైన ఘట్టం అదే! ఆ తర్వాత జీలకర్రా బెల్లం నూరి ముద్ద చేసి వదువు తలపై వుంచడం అతి ముఖ్యమైనది అదే సుమూర్తపు మడియ ఆ రెండు వస్తువులూ ఒక దానితో ఒకటి ఎలా అతుక్కొని వుంటాయో ఆ నూతన దంపతుల మనసులు కూడా ఎటువంటి పొరపొచ్చాలూ లేక కల్సిపోతాయని పెద్దల అభిప్రాయం! తలమీద పాటిని వుంచి చేయి వేసి నిన్ను విడవను, ఐకమత్యంతో వుంటాను అని ప్రమాణం చేయడం అన్న మాట! ఇదే అత్యంత ప్రాధాన్యత గల ఘట్టం నేటి నాగరిక ప్రపంచంలో రాను రాను పాణిగ్రహణానికి వున్నంత ప్రాముఖ్యత మంగళసూత్ర ధారణకి వచ్చింది వివాహ తంతు పూర్తయ్యాక కన్యాదాత తన పుత్రిక చేతిని అల్లుని చేతిలో వుంచి తన కుమార్తెను అతి జాగ్రత్తగా చూసుకోమని అశ్రుపూరిత నయనాలతో అర్థిస్తాడు

అష్ట వర్షా భవేత్ కన్యా
పుత్ర వత్సాలితా మయా
ఇదానీం తనధా స్వామి
దత్తా స్నేహేన పాల్యతామ్

ఎనిమిది సంవత్సరాల వయసుగల ఈ కన్యను నా కుమారుని వలె ప్రేమించ్చాను! ఇప్పుడు నీకు అప్పగిస్తున్నాను! అప్పగించిన ఈ కన్యను ప్రేమతో స్నేహంతో చూసుకో– అని ఈ శ్లోకం అర్థం

అవధానిగారు చెప్పేది జాగ్రత్తగా వింటున్నాడు రఘు

మరేంలేదు బాబూ! ఒక్క మాటలో చెప్పాలంటే స్త్రీ శారీరకంగా అబల! పురుషుని అహంకారానికీ, మూర్ఖత్వానికీ బలయ్యేది స్త్రీయే! ఆమెకు రక్షకుడుగా పోషకుడుగా వుంటూ, ఆమెను ఆదరించి అభిమానిస్తూ ప్రేమిస్తూ తన జీవిత బాగస్వామిగా చూసుకోవాలి! పురుషుడు ఆవేశకావేషాలకు లోనుగాక ప్రేమతో అబిమానంతో లాలించాలి! తన జీవిత కుసుమం రాలిపోయి భర్త పాదాల చెంతనే పడాలని కోరుకొంటుంది అంతేగాని ఏ బోగభాగ్యాలనూ ఆశించదు

రఘు కళ్ళు చెమ్మగిల్లాయి ఆ కన్నీటి పొరల్లో ఎదుటి వ్యక్తి కన్పించ లేదు తీలగా రేణు మాత్రం కన్పిస్తోంది

★ ★ ★ ★

బొంభాయిలో తులసీరాం పెద్ద బట్టల వ్యాపారి వయసు నలభై దాటి వుంటాయి పరువూ పలుకుబడీ వున్న దనవంతుడు రఘుని ఓదార్చి ధైర్యం చెప్పాడు

పోలీస్‌కి రిపోర్టు చేద్దాం అన్నాడు రఘు అతని అవివేకానికీ తొందరపాటుకీ నవ్వుకొన్నాడు తులసీరాం

వాళ్ళంత సుళువుగా దొరకరు రఘు సాబ్! మోసాన్ని మోసంతోనే సాధించాలి నాతో రండి! అంతా నేచూసుకొంటా! నేను చెప్పినట్టు మాత్రం చేయండి!"

అతని మాటలు రఘుకి నచ్చలేదు అయినా బార్యను చూడాలన్న తహతహతో సరే అన్నాడు ఇద్దరూ కారులో బయలు దేరారు తులసీరాం కారుని ఆరంతస్థుల బవనం ముందు ఆపాడు ఇద్దరు గూర్ఖాలొచ్చి అతనికి సలాం చేసారు గేటు ఓపెన్ చేసారు టైం చూసుకొన్నాడు రఘు రాత్రి ఎనిమిది గంటలైంది కారుని నిర్ణీత ప్రదేశంలో పార్కు చేశాడు తులసీరాం ఓ గూర్ఖా వచ్చి కారు తలుపు తెరిచాడు హుందాగా దిగాడు తులసీరాం ఎదురైన వారిలో చాలామంది తులసీరాంకి మర్యాద యిస్తున్నారు కొందరు విష్ చేస్తున్నారు కొందరు చేతులు జోడించి నమస్కరిస్తున్నారు తులసీరాంని అనుసరించాడు రఘు లిఫ్టులో నాలుగో అంతస్థు చేరుకొన్నారు

తులసిరాంని చూడగానే పెన్నిధి దొరికినంతగా సంతోషించాడు ఆ హవుస్ యజమాని చందూలాల్ ఆదరణా గౌరవ మర్యాదలు అతని చేతల్లోనూ చూపుల్లోనూ కన్పిస్తున్నాయి తులసీరాంకి ఎదురుగా వచ్చి సవినయంగా నమస్కరించి తోడ్కొని వెళ్ళాడు సోఫాలో ఆశీనుడయ్యాడు తుల్సీరాం అతని పక్కనే కూర్చున్నాడు రఘు

చందూలాల్ డ్రింక్స్‌కి ఆర్డరు చేయబోతూంటే వారించాడు తులసీరాం రఘుని అతని స్నేహితునిగా హైదరాబాద్‌లోని ఒక పెద్ద టెక్స్‌టైల్ మిల్ ఓనరుగా పరిచయం చేసాడు

వారం రోజుల క్రితం తాను కల్సిన అమ్మాయిని అంటే రేణుని వర్ణించి మరలా ఆ అమ్మాయి కావాలన్నాడు తులసిరాం

ఆ అమ్మాయి వున్న జైపూర్ ట్రూప్ వెళ్ళి పోయింది సార్! రెండు రోజులైంది మరో మంచి ట్రూప్ మధురై నుంచి వచ్చింది అంతా మదరాసీలే! హైక్లాస్ ఫామిలీ లేడీస్! ఆ ట్రూప్‌కన్నా బావుంటుంది! చెప్పాడు చందూలాల్

షాక్ తిన్నాడు రఘు

నిరాశ చెందాడు తులసీరాం

ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెప్పి ఆ ట్రూప్ ఎక్కడికి వెళ్ళింది తెల్సుకోవాలని ప్రయత్నించాడు

అలాంటి ట్రూప్‌లు ఎక్కడా వారం పది రోజులు కన్నా వుండవు సార్! వుంటే మాలాంటి వాళ్ళకి చాలా యిబ్బందులూ చిక్కులూ వుంటాయి అందుకే వారు

# లోక స్వభావం

## ధర్మపథం




మంచి పని చేస్తే అది ప్రచారంలోకి రావడం కష్టం. వచ్చినా, ఆలస్యంగానే ప్రచారానికి వస్తుంది. కాని చెడ్డ పని మాత్రం చాలా శీఘ్రంగానే అంతటా వ్యాప్తిలోకి వస్తుంది. ఇది లోక స్వభావం. మనిషిలో మంచి గుణాలు ఎన్ని వున్నా, అవి లెక్కలోకి రావు. ఒక్క చెడ్డ గుణం ఉంటే మాత్రం దానిని వేలుపెట్టి చూపిస్తారు. ఒకరు మరొకర్ని గురించి చెడ్డగా చెప్తే, ఆ వ్యక్తిని తాము ఎరగకపోయినా "ఆయనను గురించి యిలా అంటున్నారు" అని ప్రచారం చెయ్యడం జరుగుతూ వుంటుంది.

శీలవతి అయిన యువతి కొంత స్వతంత్రంగా ప్రవర్తిస్తే, ఆమెపయి కొందరు లేనిపోని నిందలు వేస్తారు. గతానుగతికమైన లోకం వారిని అనుసరిస్తుంది. దీనివల్ల వారికి ప్రయోజనం ఉండదు. వారికి, ఆ నిందలవల్ల ఆమె ఎంత బాధ పడుతుందో, ఎలాటి చిక్కులకు, కష్టాలకు గురి అవుతుందో తెలియదు. కాకులవంటి లోకులు మహా సాధ్వీమణి అయిన సీతాదేవినే అపనిందకు పాలుచేసి, కష్టాలకు గురి చెయ్యడం మనకు బాగా తెలుసును.

విద్వత్కవులలో కూడా ఇదే పద్ధతి. కవి, పండితులకు, తోడి కవి పండితులపై అసూయా ద్వేషాలు అనాదిగా వస్తూనే ఉన్నవి. భవభూతివంటి మహాకవి కూడా, ఈ అసూయ ద్వేషాలకు గురికాక తప్పలేదు. అతని తొలి రెండు నాటకాలు బాగులేవని అసూయాపరులగు కొందరు విద్వత్కవులు చెప్పగా– ఇతరులు కూడా అలాగే భావించగా భవభూతికి కోపంవచ్చి "నన్ను మెచ్చుకొనేవారు ఉండకపోరు" అని నోరారా చెప్పి, అత్యుత్తమమైన ఉత్తర రామచరిత్రలో "యథా వాచాం తథా స్త్రీణాం సాధుత్వే దుర్జనో జనః" అని చెప్పుకొన్నాడు. దురాత్ములైన జనులు స్త్రీలయొక్కయు, వాక్కుల యొక్కయు మంచిని గ్రహించలేరు" అని దీని అభిప్రాయం.

మంచి చెడ్డలు ఆలోచించకుండా ఎవ్వరినీ నిందించకూడదు. ఇతరుల విషయంలో సాధారణంగా జోక్యం మంచిదికాదు. మనిషిలో దుర్గుణాలు కొన్ని ఉండవచ్చును. వాటివల్ల ఇతరులకు హానికలిగినప్పుడే జోక్యం కలుగ జేసుకోవచ్చును. లేనప్పుడు– అతని పాపానికి అతనిని విడిచిపెట్టి తాము మూకీభావాన్ని వహించడమే సర్వ విధాలా శ్రేయం. అనవసరంగా ఇతరులను విమర్శించడం చెడ్డది.

–బులుసు వేంకట రమణయ్య

---

పోతామంటే మేము అడ్డు చెప్పం!" చెప్పాడు చందూలాల్

"ఆ లీడరు పేరు తెల్సా?" ఆతృతగా అడిగాడు రఘు. అలా ప్రశ్నించడం తులసీరాంకి నచ్చలేదు. అయినా ప్రశ్నించడం జరిగి పోయింది. చందూలాల్ వైపు చూసాడు జవాబు కోసం. చందూలాల్‌కి అనుమానం వేసింది. ప్రమాదం వచ్చేలా వుందని గ్రహించాడు.

"వాళ్ల వివరాలు తెలియవు సార్! మేం అడగం! వాళ్ళు చెప్పనూ చెప్పరు. .. అలాంటి ట్రూప్‌లు చాలా వస్తూ వుంటాయ్, పోతూ వుంటాయ్. వెరైటి కొసమని వారం రోజులు వుండనిస్తాం! ఎక్కడకి వెళ్లేది వారు చెప్పరు. మా కనవసరం కాబట్టి మేము అడగం!" అన్నాడు

నిరాశతో లేచారిద్దరూ కారు తిరుగుముఖం పట్టింది.

"మీ ఆలుమగల్ని కలపాలని ప్రయత్నించాను! ఫలితం దక్కలేదు! శ్రమ యిచ్చినందుకు క్షమించండ్సార్!" బాధపడ్డాడు తులసీరాం కారు డ్రైవ్ చేస్తూ

"ఆమె మరలా ఉత్తరం రాస్తుందంటారా?" –అడిగాడు రఘు చిన్నపిల్లవానిలా.

"మీరింత అమాయకులనుకోలేద్సార్! ఉత్తరం రాసి పోస్టు చేసే అవకాశం ఆమెకు దొరకనిస్తారా? అలా ప్రయత్నించి ఆమె చాలాసార్లు దొరికి పోయారట! అందుకే నాచేత రాయించారు! ఇదివరలో నలుగురైదుగురుతో చెప్పారట! మరి వారు మీకు రాసారో లేదో తెలీదు!"

"లేదు సాబ్! ఇంతవరకు ఆమె వునికి తెలీదు! చనిపోయిందేమోనని భయపడ్డాను!" చిన్న పిల్లవానిలా వలవలా ఏడ్చాడు రఘు

"అధైర్యపడకండి సార్! ఆమె మరలా వుత్తరం రాయిస్తారు. మిమ్మల్నిద్దర్నీ కలుపమని ఆ రఘురాముని ప్రార్థిస్తున్నా!"

రఘు భుజంపై చేయివేసి అనునయించాడు తులసీరాం

బరువైన హృదయంతో తిరిగి హైదరాబాద్ చేరుకొన్నాడు రఘు

(ఇంకాఉంది)




# బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

## పాఠకుల ప్రశ్నలకి బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్య ప్రముఖుని సమాధానాలు

### టి సంధ్యావాణి, గోదావరిఖని

ప్ర : నాకు మా అబ్బాయి (5సం) పుట్టినప్పటి నుండి ముక్కుపై చిన్న నల్లటి మచ్చ ఏర్పడింది అది ఇప్పుడు కొద్దిగా పెరుగు తున్నట్లుగా ఉంది దానికి ఏదైనా నివారణ చెప్పండి

జ బైద్యనాథ్ రక్త శోధక టాబ్‌లెట్స్ బైద్యనాథ్ సురక్తా స్ప్రాంగుతో ఉదయం, సాయంత్రం రోజు రెండు సార్లు వాడండి పై పూతకు బైద్యనాథ్ సోమరాజీ తైలంగానీ నింబాది తైలం గానీ వాడండి పులుపు, కారం ఉప్పు తగ్గించాలి

### ఎన్ రమేష్, నిర్మల్

ప్ర : నా వయస్సు 16 సంవత్సరములు, నేను ఎత్తు పెరగలేదు దీనికి మీ సలహా ఏమిటి? ఎత్తు పెరగటానికి మెడిసిన్ వ్రాయగలరు నా కండ్లు సరిగా కనపడుట లేదు

జ : ఎత్తు పెరగడానికి వీలైన వ్యాయామం చేయండి బలము కలిగించే బైద్యనాథ్ చ్యవన్‌ప్రాశ స్పెషల్, ద్రాక్షాసవ వాడండి దృష్టి లోపానికి బైద్యనాథ్ మహా త్రిఫలామృతం లోనికి వాడవచ్చు దృష్టిలోపానికి నేత్ర వైద్యుడ్ని సంప్రదించితే మంచిది

### ఎం ప్రకాష్, విజయవాడ

ప్ర : పచ్చ కామెర్లు ఎలా వస్తుంది? రాకుండా ఉండాలంటే తీసుకోవలసిన జాగ్రత్తలు పచ్చ కామెర్లకు అయుర్వేదంలో తగిన మందులు ఉన్నాయా? ఉంటే తెలుపండి

జ బైద్యనాద్ లివరెక్స్ మాత్రలు, మరియు బైద్యనాథ్ ఆరోగ్య వర్ధిని బటి, బైద్యనాథ్ కుమారీ ఆసవ లేక బైద్యనాథ్ భృంగ రాజా సవలతో వాడవలెను తేలికగా జీర్ణమయే చప్పిడి ఆహారము మలబద్ధము లేకుండా చూసుకొనుట చాలా మంచిది స్వంత వైద్యము కన్నా దగ్గరలో నున్న మంచి అయుర్వేద వైద్యుడిని సంప్రదించటం చాలా మంచిది

### శ్రీమతి రమాగాంధీ, పొన్నమండ

ప్ర నా వయస్సు 30 వయస్సును మించిన లావు, బరువు కాస్త బరువు తగ్గి సన్న బడటానికి అయుర్వేద ఔషధం తెలపండి,

జ బైద్యనాద్ మేదోహర విడంగాది లోహం మాత్రలు బైద్యనాద్ దశ మూలారిష్ట, మరియు లోహా సవత్ వాడండి వ్యాయామం, శారీరక శ్రమ చేయండి క్రొవ్వు కలిగించే పదార్థాలు వాడవద్దు

### డి రామచంద్రరావు, నెల్లూరు

ప్ర పొట్ట పెద్దదిగా అయినది లివరులో నీరు చేరిన దంటున్నారు రోజుకు 4 సార్లు బేదులు అవుతావి ఆకలి అవుతుంది తింటే జీర్ణము కాదు దయ చేసి సలహా చెప్పండి

జ : లివరులో నీరు చేరినదని డాక్టర్లు చెప్పినారా! మీకు కలిగేది ఆకలికాదు అది భ్రమ బైద్యనాథ్ లివరెక్స్ మాత్రలు, బైద్యనాథ్ అరోగ్య వర్ధిని బటి, బైద్యనాథ్ భృంగ రాజాసవతో ప్రతి రోజు ఉదయం, సాయంత్రం రెండుసార్లు వాడాలి బలమైన తేలిక ఆహారం అవసరం

### కె సత్యనారాయణ, ఖమ్మం

ప్ర నరాల బలహీనత వల్ల వచ్చు కీళ్ల నెప్పులు మరియు వాపులు

జ : బైద్యనాద్ స్వర్ణమహాయోగ రాజగుగ్గులు మాత్రలు బైద్యనాద్ మహా రస్నాది కాథాతో ఉదయం సాయంత్రం వాడండి నరముల బలహీనతకు బైద్యనాద్ స్వర్ణ మకర ధ్వజ మాత్రలు, బైద్యనాద్ చ్యవన ప్రాశ స్పెషల్, బైద్యనాద్ అశ్వగంధారిష్ట వాడండి అజీర్ణం చేసే పదార్థములు వరుగులు నిల్వ పదార్థములు, కారము పులుపు తగ్గించాలి

### శ్రీమతి కమలానాథ్, మీర్జాపూర్, (ఉత్తరప్రదేశ్)

ప్ర నాకు పెళ్లయి 3 సం అయ్యింది ఇప్పుడు రెండేళ్ళ బిడ్డ గత రెండేళ్ళుగా రాత్రిం బవళ్ళు నాకు నడుములో నెప్పి ఎన్ని మందులు వాడినా తగ్గడం లేదు పుట్టిన నెల రోజుల నుంచి నా బిడ్డకి నా దగ్గర పాలు లేవు నా నడుము నెప్పికి దీనికి ఏమైన సంబంధం ఉందా? ఉపశమనం?

జ : మీ శరీర తత్వం బలహీన మైనదా? నెలసరి ప్రకృతి సరిగా ఉన్నదా? అవి సరిగా ఉంటే బైద్యనాథ్ విటా– ఎక్స్, బైద్యనాద్ అశ్వగంధారిష్టతో రోజుకు రెండుసార్లు వాడండి నెల సరి ప్రకృతి సరిగా లేక పోతే బైద్యనాథ సుందరీ కల్ప ఫోర్టుతో బైద్యనాద్ విటా– ఎక్స్ టాబ్‌లెట్స్ వాడండి

### ఎస్ రవి కావలి

ప్ర గత మూడు మాసముల నుంచి ఎడమ తుంటి మొదలుకొని ఎడమ కాలు వెనుక భాగమంతా, మరియు ఎడమకాలు పిక్క మడమ వరకు నెప్పిగా ఉంటున్నది ఎమ్ డి డాక్టర్లకు ఎముకల డాక్టర్లకు చూపించాను వారిచ్చు మందులు తాత్కాలిక ఉపశమనముగా నున్నవి నెప్పి తగ్గుట లేదు దయ యుంచి తగిన మందు, వాడు విధానము తెల్ప ప్రార్థన.

జ : బైద్యనాథ్ ఏకాంగ వీర రసము, బైద్యనాథ్ వాత రవ ఒక్కొక్క మాత్ర చొప్పున ఉదయం, సాయంత్రం బైద్యనాథ్ మహా రాస్నాది కాథా రెండు చెంచాలు మందు రెండు చెంచాల నీటితో కలిపి సేవించేది పైకి బైద్యనాథ్ మహానారాయణ తైలము లేక బైద్యనాథ్ మహా విష గర్భ తైలము మర్దన చేయవలెను ☐

---

**కూపన్**

**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**

**బైద్యనాథ్ ఆరోగ్య దీపిక**

ప్రశ్న : ..........................................

..........................................

..........................................

పంపినవారి పేరు :

పూర్తి చిరునామా :




"ఏవండీ! ఆ లక్ష్మీపురం సంబంధం వాళ్ళని మళ్ళీ కదిలించారా?'

సీతమ్మ నీరసంగా భర్తనడిగింది

నేలమీద బాసిపట్టు వేసుకొని దీక్షగా ఎకౌంట్లు రాస్తున్న సుదర్శనం ఒక్కసారి పని ఆపి, కళ్ళజోడు తీసి తుడుచుకుంటూ భార్య వైపు చూచి "కాసేపు ఆగు! ఈ లెక్కలు వేయటం అయిన తరువాత చెబుతాను!" అని మళ్ళా కళ్ళజోడు తగిలించుకొని ఎకౌంటు పుస్తకాల్లో మునిగి పోయాడు

పెద్ద కూతురు సుశీల తలిదండ్రుల సంభాషణను చాప మీద పడుకొని నిద్ర నటిస్తూ వింటూనే ఉంది

గోడ మీద తాతల నాటి పాత గోడ గడియారం రంగు తంగున రాత్రి పదకొండును సూచిస్తూ గంటలు వినిపించి అవిశ్రాంతంగా తన పని చేసుకుంటూ పోతూంది.

సుదర్శనం రెండో కూతురు టెంత్ చదువుతోంది. స్కాలర్‌షిప్ తెచ్చుకోవాలని ఆ పిల్ల ప్రయత్నం.

ఇక నిద్రపోవే!" సుదర్శనం జాలిగా అన్నాడు రెండో కూతుర్ని వైపు చూస్తూ

"ఉండునాన్నా!' అని ఆ పిల్ల తాను చేస్తున్న చివరి లెక్క పూర్తిచేసి పోయి తమ్ముడి పక్కన పడుకొని దుప్పటి కప్పుకుంది

హఠాత్తుగా ఏదో గుర్తుకు వచ్చి సుదర్శనం భార్య వైపు తిరిగి, 'మాత్ర వేసుకున్నావా? అన్నాడు

ఆమె ఏమి పలకలేదు

అయిపోయినాయని పొద్దున చెప్పావు గదూ రేపు తెస్తాలే!'

అని మళ్ళీ ఎకౌంటు పుస్తకాల వైపు తిరిగాడు

'ఏవండీ! ఆ లక్ష్మీపురం సంబంధం ?" అన్నది సీతమ్మ

సుదర్శనం తన పుస్తకాలను సర్ది వచ్చి భార్య ప్రక్కన కూర్చున్నాడు.

"నీ ఆరోగ్యం నువ్వు చూసుకోవే ముందు! దాని పెళ్ళి అదే అవుతుంది గానీ!" అన్నాడు లాలనగా

"పిల్ల ఈడేరి పదేళ్ళు కావస్తూంది. దాని తోటి వాళ్ళు ఇద్దరు ముగ్గురు పిల్లలకు తల్లు లయ్యారు గూడా సీతమ్మ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి

పిచ్చిదానా! నాకు మాత్రం తెలీదా! సుదర్శనం భార్య తల నిముర్తూ అన్నాడు

నేనే పని చేస్తున్నా మన సుశీల నా మదిలో ఎప్పుడూ మెదులుతూనే ఉంటుంది ఎన్ని సంబంధాలు చూశానో నాకే గుర్తు లేదు! ఏం చెయ్యను చెప్పు? ఒకడు ఆస్తి ఉన్న పిల్ల కావాలంటాడు ఇంకోడు ఉద్యోగం చేస్తున్న పిల్ల కావాలంటాడు మరోడు సంగీతం అంటాడు. నాట్యం అంటాడు! అందరూ కట్నం అంటారు! ఎక్కడ తేను చెప్పు? నువ్వు చూస్తూనే ఉన్నావు గదా! రేయింబవళ్ళు పని చేస్తుంటేనే ఈ మాత్రం సంసారం గడుస్తోంది!'

సీతమ్మ నీరసంతో కళ్ళు మూసుకుంది ఆమె కనుకొలకుల్లోంచి రెండు కన్నీటి చుక్కలు ఎండిపోయిన చెంపల మీద నుంచి జారి దిండు మీద పడ్డాయి

సుదర్శనం కాసేపట్లోనే తన శ్రమనంతా

మరచిపోయి గుర్రు పెట్టి నిద్రపోసాగాడు

ఆ యింట్లో ఇప్పుడు మెలకువగా ఉన్నది సుశీల మాత్రమే!

పాతిక సంవత్సరాల నిండు యవ్వనంలో ఉన్న సుశీల ఇటువంటి రాత్రుల నెన్నిటినో నిద్ర లేకుండా గడిపింది

తన బాధ యేమిటో తనకే తెలియని పరిస్థితిలో ఆమె మనసు పరిపరి విధాల పోతోంది

బి కాం పాసయి మూడేళ్లయింది నాన్న ఎన్ని కష్టాలుపడయినా తనను యం కాం చదివించడానికి సిద్ధపడ్డాడు

కానీ ఏక్కడకు పోయినా రిజర్వేషన్లు!

తనకంటే బాగా తక్కువ మార్కులు వచ్చిన వాళ్లకూడా సీట్లు వచ్చాయి! తనకు రాలేదు

ఎన్ని పోటీ పరీక్షలు రాసిందో, ఎన్ని ఇంటర్వ్యూలకు వెళ్లిందో తను లెక్కలేదు

రిజర్వేషన్ దెబ్బకు అన్నిటిలో అపజయమే తనకు!

ఈ మూడేళ్లలో తెలుగు ఇంగ్లీషు టైపు హయ్యర్ పూర్తి చేసింది షార్ట్‌హాండ్ హయ్యర్‌కు సిద్ధమవుతూంది

నాన్న ఈ ఫీజులు కట్టడానికే ఎన్నో ఇబ్బందులు పడుతున్నాడు అయన పగలంతా ఆ స్టేట్ బ్యాంకు దగ్గర చలానాలు అప్లికేషను ఫారాలు వ్రాసి ఏదో పరకో సంపాదిస్తాడు షాపుల వాళ్ల ఎకౌంట్లు వ్రాసి ఎలాగో సంసారాన్ని గట్టెక్కిస్తున్నాడు

నాన్నకు తన దొక్కటే సమస్య కాదు!

తనకో చెల్లెలూ తమ్ముడూ! వాళ్ల చదువు సంధ్యలన్నీ ఎలాగో ఏమో!

ఈ పరిస్థితుల్లో తనకు పెళ్లి ఎలా చేయగలడు?

పోనీ కట్నం ఇవ్వలేకపోయినా, ఆడపిల్ల తండ్రిగా తనకు పెళ్లి చేసి పంపాలి గదా! అయిదారు వేల రూపాయలైనా లేనిదే ఈ రోజుల్లో పెళ్లి జరగదు ఎక్కడి నుంచి తెస్తాడు?

నాకు తెలుసులేవే! అమ్మాయిని ఒక అయ్య చేతిలో పెట్టాలని నేనూ ప్రయత్నాలు చేస్తున్నాను"

నాన్న కలవరిస్తున్నాడు

అవును! ఎప్పటికైనా తను ఒకరింటికి పోవలసిందే! అదే తను మగపిల్లవాడైతే ఇక్కడే ఉండి అమ్మకూ నాన్నకూ సేవలు చేస్తూ గడపడానికి వీలుండేది

ఇప్పుడు తన వల్ల ఏం ప్రయోజనం? నాన్నకు అదనపు భారం తప్ప! ఆయనకు తనను గురించే దిగులంతా! నిన్నటికి నిన్న షార్ట్‌హేండ్ పరీక్ష ఫీజు కట్టడానికి డబ్బు లేక నాన్న కన్నీళ్లు పెట్టాడు! సమయానికి సువార్తరావు దేవుళ్లా వచ్చి రక్షించబట్టి సరిపోయింది

సుశీల కళ్లముందు సువార్తరావు మూర్తి మెదిలింది

సువార్తరావు సుశీలతో పాటు షార్ట్‌హాండు నేర్చుకుంటున్నాడు

తను ఇబ్బందుల్లో ఉంటున్నట్లు ఎలా గమనించాడో ఏమో గాని సువార్తరావు తన పరీక్ష ఫీజు కూడా కట్టాడు నిజంగా అతడు మనుషుల్లో దేవుడు!

మంచి తనానికి కులాలూ మతాలూ అడ్డు వస్తాయా?

మొట్ట మొదట్లో అతణ్ణి చూచినప్పుడు రౌడీలా అనిపించాడు

అతని మనసులో దాగిన మంచి తనాన్ని చూచిన తరవాత శరీర సౌందర్యం కంటే మానసిక సౌందర్యమే ముఖ్యమని తాను తెలుసుకున్నది

మరుసటి రోజు సుశీల ముఖంలో ఎన్నాళ్ల



నుంచో స్పష్టాస్పష్టంగా ఏర్పడి ఉన్న విచార రేఖలు మటుమాయ మయ్యాయి కన్నుల్లో కొత్త కాంతి చోటు చేసుకున్నది

హుషారుగా షార్టుహేండ్ శిక్షణ కేంద్రానికి వెళ్ళింది. సువార్తరావును చూడగానే ఆమె ముఖం వికసించింది. చిరునవ్వుతో సిగ్గుతో కన్నులతోనే అతణ్ని పలకరించింది

సుశీలలో వెల్లి విరిసిన ఈ నూతన తేజాన్ని సువార్తరావు వెంటనే పసిగట్టాడు

క్లాసు పూర్తి కాగానే సుశీల సువార్తరావు కోసం బయట వేచి వుంది.

ఇద్దరూ నెమ్మదిగా నడువ సాగారు సువార్తరావు కాళ్ళు ఎ.సి హోటల్లోకి దారి తీశాయి. సుశీల అనుసరించింది.

లోపల గుడ్డి వెలుగులో సుశీల కన్నుల్లో భావాలను సువార్తరావు క్షుణ్ణంగా చదివాడు.

ఆమె చేతిని మృదువుగా స్పృశించాడు ఆమె పాదాన్ని తన బొటన వ్రేలితో మీటాడు.

మాటలు మొదలు పెట్టాడు

నవ్వులు వెల్లి విరిశాయి.

ఇద్దరూ బయటకు వచ్చారు.

దారులు చీలాయి సుశీల ఇంటి ముఖం పట్టింది

రోజు రోజుకీ సుశీల హృదయం సువార్తరావుకు చేరువ కాసాగింది.

అతనితో ఎక్కువ సేపు గడుపుతోంది. ఒక రోజు పార్కులో, ఇంకో రోజు హోటల్లో, మరొక రోజు సినిమా హాల్లో.. గంటల కొలది కాలాన్ని సుశీల సువార్తరావుతో సంభాషిస్తూ హాయిగా గడిపి వేస్తోంది.

సుశీల ఎంత ఆలస్యంగా వచ్చినా ఇంట్లో అడిగేవారే లేరు.

తల్లి మంచం పట్టి ఉంది.

తండ్రి రేయింబవళ్ళు పనిలోనే నిమగ్నమై ఉంటాడు.

పైగా కూతురి మీద అంతులేని విశ్వాసం ఆయనకు! తండ్రి విశ్వాసాన్ని సుశీల వమ్ము

# విజయదశమి

ప్రళయ భయంకర ఏ విఘాత తళుకులు
ఫల్గుణు నతిఘమ విఱుగు ళ్ళనగ
అవిరళాంభో ధర అతులిత గర్జనల్
గాడ్పు చూలి గుదియ ఘట్టనగ
తనరు మధూలిక తమ్మి తటాకముల్
అనఘమ పాంచాలి హసన మనగ
తిమిరమ్ము ఛేదించు దశమి కౌముది కారు
ధర్మజు నిర్మల స్మైర్యమనగ
పాండు నందన చర్యలన్ ప్రకృతికినిడి
జల మయంబైన పెను దీన జనుల జూచి
అక్షయాబ్దార్థమున నక్షయంబు జేయ
వింత మనమ్మున నేతెంచె విజయదశమి

-వూట్ల శ్రీ

# గాలివాన వెలిసింది

చేయలేదు శారీరకంగా మాత్రం ఆమె ఏ తప్పూ చేయలేదు

* * * *

' . ఆలోచించు సుశీ! ఇలా మనం ఎన్నాళ్ళు గడప గలం? ఏదో ఒకదారి చూడాలి!" సువార్తరావు సుశీల చేతిని తన చేతిలోకి తీసుకొని మృదువుగా నిమురుతూ అన్నాడు

సుశీల సుకుమారంగా తన చేతిని ఇవతలకు తీసికొంది.

"సుశీ! నువ్వు మన విషయం మీ యింట్లో చెప్పి ఏం ప్రయోజనం? మీ అమ్మా నాన్నా మీ బంధువులూ ఎవరూ మన పెండ్లికి ఒప్పుకోరు! వాళ్ళు ఒప్పుకోక పోవటం అటుంచి వెంటనే నీకు వేరే వాళ్ళతో పెళ్ళి చేసేస్తారు!'

ఈ చివరి మాట వినగానే సుశీల గుండె జల్లుమన్నది తండ్రి తనకు పెళ్ళి చేయలేని స్థితిలో ఉన్నాడన్న సంగతి మరచిపోయింది

"... అందువలన మీ యింట్లో ఈ విషయం చెప్పడం అనవసరం!"

'మరయితే ఏం చేయాలి? అన్నట్లు చూచింది సుశీల

రేపే ముహూర్తం!' అన్నాడు సువార్తరావు

సుశీల అదిరి పడింది సువార్తరావు నవ్వాడు

'అదే! మనం ఇక్కడ నుంచి వెళ్ళి పోదాం బొంబాయిలో నా ఫ్రెండ్స్ ఉన్నారు 'వాళ్ళు ఏదో ఒక దారి చూపిస్తారు ఏవో చిన్న ఉద్యోగాలు చేసి అయినా ఇద్దరం బొంబాయిలో హాయిగా బ్రతకవచ్చు! తరువాత అక్కడే పెండ్లి చేసుకుందాం పెళ్ళికి మీ వాళ్ళను కూడా ఆహ్వానిద్దాంలే!"

ఆ రోజు రాత్రంతా సుశీల మధుర స్వప్నాలలో విహరిస్తూ కాలం గడిపింది

తనకు నాన్న ఎట్లాగూ పెళ్ళి చేయలేడు తాను ఉన్నదంతా ఆయనకు భారమే! సువార్తరావు సాహచర్యంతో తన జీవితం సఫలమవుతుంది రేపు ఈపాటికి సువార్తరావుతో కలిసి రైల్లో వెళుతూ ఉంటుంది

సుశీల అటూ ఇటూ చూచింది అంతా గాఢ నిద్రలో ఉన్నారు

నెమ్మదిగా లేచి, అలమరలో అమ్మ డబ్బులు దాచే డబ్బా తీసింది వంద రూపాయలు లెక్క పెట్టి తీసుకొని మిగతావి అక్కడే ఉంచింది

* * * *

గాలివాన!

రైలు ప్రకృతికి ఎదురు ఈదుతోంది! ఎదురు సీట్లో కూర్చున్న ముసలమ్మ ఉమ్మి వేయడానికి కిటికీ అద్దం ఎత్తగానే రివ్వుమని జల్లు లోపలికి వచ్చి సుశీల చెంపలు తడిపింది ముసలమ్మ వేసిన ఉమ్ము తిరిగి ఆమె ముఖం మీదే వచ్చి పడగా ఆమె వెంటనే అద్దం దించి గొణుక్కుంటూ ముఖం తుడుచుకొంటోంది

రైల్లో లైట్లు గుడ్డిగా వెలుగుతున్నాయి. సుశీల పైకి చూచింది బెర్తు మీద సువార్తరావు అప్పుడే హాయిగా నిద్ర పోతున్నాడు.

ఇంకా ఎనిమిది కూడా కాలేదు. అప్పుడే నిద్రా!



# మీ బిడ్డల భవిష్యత్తును గురించికాక మీ ఆరాటం వేరేముంటుంది!

# మార్గదర్శి

మీ బిడ్డల భవిష్యత్తు తీర్చిదిద్దడానికి తలపెట్టే ప్రయత్నంలో ఆచితూచి అడుగువేయాలి అందుకు లాభప్రదమైన సంస్థలో మీ డబ్బు పెట్టుబడి పెట్టండి మీరు నిశ్చింతగా ఎంచుకోదగ్గ సంస్థ మార్గదర్శి ఒక్కటే

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధకు నిదర్శనం ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి
మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి పురోగమిస్తున్నది అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు 50 కోట్లు దాటింది' మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది

### ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10 000 | 25 |
| 1000 | 25 | 25 000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10 000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25 000 | 50 |
| 1000 | 50 | 50 000 | 50 |
| 2000 | 50 | 1 00,000 | 50 |
| 4000 | 50 | 2 00 000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

### బ్రాంచీలు .

- బషీర్‌బాగ్, హైదరాబాద్
- లకిడికాపూల్, హైదరాబాద్
- చిక్కడపల్లి హైదరాబాద్
- అమీర్‌పేట్ హైదరాబాద్
- ఎమ్ జి రోడ్ సికింద్రాబాద్
- ఎ ఎమ్ సి కాంప్లెక్స్, విజయవాడ
- బందర్‌రోడ్ లబ్బీపేట్, విజయవాడ
- జగదాంబ జంక్షన్ విశాఖపట్నం
- స్టేషన్‌రోడ్ గుంటూరు
- జి పియన్‌రోడ్ వరంగల్
- టి నగర్ రాజమండ్రి
- సుభాష్‌రోడ్ కాకినాడ
- నెహ్రూ రోడ్ కర్నూలు
- వైరారోడ్, ఖమ్మం
- నరసింహారావ్‌పేట, ఏలూరు

డబ్బుకోసమేనా మీ చింత ! మార్గదర్శి ఉన్నది మీ చింత !!



మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్.
రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు
ఆబిడ్ సెంటర్ హైదరాబాద్ - 500 001

Kiron MCF 86 ?

# మహిషాసుర సంహారం

రంభుడనే రాక్షసుడు ఘోర తపస్సు చేసాడు. అగ్ని ప్రత్యక్షమయి వరము కోరుకొనమని అడుగగా, అతి బలవంతుడు దేవతలను జయించగల పుత్రుడు కలుగవలెనని రంభుడు కోరెను. నీవే జంతువుతో కూడుదువో అట్టి పుత్రుడు నీకు కలుగగలడని అగ్నిదేవుడు వరమిచ్చెను. అచ్చటి నుండి రంభుడు వచ్చుచుండగా మహిషము కనబడెను. మహిష్మతి శాపవశమున మహిషమయినది. రంభుడు మహిషముల కలయిక వలన మహిషాసురుడు జన్మించాడు.

దితి తపస్సునకు బ్రహ్మ సంతసించి నీ కుమారుని ముఖము మాత్రము మహిషముగా యుండి మిగతా శరీరము యావత్తు మానవ దేహము వలె యుండునని వరమొసంగెను.

మహిషాసురుడు శివుని గూర్చి తపస్సు చేసినప్పుడు శివుడు ప్రత్యక్షమయితే స్త్రీచే తప్ప వేరొక విధంగా తనకు మరణం సంభవించగూడదని వరము కోరెను.

రాక్షసులెల్లరు మహిషుని కొలుచుచుండిరి. రాక్షసుల సుఖశాంతుల కొరకు మహిషుడు దేవతలను మిక్కిలి బాధించు చుండగా, సకల దేవతలు ఒకే మనస్సుతో, ఒకే దేవి కొరకు ప్రార్థన చేయగా పరమేశ్వరి (దేవి) అవతరించెను. దేవికి దేవతలు తమ తమ ఆయుధములు ఇచ్చి వేసారు. దేవి సింహ వాహనము అధిరోహించి మహిషాసురునితో యుద్ధము చేసి వానిని హతమార్చెను.

అంతట రాక్షస సేన అంతయు నశించెను. దేవగణములందరూ సంతోషించారు. దేవతలు, మహర్షులును దేవిని స్తుతించారు. గంధర్వపతులు పాటలు పాడారు.



మైసూరులో చాముండేశ్వరి కొండ మీద ఉన్న మహిషాసుర విగ్రహం

అప్సరోగణములు నృత్యం చేసారు

మైసూరు చాముండేశ్వరి కొండ మీద అమ్మవారి దేవాలయమునకు వెళ్ళే వారిలో మహిషాసురుని విగ్రహమును చూడవచ్చును.

—పి. వి. ఆర్. అప్పారావు

## గాలివాన వెలిసింది

సుశీల నవ్వుకుంది.

ఏదో స్టేషన్లో రైలు ఆగింది.

"ద్రాక్షా! ద్రాక్షా!!" కుర్రాడొకడు రైలు పెట్టిలోకే తెచ్చి అమ్ముతున్నాడు. సుశీల ఒక రూపాయి ద్రాక్ష తీసుకుంది. రెండు చిన్న గుత్తులు వచ్చాయి. ఒకటి తనకు ఒకటి సువార్తరావుకి. రెంటినీ ఆ కుర్రవాడు ఒక వార్తాపత్రిక కాగితపు ముక్కలో పొట్లం కట్టి యిచ్చాడు.

రైలు కదిలింది. సువార్తరావు గురకలు పెడుతున్నాడు. సుశీల తన భాగం ద్రాక్ష తినాలని నిశ్చయించుకొని పొట్లం విప్పి, ఒక్కొక్క ద్రాక్ష పండుని తుడిచి నోట్లో వేసుకోసాగింది. రైలు వేగం హెచ్చగానే లైట్లు కాంతివంతమయ్యాయి. ఆ వెలుగులో పొట్లం కాగితం మీద ఉన్న ఒక వార్త ఆమెను ఆకర్షించింది. వెంటనే పండ్లన్నీ ఒడిలో పెట్టుకొని ఆ కాగితాన్ని జాగ్రత్తగా చదివింది.

"బొంబాయి వ్యభిచారం గృహంలో ఆంధ్ర అమ్మాయిలు!" ఇదీ హెడ్డింగు.

"..... ఉద్యోగాలు ఇప్పిస్తామనీ, పెండ్లి చేసుకుంటామనీ కల్లబొల్లి కబుర్లు చెప్పి అందమైన యువతులను మోసగించి, బొంబాయి తీసుకొని పోయి అక్కడ వ్యభిచార గృహాల్లో అమ్మే ముఠా......"

సుశీల వేళ్ళు వణికాయి. చేతిలో కాగితం జారి ఎగిరి ఎటో పోయి పడింది.

"ఏల ఈ దేహము
పనికి రాని దెందుకీ మోహము!
జాలమనె సంసార బంధములోన
జిక్కి మూల మెరుగని .ఏ."

ఒక అడుక్కునే పిల్ల బ్రహ్మంగారి తత్వం పాడుకొంటూ వచ్చింది. ఆ పిల్ల భుజాల మీద చేతులు వేసి గ్రుడ్డి తలిదండ్రులు నడుస్తున్నారు.

హు! ఈ చిన్న పిల్లకున్న బుద్ధీ కూడా తనకు లేదు! ఆ పిల్లకు చదువు రాదు. కష్టపడే వయసు లేదు. కాని తలిదండ్రులను బ్రతికిస్తోంది. కానీ తాను? రేయింబవళ్ళు కష్టించి పనిచేసి, తనను చదివిస్తే... చివరకు స్వార్థంతో ముక్కూ, మొహం తెలియని వానితో లేచిపోతోంది! తన వివేకమేమైంది? ముసలి తలిదండ్రులను ఈ బిచ్చగత్తెలాగా తానూ పోషించలేదా? తనకు పెళ్ళి కాకపోతే ఏం మునిగి పోయింది?

అసలీ సువార్తరావు ఎవరు? ఇతడి పుట్టు పూర్వోత్తరాలు ఏమిటి? ఏనాడూ తాను ఆలోచించలేదు.

సుశీల తన సీటు క్రింద ఉన్న సువార్తరావు సూట్‌కేస్ పైకి తీసింది. పైన సువార్తరావు వైపు చూచింది. అతడు హాయిగా నిద్ర పోతున్నాడు.

సూట్‌కేస్‌కి తాళం వేయలేదు.

సుశీల నెమ్మదిగా సూట్‌కేస్ తెరచింది. పైబట్టలు తొలగించింది.

అక్కడ ఉన్న వస్తువులు చూడగానే ఆమె గుండెల్లో దడ బయలుదేరి, ఒళ్ళంతా చెమట పట్టింది.

విస్కీ సీసా, రివాల్వరూ, అందమైన అమ్మాయిల నగ్నఛాయా చిత్రాలూ.....!

మనుషుల్లో దేవుడని తాను భ్రాంతిపడి నమ్మి వెంట వచ్చినది ఈ దుర్మార్గుడితోనా?

రైలు కీచుమంటూ ఏదో స్టేషన్‌లో ఆగింది.

సుశీల ఒక్కక్షణం గూడా ఆలసించక రైలు దిగింది.

వేరే రైలెక్కి తెల్లవారు జాముకు తిరిగి యింటికి చేరింది.

గాలివాన వెలిసింది.

సుశీల కోసం అమ్మానాన్నలు రాత్రంతా మేలుకొని, వాకిట్లోనే పడిగాపులు పడి ఎదురు చూస్తున్నారు.

నాన్నని చూడగానే సుశీల ఆయన పాదాలు కౌగిలించుకుని ఏడుస్తూ "నాన్నా నాన్నా! ఇంకెప్పటికీ మిమ్మల్ని విడిచి పోను! ఎప్పుడూ మీకు తోడు నీడగా ఉంటా! చెల్లెల్నీ తమ్ముడినీ నేనే చదివిస్తా!" అన్నది.

"పిచ్చి పిల్లా! రాత్రి ఈ గాలివానలో ఎక్కడో చిక్కుపడి పోయి వుంటావు. ఇప్పుడు క్షేమంగా ఇంటికి చేరావుగా! ఈ మాత్రం దానికే ఇంత బెంబేలు పడిపోతే యెలా? లోపలికి పోయి తల తుడుచుకొని, పొడి బట్టలు వేసుకో!" అన్నాడు సుదర్శనం.

"ఏమండీ! గాలివాన పూర్తిగా వెలిసినట్లేనా" అన్నది. సీతమ్మ.

"రానీవే! ఇక ఎన్ని గాలివానలు వచ్చినా మనకేం ఫరవాలేదు" అన్నాడు సుదర్శనం నిబ్బరంగా! □



## కునుకు తీసిన నేరానికి శిక్ష!

ప్రాన్క్లిన్ పట్టణంలో రాత్రి గస్తీ తిరుగ వలసిన పోలీసు రాబర్ట్ లినార్డ్ తన కారులో ఓ కునుకు తీశాడన్న నేరం మీద న్యూ జర్సి కోర్టులో జడ్జి ఆర్థర్ ఆతన్ని నాలుగు నెలల పాటు సస్పెండ్ చేశారట అర్ధ రాత్రి పూరు చివర కారులో కూర్చుని రాత్రి పహారా కాయమంటే వో నిముషం కునుకు మీద పడటం తప్పుకాదు అది న్యాయమె కానీ డ్యూటీలో వున్నపుడా కునుకు నేరం క్రింద ఫిర్యాదు చేసినపుడది నేరమవుతుంది అన్నారటా జడ్జి గారు తీర్పు నిస్తూ

## తప్పతాగి బంధువుని హత్య!

మదుర ఆవనియా పురానికి చెందిన 27 ఏళ్ల వస్తాబి అనే యువకుడు పరిపూర్ణంగా తప్పతాగి తన బంధు వర్గాన్ని పచ్చి తమిళంలో తిట్టూ వారికి చెందిన రహస్యాలను వారి వీధిలో బహిరంగంగా ప్రచారం ఆరంబించే సరికి జ్ఞానయ్య అనే వో బంధువు 'ఎన్నడా' అని పోట్లాటకు వచ్చాడట అన్నిటికీ సిద్ధపడి వచ్చిన వస్తాబి తాను తెచ్చుకున్న కత్తిని లటుక్కున తీసి కసక్కునా జ్ఞానయ్యను పొడిచి చంపేశాడట అడ్డొచ్చిన తపమణి అనే అతనికి బలమైన గాయాలయ్యాయట

## తల్లితండ్రుల నిరాకరణ – భార్య మృతి!

దిండిగల్లుకు చెందిన 21 ఏళ్ళ సౌందరరాజన్ 19 ఏళ్ళ ఈశ్వరి అనే తక్కువ కులం అమ్మాయిని ప్రేమించి వివాహం చేసేసుకుని ఆమెతో యింటికి వెళ్తే తల్లిదండ్రులు ఆతన్ని నిరాకరించారట ఎన్ని




విధాల. ... వొప్పుకోలేదన్న బాధతో పెళ్ళయిన అయిదో రోజున ఆ దంపతు లిద్దరూ విషం త్రాగారట ఈశ్వరి మాత్రం చనిపోయిందట

## అంధకారంలో అత్యద్భుత శక్తి!

మానవుని కన్నుకు అత్యద్భుతమైన శక్తి వున్నదట ఒక్క నిముషం చీకటిలో వున్నాక కళ్ళు తమ శక్తిని పది రెట్లు పెంచుకుంటాయట 20 నిముషాలు చీకటిలో వుంటే ఆరువేల రెట్లు ఎక్కువ శక్తిని పొందుతాయట నలభై నిముషాల చీకటి అనంతరం ఈ శక్తి 25 వేల రెట్లవుతుందట– ఈజిట్ నమ్మబుల్"

## ఏళ్ళు పెరిగే కొద్దీ తరిగే నాసికా పుటాల శక్తి!

సాదారణంగా 65 ఏళ్ళు దాటాక వాసన పసిగట్టే శక్తి తగ్గుతుందట చివరికి పొగాకు, నిమ్మపండు, సబ్బు గాలుల వాసన నాసికాపుటాలు గుర్తుకున్నా పసిగట్ట లేవట 40 ఏళ్ళు దాటాక ఈ శక్తి తగ్గుతూ పోతుందట అయితే యీ పోవడం స్త్రీలలో కన్నా పురుషుల లోనే ఎక్కువట

## భర్త పెట్టే హింసలు భరించలేక భార్య ఆత్మహత్య!

మదురాంతకం అనే వూరుకు చెందిన సెయ్యూరు అనే గ్రామంలో 25 ఏళ్ళ మాలతి అనే ఆమెకు, 27 ఏళ్ళ ఏళుమలై అనే అతనికి రెండేళ్ళ క్రితం పెళ్ళయిందట ఆనాటి నుంచ మాలతి అత్తమామలు, భర్తా చేరి కట్నం మరింత తేవాల్సింది నువ్వు ఇప్పుడయితే ఏం' పోయి మీ బాబు నడిగి, పత్రా అని మాటలతో చేతలతో, చేతులతో కూడా ఆమెను హింసించ నారంబించారట రెండేళ్ళయినా తన జీవితంలో యీ కార్యక్రమంలో మార్పు లేకపోయేసరికి మాలతి పడక గదిలో భర్త నిద్ర పోయాక వురి పోసుకు చనిపోయిందట

## పిన్నుపై ప్రధానమంత్రి వ్యాఖ్య!

ఢిల్లీలో వో స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్ నేషనల్ కన్వెన్షన్ సభను ఆరంబించిన ప్రధాని రాజీవ్‌గాంధీ చొక్కాకు తగిలించిన బాడ్జికి వున్న పిన్ను చూపించి, మనం ఈ పిన్ను కూడా సరిగా చక్కగా తయారు చెయలేకపోతున్నాం దీని మొన సరిగా లేదు చొక్కాకి గుచ్చబోతే అదే వంకర పోతోంది అన్నారట

## ఫలించని పథకం!

శ్రీలంక నుంచి ప్రాణాలు కాపాడుకుని భారతదేశం వచ్చిన వారిలో ఒక కుటుంబం తిరుచ్చి కోటయపట్టులోని వో శరణాలయం వంటి దాంట్లో తలదాచుకున్నారట ఆ కుటుంబానికి చెందిన ఆనంది అనే 15 ఏళ్ళ అమ్మాయిని 34 ఏళ్ళ జాన్, 22 ఏళ్ళ అలోసియస్ అనే యిద్దరు యువకులు పట్టపగలు ఎత్తుకుపోవాలని వేసిన పథకం పాడవడంతో యిద్దరూ ఏస్తళ్ళు తీసి, అందర్ని బయపెట్టి పారిపోయారట వారెవరూ ఎందుకు ఈ పిల్లను ఎత్తుకు పోవడానికి వచ్చారు అనే విషయం పోలీసు విచారిస్తోందట

## కట్టుడుపళ్లలో బ్యాంకు అకౌంట్ల వివరాలు!

వర్జినియాకు చెందిన స్పాట్ సిల్వేనియా నగరంలో వో అర్ధరాత్రి స్మశానంలో వో శవాన్ని త్రవ్వి తీస్తున్న యిద్దర్ని పోలీసులు పట్టుకున్నారట వారిద్దరూ అన్నాచెల్లెళ్ళట ఇద్దరూ చేరి తమ తండ్రి శవాన్ని బయటకు తీసి, ఆయన పళ్ళు పీకుతున్నారట వాటీజ్దిస్ అని పోలీసు లడిగితే తమ తండ్రి కట్టుడు పళ్ళలో ఆయన స్విస్ బ్యాంకు ఎక్కవుంట్ వివరాలున్నాయని తెలపిచ్చారట ధనమూలమ్ ఇదం జగత్!

## కన్ను కొట్టి పిలవడం నేరం కాదు!

హార్ట్‌ఫర్డ్ కంట్రీ మెర్సిల్యాండ్‌లో వో 19 ఏళ్ళ పార్ద్యు అనే బాలామణి తన విటుల వేటలో మఫ్టీలో వున్న వో యిద్దరు పోలీసు అధికారులకు కన్నుకొట్టి కామక్రీడకు రమ్మని పిలిచిందట ఆ




యిద్దరూ ఆమెను సాయంపట్టి కోర్టుకు ఈడుస్తే కేసు విచారించిన జడ్జిగారు ఆమె నిరపరాధి అనీ, వారిని పిలవడం తప్ప ఏ నేరమూ చయలేదని ప్రకటించారట. □

# వద్దు బాబోయ్!...పెళ్ళొద్దు!

కొటికలపూడి త్రిమూర్తి సత్యనారాయణ

తాయారు, తాతారావు గాఢ నిద్రలో వున్నారు

ఉన్నట్టుండి – ఆ ఇంటి సీలింగ్ విరిగి మీద పడిపోయేలా– అబల అర్తనాదంలా–'కెవ్'మన్న కేక వినిపించిందా గదిలో!

ఆకేకకి ఉలిక్కిపడి లేచి కొడుకు మంచం వైపు చూశారు, తాయారు, తాతారావు

సోంబాబు మంచం మీద కూర్చొని చలిజ్వరం వచ్చిన వాడిలా వణికి పోతూ కనిపించాడు బెడ్‌లైటు కాంతిలో!

తాతారావు గబగబా స్విచ్ బోర్డు దగ్గరకెళ్ళి లైటు ఆన్ చేశాడు

"ఏమైయిందిరా సోము?' కొడుకు దగ్గరకెళ్ళి గాబరాగా అడిగింది తాయారు

"ఎందుకలా అరిచావ్?' అడిగాడు తాతారావు

సోంబాబు ఏమీ సమాదానం చెప్పకుండా పరుగు పందెంలో పాల్గొన్న వాడిలా ఒగురుస్తున్నాడు.

"మీరెళ్ళి పెద్ద తపేళాతో మంచినీళ్ళు పట్రండి!..'

తాతారావు క్షణంలో వంట గదిలోకి వెళ్ళి మంచి నీళ్ళు తీసుకొచ్చాడు

హైదరాబాద్ నుంచి ఊడిపడ్డ వాడిలా ఒక్కచుక్క మిగల్చకుండా తపేళా నీళ్ళు తాగేసి – 'బ్రేవ్' మని త్రేన్చాడు సోంబాబు

'ఇప్పుడు - చెప్పు?.. పీడకలేమయినా వచ్చిందా?' అడిగింది తాయారు

లేదన్నట్టు తల అడ్డంగా ఊపాడు సోంబాబు.

"మరెందుకలా అరిచావ్?" అడిగాడు తాతారావు

"వద్దు బాబోయ్! పెళ్ళొద్దు!" . " భీతహరిణిలా అన్నాడు సోంబాబు– శరీరంలో ఇంకా ఒణుకు తగ్గలేదు,

"పెళ్ళొద్దా?.. ఏం? . " భార్యా భర్తల నోటి నుంచి ఒకేసారి వెలువడిందా మాట

"పెళ్ళొద్దంటే – వద్దు!.. అంతే!! ... " బింకంగా అన్నాడు సోంబాబు.

'ఇంత వరకూ వచ్చాక వద్దంటే ఎలారా?. ముహూర్తం పెట్టుకున్నాం – శుభలేఖలు వేయించాం – అందరికీ పోస్టు కూడా చేశాం.... పెళ్ళి మూడు రోజులుంది! .. " సోంబాబు ఎందుకలా వద్దంటున్నాడో అర్థం కాలేదు తాయారుకి.

'అమ్మా! .. దయచేసి పెళ్ళి ఆపు చేసేసెయ్యి!.... " బ్రతిమాలు తున్నట్టుగా అన్నాడు సోంబాబు.

"ఎందుకు ఆపు చేయమంటున్నావ్?.... అమ్మాయి గురించి ఎవరైనా ఏదైనా చెడుగా చెప్పారా?. " అడిగింది తాయారు

'లేదు

మరెందుకు పెళ్ళి వద్దంటున్నావ్?'

ఎందుకంటే?.. ఎందుకంటే? అసలు మీకెలా చెప్తే అర్థం అవుతుందో నా కర్థం కావటం లేదు!" పిచ్చిగా జుట్టు పీక్కున్నాడు సోంబాబు

మంచి సంబంధం! పాతిక వేలు కట్నం? ఇంత వరకూ వచ్చాక ఈ సంబంధం తప్పిపోతే నీ ముఖానికి పాతిక పైసలు కూడా ఎవరూ ఇవ్వరు! పాడు ఆలోచన్లు కట్టి పెట్టి పడుకో! . గయ్యిమంది తాయారు

మీ అమ్మ చెప్పినట్టు విను' అన్నాడు తాతారావు

'మహా మీరు వింటున్నారని! .. నడపండి! విసురుగా తన మంచం వైపు వెళ్ళింది తాయారు

భార్యను అనుసరించాడు తాతారావు

తల్లి మీద భలే కోపం వచ్చింది సోంబాబుకి!

వేసవిలో 'విజయవాడలో ఓ మెయిన్ రోడ్డు మీద చెప్పులు లేకుండా కొన్ని గంటలు నిలబెట్టాలని– నీళ్ళు దొరకని 'హైదరాబాదు'లో కొన్నాళ్ళు వుంచాలని పించింది!

పడుకోవాలని ఎంత ప్రయత్నించినా– ఏవో దృశ్యాలు సంఘటనలు వెంటాడుతూ అతని కంటి మీద కునుకు పడనీయటం లేదు!

ఎంత మర్చిపోదామను కున్నా మర్చిపో లేక పోతున్నాడు! కళ్ళారా చూశాడేమో, కళ్ళ ముందే మెదులుతున్నాయి! .

* * * * *

సోంబాబుకి ఆ ఊళ్ళో వున్న గవర్నమెంటు కాలేజీలో రికార్డ్ అసిస్టెంటుగా ఉద్యోగం వచ్చి సంవత్సరం దాటింది!

ఉద్యోగం వచ్చింది కదా– పెళ్ళి కూడా చేసేస్తే తమ వంతు బాధ్యత తీరిపోతుందని – సంబంధం కుదిర్చి, ముహూర్తం కూడా పెట్టారు సోంబాబు తల్లిదండ్రులు

వేసవి కాలం – కాలేజీకి శలవులు కారణంగా– శుభలేఖలు మిగతా స్టాఫ్‌కి ఇవ్వటానికి వాళ్ళ ఇళ్ళకే బయల్దేరాడు. సైకిల్ మీద సోంబాబు

* * * * *

సోంబాబు సైకిల్ గంగారావ్ ఇంటి ముందాగింది!

సైకిల్ స్టాండు వేసి, ప్రహరి గేటు తీసుకొని లోపలకు వెళ్ళాడు.

ముందు గదిలో కుర్చీలో కూర్చొని ఏదో సస్పెన్స్ నవల సీరియస్‌గా చదువుతూంది ఓ భారీ కాయం.

"ఏవండీ .... " గుమ్మం ఇవతల్నుంచే పిలిచాడు సోంబాబు

సోంబాబు పిలుపు వినిపించలేదు! ఆవిడ లోకంలో ఆవిడ వుంది!

ఈసారి సోంబాబు తలుపు మీద పెద్దగా చప్పుడు చేస్తూ పిలిచాడు

అంతే!'బేర్' మని గట్టిగా అరుస్తూ – కుర్చీలోంచి 'దబ్బున క్రింద పడిపోయిందావిడ!

ఆ అరుపుకి వంటింట్లోంచి గంగారావు హుటాహుటిన వచ్చాడు – చేతిలో గరిటతో!

'ఏం జరిగిందే? ' క్రింద పడివున్న భార్య – పర్వత వర్ధనిని కుదుపుతూ అడిగాడు గంగారావు.

'ఏమో? నువ్వు ఇంట్లో వున్నావో, లేదో అడుగుదామని ఈవిడ్ని పిలిచానంతే! పెద్దగా అరుస్తూ – గాలివానకి చెట్టు విరిగి పడిపోయినట్టు – కుర్చీలోంచి క్రింద పడిపోయింది గంగూ!. " చెప్పాడు సోంబాబు

'నువ్వు శాకోస మొచ్చావా? ఎందుకు? అడిగాడు గంగారావు

"నా రాక సంగతి తర్వాత చెబుతాను! ముందు ఈ విడగారి ముఖాన కాసిన్ని నీళ్ళు చల్లు! .' అని సోంబాబు అనగానే – నీళ్ళు తీసుకొచ్చి పర్వత వర్ధని ముఖం మీద చల్లాడు గంగారావు

పర్వతవర్ధని నెమ్మదిగా కళ్ళు తెరిచి, లేచి కూర్చొని, ప్రక్కనే వున్న సోంబాబుని చూసి, మళ్ళీ కెవ్'మని అరిచి, గంగారావుని గట్టిగా వాటేసుకుంది

'అయ్'బాబోయ్!. వదిలెయ్! . ఇంత గట్టిగా పట్టుకోకు!.. నీ చేతులతో నీ తాళి తెంచుకోకు! వదిలెయ్ పర్వతం!. " పర్వతవర్ధని బాహు బంధాల్లో– గంగారావు బక్క ప్రాణం గిలగిల్లాడి పోతోంది!

ఇంకాసేపు భర్తని 'అలాగే పట్టుకొని వుంటే – జీవితాంతం వితంతువు ఫించన్‌తో బ్రతక వలసి వస్తుందేమోనని భయం వేసి– గంగారావుని వదిలేసి, నీర్సంగా వచ్చి కుర్చీలో కూలబడింది పర్వతవర్ధని

ఆ బరువు మోయటం బాగా అలవాటేమో– ఎలాంటి అపశోపాలు పడలేదు కుర్చీ!....

'ఏం జరిగిందే?.... " భార్య బాహు బంధాల్లో చిక్కుకొని, పోయే ప్రాణాలని పోకుండా కాపాడుతున్న గంగారావు నీర్సంగా అడిగాడు

"ఇతనెవరు?' అన్నట్టుగా చూసింది, గంగారావు వైపు తిరిగి.

"ఇతను నా కొలీగ్! ,' ఇద్దరం ఒకే కాలేజీలో పన్చేస్తున్నాం.... ' అని చెప్పి –

ఇంతకీ నువ్వెందుకు జడుచుకున్నావ్?' అని అడిగాడు గంగారావు

ఇదిగో! ఈ క్రైం, సస్పెన్స్, థ్రిల్లింగ్ హార్రర్ నవల చదువుతున్నాను ఇందులో విలన్ ఎవరినైనా చంపటానికి వచ్చేటప్పుడు, ఇదిగో, ఈయన చప్పుడు చేసినట్టే చేసుకుంటూ వచ్చి తలలు తెగనరుకుతాడు! తలుపు చప్పుడు వినిపించగానే – నవలలోని విలన్ వచ్చాడేమోనని హడలి చచ్చాను! అంది పర్వతవర్ధిని.

పెళ్ళికొడుకుని– హీరోలా వున్న నన్ను – విలన్ అంటారేమిటండి? ' పర్వతవర్ధిని మీద గయ్యిమని లేచాడు సోంబాబు

'ఏవిట్రా? ఏవిటి నువ్వంటున్నది?. . ' గాబరాగా అడిగాడు గంగారావు

"పధ్నాలుగున నా పెళ్ళి! . వెడ్డింగ్ కార్డు ఇచ్చి వెళ్దామని వచ్చాను! . అసలు విషయం చెప్పాడు సోంబాబు




నీ పెళ్ళా?! నీ వయసెంత? ' అడిగాడు గంగారావు

"ట్వంటీ ఫైవ్!

ఇంకా నిక్కర్లు తొడిగే వయసే!" అయినా అన్నం వార్చటం, కూరలు వండటం మీ నాన్న నీకు నేర్పాడా?"

"నేర్పుతానని ఒకట్రెండు సార్లన్నాడు– నేనే నేర్చుకోనన్నాను! "

"ఎందుకని?'

"అవన్నీ ఆడవాళ్ళు చేసే పనులు!'

'మరి మీ నాన్న ఎందుకు చేస్తున్నాడు?"

"మా అమ్మకి ఎప్పుడూ ఒంట్లో బాగోదు! ఓసారి తలనొప్పి ఇంకోసారి నడుమునొప్పి ఇంకోసారి కాళ్ళు నొప్పులు.

నీ బొంద! అసలు కారణం అది కాదు! ఈ ఆడవాళ్ళు.. ' ఇంకా ఏదో చెప్పబోతూ ప్రక్కనున్న పర్వతవర్ధినిని చూపించాడు గంగారావు.

"వంటింట్లో ఏదో మాడు వాసన వస్తోంది వెళ్ళండి! ' అని గంగారావు వైపు గుర్రుగా చూసింది పర్వతవర్ధిని

"పెళ్ళి చేసుకొని నేను, మీనాన్న – మా లాంటి వాళ్ళింకెందరో వంటిళ్ళకి బలయిపోయాం! మా స్థితికి నువ్వు రాకూడదని మా కోరిక! . వీలైతే జీవితంలో అసలు పెళ్ళే చేసుకోకు! ..

"శుభమా అని పెళ్ళి చేసుకోబోతూంటే వద్దంటారేమిటి? మీ రెళ్ళండి వంట గదిలోకి! ." అంటూ గంగారావు వైపు ఉరిమి చూసింది పర్వతవర్ధిని

కిక్కురు మనకుండా వంట గదిలోకి జారుకున్నాడు గంగారావు

'ఆయన మాటలు మీరేం పట్టించుకోకండి! పెళ్ళి చేసుకోండి!, నాలాంటి మరో ఆడది సుఖపడుతుంది! మీ పెళ్ళికి ఆయన, నేను వస్తాం! అంది పర్వతవర్ధిని

సోంబాబు ఇక్కడి పరిస్థితి చూసేసరికి కాస్త మనస్తాపం కలిగింది! నీర్సంగా సైకి తెక్కాడు

* * * * *

సోంబాబు సైకిల్ బంగార్రాజు ఇంటి

ముందాగింది!

చేత వున్న శుభలేఖల కట్టను ఆ చేతిలోంచి ఈ చేతిలోనికి మార్చుకొని, తలుపులు తెరిచి వున్న గదిలోకి వెళ్ళబోతూ - తక్కున ఆగిపోయాడు సోంబాబు

బంగార్రాజుని అప్పడాల కర్రతో గొడ్డును బాదినట్టు బాదేస్తోంది ఓ ఆడశాల్తీ! ..

బహుశా ఆవిడ బంగార్రాజు భార్య అయింటుంది! అయింటుందేమిటి? భర్తని అప్పడాల కర్రతో చితగొట్టే హక్కు ఒక్క పెళ్ళానికి తప్ప మరెవరికుంటుంది?. ..

పత్రికల్లో వచ్చే అప్పడాల కర్ర మీది కార్టూన్లను చూసి - కార్టూనిస్టులను తిట్టుకొనేవాడు- అప్పడాల కర్రతో పెళ్ళాలు మొగుళ్ళను నానా బాధలు పెడుతున్నట్టు వేస్తున్నారేమిటా అని!

ఇప్పుడు తెలుస్తోంది- కార్టూనిస్టులు అప్పడాల కర్రమీద కార్టూన్లు ఎందుకు గీస్తున్నారో?!

అమ్మో! .. . భర్తన్న భక్తి లేకుండా బంగార్రాజుని ఎలా బాదేస్తోందో?

ఈ బాధలన్నీ ఎలా భరిస్తున్నాడో బంగార్రాజు పాపం!? ..

బంగార్రాజు చేసిన నేరమేమిటో? .

త్వరలో తనకీ పెళ్ళికాబోతూంది! ..

గంగారావులా తనూ వంట చేయవలసి వస్తుందేమో? ఈ బంగార్రాజులా రోజూ పెళ్ళాంతో అప్పడాల కర్రతో దెబ్బలు తినవలసి వస్తుందేమో?..

అమ్మో!!

ఈ ఆలోచనే భరించ లేకపోయాడు సోంబాబు.

పెళ్ళిచేసుకున్న వాళ్ళని - వాళ్ళనుభవిస్తున్న నరకాన్ని ప్రత్యక్షంగా చూశాక కూడా పెళ్ళి చేసుకోవాలను కోవటం - కావాలని ఊబిలో

# వద్దు బాబోయ్!... పెళ్ళొద్దు!!

దిగినట్టే! .

పెళ్ళి వద్దు! . గిళ్ళీ వద్దు! .

బ్రతుకంతా ఇలా బ్రహ్మచారిగా గడిపేద్దాం!. . . అనుకొని, వెనక్కి తిరిగి వచ్చేస్తూంటే-

'సోంబాబూ!. ." అంటూ బంగార్రాజు పిలిచాడు

సోంబాబుకు ఆ కేక వినిపించినా, వినిపించనట్టు వచ్చేస్తుంటే - బంగార్రాజు గబగబా దగ్గరకొచ్చి-

"ఎందుకొచ్చావ్? . ఎందు కెళ్ళిపోతున్నావ్?" మాగొడవలో నిన్ను గమనించనే లేదు! . " అన్నాడు

మౌనంగా వున్నాడు సోంబాబు

"అరె! .. వెడ్డింగ్ కార్డ్స్! . మేరేజ్ ఎవరిది? అంటూ సోంబాబు చేతిలో వున్న శుభలేఖల కట్టను లటుక్కున లాక్కొని, ఓ శుభలేఖ చూసి-

'నీ పెళ్ళే!' 'అన్నాడు ఆశ్చర్యంగా బంగార్రాజు.

అక్కడికి వచ్చిన బంగార్రాజు భార్య - భాగ్యంని చూసి జడుసుకున్నాడు సోంబాబు బంగార్రాజు చాటుగా నిలబడ్డాడు

'ఒసేవ్ భాగ్యం! నీ చేతిలోని అప్పడాల కర్రని చూసి భయపడు తున్నాడు ఇతను- అది అక్కడ పడేసి రా! . " అన్నాడు బంగార్రాజు

"దీన్ని చూసి భయపడ్డ వాడు - రేపు దీని దెబ్బలు ఏం తింటాడు?. . " అంది భాగ్యం

'అదీ పాయింటే సోంబాబు! .. రా!.. టీ త్రాగి వెళ్దువుగాని! . " అంటూ సోంబాబు చెయ్యి పట్టుకొని లోపలకు లాక్కెళ్ళబోయాడు బంగార్రాజు.

బంగార్రాజు చేతిలోని శుభలేఖల కట్టను లాక్కొని, అతని చేతిలో వున్న చేతిని విదిలించుకొని-

"వద్దు - వెళ్ళొస్తా! . అంటూ సైకిలెక్కి స్పీడుగా తొక్కుతున్నాడు - వెనక ఎవరో అప్పడాల కర్రతో తరుముకు వస్తున్నట్టు!

* * * * *

'సోంబాబూ! .. "

సైకిల్ మీద స్పీడుగా వెళ్ళిపోతున్న సోంబాబు - ఆగి వెనక్కు తిరిగి చూశాడు

రామచంద్రం రిక్షాలోంచి పిలిచాడు రిక్షాలో అతని ప్రక్కన ఓ ఆడావిడ ఓ పెద్ద బట్టల మూట .

ఆగివున్న రిక్షాలోంచి దిగి -

"నా కోసం మా ఇంటికి వెళ్ళావా? నేను, మా మిసెస్ బజారు కెళ్ళాం . పెళ్ళి చేసుకోబోతున్నావట! . ఇప్పుడే బజార్లో గంగారావు కనిపించి చెప్పాడు... " అన్నాడు రామచంద్రం.

'రిక్షాలో ఆ బట్టల మూటేమిటి? . బిజినెస్ చేయిస్తున్నావా మీ మిసెస్ చేత? . అడిగాడు సోంబాబు.

"బిజినెస్సా?. నా బొందా?. లేటెస్ట్ చీరలు వచ్చాయట - కొంటారా? కొనరా? . అని పీక మీద కూర్చుంది! . ఇంట్లో నిత్యావసర వస్తువులు లేకపోయినా ఫరవాలేదు గాని- లేటెస్ట్ చీర ఏదైనా వస్తే కొనకపోతే ఒప్పుకోదు!... ఈవిడ చీరలతో మా ఇల్లొక శారీషోరూంలా వుంది!. . ప్రతి ఫస్ట్ తారీఖున అప్పులవాళ్ళు కాలేజీకి వచ్చి నా జీతం ఎగరేసుకు పోవటం నీకూ తెలుసు! . ఆ అప్పులన్నీ చీరలకోసం చేసినవే! . ఏమిటో ? . . . పెళ్ళెందుకు చేసుకున్నానా ! .. భగవంతుడా అని ఏడుస్తున్నాను! " తన బాధను వెళ్ళగ్రక్కు కున్నాడు రామచంద్రం.

"ఏవండోయ్! రండి! . ఈ చీరలన్నీ ఇంటికెళ్ళాక కట్టుకొని చూసుకోవాలి! . " రిక్షాలోంచి కేకవేసింది రామచంద్రం భార్య - చూడామణి.

"వెళ్తాను!.... నీ పెళ్ళికి తప్పకుండా వస్తాను! . . " అని గబగబా వెళ్ళి రిక్షా ఎక్కాడు రామచంద్రం.

రిక్షా వెళ్ళి పోయినా అలా చూస్తూండి పోయాడు సోంబాబు కాసేపు

తన పెళ్ళాం కూడా ఇలా చీరలు కొనమని వేధిస్తుందేమో?..

అన్ని చీరలు ఎలా కొనగలడు? .

తననెంత?. . తన జీతమెంత?.. .

రామచంద్రంలా తనూ అప్పులు పాలు కావాల్సిందేనా? .

'ఏమైనా సరే! .. తను మాత్రం పెళ్ళి చేసుకోకూడదు!.... ' తిరుగు లేని నిర్ణయం తీసుకొన్నాడు సోంబాబు.

అయినా ఈ దృశ్యాలు వెంటాడుతూ అతడ్ని భయకంపితుడ్ని చేస్తున్నాయ్!...

* * * * *



తెలుగు చలన చిత్ర చరిత్రలో ఏకైక భారీ చారిత్రాత్మక చిత్రం!

కృష్ణంరాజు
సమర్పించు

దాసరి నారాయణరావు

గోపీకృష్ణా మూవీస్

# తాండ్ర పాపారాయుడు

సినిమా-స్కోప్



నిర్మాత **యు వి సూర్యనారాయణరాజు**

మాటలు కొండవీటి వెంకటకవి సంగీతం యస్ రాజేశ్వరరావు కెమెరా పియస్ ప్రకాష్ కూర్పు డి.వెంకటరత్నం కళ భాస్కరరాజు

సోంబాబు భయపడినంతా జరిగిపోయింది!

"పెళ్ళొద్దు బాబోయ్!" అని నెత్తి, నోరు కొట్టుకొని మరీ విలపించాడు సోంబాబు

కొడుకు మొర వినిపించుకో లేదా మాతృహృదయం

కొడుకు పెళ్ళి చేసేసి, వేరే కాపురం పెట్టించేసి చేతులు దులుపుకుంది తాయారు

* * * * *

సాయంత్రం ఆరు గంటలయింది!

కాలేజీ నుంచి ఉస్సూరుమని ఇంటికొచ్చే సరికి – గుమ్మంలో అప్పడాల కర్రతో అపర కాళికలా నిలబడివుంది దుర్గ

'ఇప్పుడా ఇంటి కొచ్చేది?' గుర్రుగా చూసింది దుర్గ

"పనెక్కువగా వుంది అందుకే రావటం ఆలస్యమైయింది!" . మేష్టారు ముందు తప్పు చేసిన వాడిలా సంజాయిషీ చెప్పాడు సోంబాబు

వంట ఎవరు చేస్తారు?. కాలేజీ నుంచి ఇంత ఆలస్యంగా వస్తే?.. అయినా, మీరు వెళ్ళేటప్పుడు ఏం చెప్పాను? . సాయంత్రం త్వరగా తగలడండి – బజారుకెళ్ళి చీరలు కొనాలి' అని చెప్పానా?". .

'ఔనన్నట్టు బుద్ధిమంతుడిలా తలాడించాడు సోంబాబు.

"నా మాటంటే మీకు లెఖ్ఖ లేదన్న మాట! ... అంతేగా!?. . " అప్పడాల కర్రను ఝుళిపించింది దుర్గ

'రేపు వెళ్దాం నసిగాడు.

'చూస్తాను'. రేపు కూడా ఇలా చేస్తే ఒప్పుకోను– తెలిసిందా?"

"అలాగే"

"వెళ్ళండి'. వంట చేయండి త్వరగా. ఆకలేస్తోంది! ... అని లోపలకు వెళ్ళడానికి



"మహిషాసుర మర్ధని"
చిత్రం: దేవు దీక్షితులు

# వద్దు బాబోయ్!... పెళ్ళొద్దు!!

దారిచ్చింది దుర్గ

గబగబా వంట గదిలోకి వెళ్ళి బోరున ఏడ్చాడు సోంబాబుకి.

కొత్త కాపురం పెట్టిన ఈ నాల్రోజుల్నుంచి ఇవే బాధలు!'

ఈ బాధల్ని జీవితాంతం భరించాలంటే భయమేస్తోంది సోంబాబుకి.

ఈ బాధల్నించి విముక్తి పొందాలని సన్యాసుల్లో కలిసిపోదామనుకుంటే– ఈవిడగారు కూడా తనతో పాటే వచ్చేస్తుందట!...

ఎన్ని తిప్పలు తెచ్చావురా భగవంతుడా?

వద్దంటున్నా పెళ్ళి చేసిన తల్లిని తిట్టుకున్నాడు

నవ్వు వినిపిస్తే -తలపైకెత్తి చూశాడు సోంబాబు

వంటగది గుమ్మం దగ్గర నిలబడి హాయిగా నవ్వుతూంది దుర్గ

సోంబాబు తక్షణ ఏడుపు ఆపేసి ఆమెవైపు ఆశ్చర్యంగా చూస్తుండిపోయాడు ఎప్పుడూ సీరియస్‌గా వుండే శ్రీమతి నవ్వుతూంటే అయోమయంగా వుందతనికి!

"పెళ్ళి ముహూర్తాలు పెట్టుకున్నాక పెళ్ళి చేసుకోనని గొడవ చేశారట ఎందుకని? " అడిగింది దుర్గ

"ఈ బాధలన్నీ భరించలేక!" అక్కసుగా అని–

'ఈ విషయం నీకెల్లా తెలిసింది?" అడిగాడు సోంబాబు

"పెళ్ళిలో ఎవరో అనుకుంటూంటే విన్నాను మిమ్మల్ని ఓ ఆటపట్టిద్దామని ఈ నాల్రోజుల్నుంచి

నేనీ నాటకం ఆడుతున్నాను! అయినా, మీ దృష్టిలో, ఆడవాళ్ళంతా గయ్యాళిగాను, భర్తలను బాధలు పెట్టే వాళ్ళుగాను వుంటారనుకున్నారా?

ఎవరో కొందరుంటారు!. అందరూ అలా వుంటారనుకోవటం పొరపాటు! . . అంది దుర్గ

"ఇదంతా నాటకమా?!" . నమ్మశక్యం కాలేదు సోంబాబుకి

"ఈ నాలుగ్గురోజుల్నుంచి మీరు పడుతున్న అవస్థ చూడలేక– ఈ వేళ్టితో నా నాటకానికి తెరవేశాను! . మీరెళ్ళి అలా హాల్లో కూర్చొని పేపరు చూస్తుండండి– క్షణంలో వంట. చేస్తాను! . " నవ్వుతూ అంది దుర్గ

'అయ్ బాబోయ్!.. నేనెంత అదృష్టవంతుడ్ని! . ఆనందంతో గట్టిగా అరుస్తూ దుర్గని వాటేసుకున్నాడు సోంబాబు □





# హైదరాబాద్ నోట్‌బుక్

మహాజనసమ్మర్దంతో క్రిక్కిరిసి వున్న లండన్ వీధులను, న్యూయార్క్ వీధులను సులభంగా దాటగలిగాను గాని, మన హైదరాబాద్ వీధులను దాట లేకపోతున్నాను – అన్నారు విదేశాలలో చాలకాలం వుండి మాతృదేశంపై మమకారంతో హైదరాబాద్‌లో స్థిరపడిన మిత్రులు శ్రీరాయలు నాతో ఎందుచేత? – అన్నాను. అక్కడ పౌరులకుక్రమశిక్షణ వుంది ఎవరో దుర్మార్గులు తప్ప, తక్కిన వారు ఇతరులకు ఇబ్బంది కలిగించరాదనే చైతన్యంతో ప్రవర్తిస్తారు. యాతాయాత నియమాలను పాటిస్తారు పాటించకపోతే తమకే కాక, తమతో పాటు మరి కొందరికీ నష్టంకలుగుతుందనే భావం వారికి ఎప్పుడూ జాగృతంగా వుంటుంది. అధికారులు కూడ కచ్చితంగా యాతాయాత నియమాలను అమలు పరుస్తారు – అన్ని చెబుతూ పోయారు ఆయన నేను వింటూండగానే నా మనసు మన జంటనగరాల వీధులలో పరుగెత్తసాగింది. మన పౌరులకు ట్రాఫిక్ రూల్సు వుల్లంఘించడం వీరకృత్యం పచ్చలైట్ పడింది. మనం ముందుకు పోవచ్చునని రెండు అడుగులు వేశామనుకోండి, లైట్లను, పోలీసు అంగన్యాసకరన్యాసాలను లెక్క చేయకుండా ఎక్కడి నుంచో రివ్వున కారు దూసుకు పోతుంది వెంట్రుకవాసిలో మనకు మరణగండం తప్పుతుంది బదుకు జీవుడా అని మరి రెండడుగులు వేశామనుకోండి, బెల్లు, బ్రేకులు, హేండిలు ఏమీ లేని ద్విచక్ర శకటం అధిరోహించిన యువవీరుడు వెనుక నుంచి గుద్దుతాడు. అది అతని తప్పు కాదు. సర్కస్ భవూను సైకిలు లాగ వున్న అతని సైకిలు తప్పు. బవూనుకు, అతనికి తేడా ఒకటే, బవూనుకు ఎలాటి సైకిలునైనా, ఒంటి చక్రంసైకిలునైనా నడపడం తెలుసు. సైకిలు అతని అధీనంలో వుంటుంది. యువకుడు సైకిలు పరతంత్రుడు. అది ఎటు లాగితే అటు వెళ్తుతాడు. ఇక్కడ నో ఎంట్రీ వుంది, ఏ వాహనమూ రాదు అని నిశ్చింతగా వెళ్ళదలచామనుకోండి ఏ స్కూటరో, హోండాలోండావో, అడ్డంగా వస్తుంది. నో ఎంట్రీ అన్నారు గదా – అని అడుగుతామనుకోండి. దాన్ని గమనించాలని వుందా? ఎవరూ లేరుగా! అంటాడు హోండావాలా. ఈ పరిస్థితిలో బధిర పంగ్వంధ బిక్షుకాదులు రోడ్డు దాటడం వైతరిణి దాటినట్టే అవుతుంది కనుక, యాతాయాతాధికారులు తక్కిన నగరాలలో లాగా అక్కడక్కడ సబ్–వేలు పెట్టించడం అవసరం సబ్ వేలు అవసరమైన స్థలాలు ఇవి ఆబిడ్స్ నుంచి ప్రారంభిద్దాము. హైదరాబాద్ నగరంలో ఆబిడ్స్ పెద్ద చతుష్పథం రోజూ కొన్ని వేల వాహనాలు రాకపోకలు సాగిస్తుంటాయి. పోలీసులు ఎంత కట్టుబాటుగా ప్రవర్తించినా, సవ్యంగా జరుగదు వ్యవహారం కనుక అక్కడ ఒక సబ్ – వే వుండాలి ఉంటే, సులభంగా జనం. అటు ఇటు దాటడం సులభం, వాహనాలు నిరాఘాటంగా పోవచ్చు ప్రమాదాలు జరుగడం తగ్గుతుంది కూడ బషీర్‌బాగ్ ఐదు రోడ్ల కూడలి. అక్కడ ఒక సబ్‌వే ఏర్పాటు చేస్తే, ఐదు వైపులా జనం స్వేచ్ఛగా దాటవచ్చు ఆ కూడలికి సబ్‌వే అందమూ కలిగిస్తుంది చిక్కడపల్లి ఆర్ టి.సి క్రాసు రోడ్డు పరిసరాలలో దాదాపు పది సినిమా హాళ్ళున్నాయి చిక్కడపల్లి ప్రాంతం సహజంగానే జనంతో బిలబిలలాడుతూంటుంది. సినిమా వదలినప్పుడయితే, జనం ఇసక వేస్తే రాలనంతగా గుమిగూడి బస్సులు మొదలయిన వాహనాలు అంగుళం కదలడానికి అరగంట పడుతుంది జరూరు పని మీద పోయే వారి గతి అధోగతే కనుక అక్కడ ఒక సబ్‌వే వుండి తీరాలి దానివల్ల సమర్దం చాల తగ్గిపోతుంది జనానికి జరూరు పనులు పాడు కాకుండాను వుంటాయి నాంపల్లి స్టేషను హైదరాబాద్ పెద్ద లైను స్టేషను బస్సులు, సైకిళ్ళ, స్కూటర్ల రాకపోకలు విపరీతం రైళ్ళు అందుకోడానికి వెళ్ళే ప్రయాణికుల తొందర ఇప్పుడు కొద్దిగా ట్రాఫిక్కును క్రమబద్ధం చేసినా, ఇంకా చాల చేయాలి కనుక అక్కడ సబ్ వే అవసరం. ప్రయాణికులు నిశ్చింతగా తమ సామానుతో రోడ్డు దాటి వెళ్ళవచ్చు. ఖైరాజ్జంజాహి మార్కెటు పెద్దకూడలి. కోట్ల వ్యాపార కేంద్రం జాంబాగ్ వైపు ఇంచుమించు సగం పళ్ళ దుకాణాల భుక్తం కుళ్ళిన పండ్ల వాసనలతో తల దిమ్మెక్కి పోతుంది అక్కడ ఒక సబ్‌వే అవసరం. జనం తరాల పాటు తలుచుకొంటారు సరే. చార్మినార్ దగ్గర సబ్‌వే అవసరమని వేరే చెప్పనక్కరలేదు చుట్టూ ఇరుకు వీధులు. వాటిలో బస్సులు, సైకిళ్ళ, స్కూటర్ల, కారులు, చాలనందుకు పళ్ళ, కూరగాయల, బిస్కట్ల, గాజుల, పింగాణీ సరకుల తోపుడు బళ్ళు. చార్మినార్ చూడడానికి వచ్చే జనం, ఈ రద్దీలో ప్రాణాలు అరచేత పట్టుకొని దాటవలసి వుంటుంది ఇక్కడ సబ్‌వే వుంటే, జనం సంతోషిస్తారు మంగల్‌హాట్ వద్ద తరచు ప్రమాదాలు జరుగుతుంటాయి. లారీల రాకపోకలు ఎక్కువ. అక్కడ సబ్‌వే అవసరం నాంపల్లిలోని బజార్‌ఘాట్ కూడలిలో సబ్‌వే అవసరం లకడీకాపుల్, అమీర్‌పేటలలో సబ్‌వేలు వుండాలి లకడీకాపుల్ కూడా పెద్దకూడలి పెక్కు బస్సులు అక్కడ అగుతాయి అమీర్‌పేట నగర పరిసరాల బస్సుల దారి అక్కడ కూడా సబ్‌వే అవసరం. సుల్తాన్‌బజార్ కూడలి, కాచిగూడా కూడలి, రాంకోట్ కూడలి కూడా సబ్వే భాగ్యానికి నోచుకోవాలి సికించరాబాద్ పూర్వం పరిశుభ్రంగా వుండేది. వీధిలో ఒక్క కాయితం ముక్క పడితే వెంటనే ఎత్తి వేసే ఏర్పాట్లుండేవి బ్రిటిష్ వారు భారతదేశంలో దానిని తమ దక్షిణాది రాజధాని గాను, బోలారంను దక్షిణాది సైనిక కేంద్రంగాను అభివృద్ధి పరచారు. కనుక బెంగళూరు, మైసూరుల అందంతో అలరారేది హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్‌లో లీనమయిన పిదప దాని రూపు మారింది సికిందరాబాద్ ప్లాను ప్రకారంగా కట్టిన కొత్త పట్టణం గనుక, మొదటి నుంచి మిలిటరీ క్రమశిక్షణ వాసన గల పట్టణం గనుక ఎంత చెడినా బాగుంటుంది. అయినా, అక్కడా ఈ మధ్య ట్రాఫిక్ నియమోల్లంఘనం ఎక్కువయి జనం రాకపోకలు కష్టతరమవుతున్నాయి కనుక ప్రధానమైన కూడళ్లన్నింటా సబ్‌వేలు అవసరం మనోహర్ టాకీస్ కూడలిలో, సంగీత్ టాకీస్ కూడలిలో, మహంకాళి దేవాలయం కూడలిలో, బాటా కూడలిలో, మోండా మార్కెట్ కూడలిలో, జనరల్ బజార్ కూడలిలో, వడ్ల బజార్ కూడలిలో, సీతాఫల్‌మండీ కూడలిలో, సబ్‌వేలు అవసరం. సబ్‌వేలు నగరానికి అందాన్నిస్తాయి, జనానికి సౌకర్యాన్నిస్తాయి, ట్రాఫిక్ అధికారులకు కొంత విశ్రాంతి నిస్తాయి ట్రాఫిక్ అధికారులూ, మునిసిపల్ కార్పొరేషన్ అధికారులూ, టౌన్ ప్లానింగ్ శాఖవారూ, మునిసిపల్ శాఖామాత్యులు ఈ విషయం పరిశీలించాలి

**ఉపశ్రుతి:–**

తాతా, తాతా నాకు కారు కొనీ, స్కూలుకు వేసుకుపోతా – అన్నాడు మనవడు ఫల్గున నీవు పెద్దగయిన తర్వాత కొందాంలే – అన్నాను. ఊఁ హూఁ ఇప్పుడే కొనీ – అన్నాడు నసుగుతూ ఫల్గున ఎందుకూ? అంత అర్జంటా? – అనడిగాను. ఔను, నేను పెద్దవాడయ్యే వేళకు అంతా మారిపోతుందట కార్లే వుండవట, కనుక అర్జంట్ – అన్నాడు ఫల్గున నేను ప్రపంచ గతికి అవాక్కయాను

–తిరుమల రామచంద్ర

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd, by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor S Radhakrishna, Phones - Business 61247, 61248, Editorial. 75667*

# సరికొత్త బొమ్మల సీరియల్






























# పోర్ట్‌లాండ్ సిమెంట్ 100 సంవత్సరాలకు పైగా ఉపయోగంలోవున్నా, ఎందువల్ల ఇప్పుడే తిరిగి కనుగొనబడుతోంది?



పోర్ట్‌లాండ్ సిమెంట్. దీని నాణ్యత సమూలంగానూ, విప్లవాత్మకంగానూ మార్పుకి లోనవుతూవుంది. విజయవాడకి 80 కిమీ దూరంలో వున్న జయంతిపురంలోని మా క్రొత్త కర్మాగారంలో పోర్ట్‌లాండ్ సిమెంట్ మాచేత "తిరిగి కనుగొనబడుతోంది."

భారతదేశంలో 'కంప్యూటరైజ్‌డ్ కిల్న్ కంట్రోల్' విధానం గల మొట్టమొదటి కర్మాగారం మాదే అవుతుంది. కిల్న్ ఉష్ణోగ్రతలను సమర్థవంతంగా అదుపులో ఉంచడంద్వారా సిమెంట్ నాణ్యతను నిర్ధారించడమే అందుకు కారణం. ఈ క్లిష్టమైన పనిని చేపట్టడానికి ఒక కంప్యూటర్‌ని మేము వుపయోగిస్తున్నాము. ఇది "యఫ్. యల్. స్మిత్ కంపెనీవారి ఫజ్జి లాజిక్ విధానం" సహాయంతో మనిషికన్నా కచ్చితంగా, రేయింబగళ్లు పనిచేస్తుంది.

ఫలితం—దేశంలోనే సాటిలేని నాణ్యత గల సిమెంట్, ప్రతి బస్తాలోను అంతటా ఏకరీతిగా వుండేది, శక్తివంతమైనది ఉత్పత్తిఅవుతుంది.

మీ ధనానికి అధిక విలువ ఇవ్వడానికే మేము ఎల్లప్పుడూ కృషిచేశాము. ఈ రోజున పారిశ్రామిక ప్రపంచంలో మద్రాస్ సిమెంట్స్ లిమిటెడ్ ఎంతగానో గౌరవాన్ని సంపాదించుకోవడంలో ఆశ్చర్యంలేదు. ఇప్పటికి 25 సంవత్సరాలకు పైగా తమిళనాడు, కేరళలో రామ్‌కో సిమెంట్ అత్యధికంగా విక్రయించబడుతుంది. సాంకేతిక విజ్ఞానంలో ప్రథమ స్థానం ఆక్రమించడమే అందుకు కారణం.

## కంప్యూటర్ పర్యవేక్షణలో నాణ్యత

# రామ్‌కో సిమెంట్




మద్రాస్ సిమెంట్స్ లిమిటెడ్
739, మౌంట్ రోడ్
మద్రాసు 600 002

1987 జనవరి నుంచి మా జయంతిపురం ఫ్యాక్టరి నుంచి లభిస్తుంది

CLARION-M-MCL-26A-86-TEL

అతివల అందానికి...
అద్భుతమైన
రూపానికి...
'గాంధిటెక్స్'
కాటన్ చీరెలు!




లేటెస్ట్ వెరైటీలు
౯౯౯౯, ౮౮౮౮,
౭౭౭, ౬౬౬
తరంగిణి,
రజని, రేష్మ
సీమా, సరిత
కవిత, విజయ
ఆర్గండి డోరియా
పల్లవి డోరియా
స్పెషల్

గాంధిటెక్స్
కాటన్ శారీస్

గాంధ్ శారీస్ (ప్రై) లిమిటెడ్, బొంబాయి వారి తయారీ

H.K. INTERNATIONAL/GS/TL

గాంధి టెక్స్ కాటన్ శారీస్ అన్ని షాపులలో లభించును

ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్లు : విజయవాడ,వస్త్రలత : అమరా నాగేంద్రుడు అండ్ సన్సు, శ్రీ లక్ష్మి క్లాత్ కార్పొరేషన్, గిరిజా శారీ స్టోర్సు

10-16, October, '86